# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 8 హైదరాబాద్ 97 ఆగస్ట్ 2009 పేజీలు : 60 రు. 10

- ఫోకస్ : సింగరేణి బొగ్గు గనులు నిన్నా, నేడూ, రేపూ
- కేంద్ర బడ్జెట్ 2009 - 10
- యశ్‌పాల్ కమిషన్ సిఫారసులు
- ఆర్.ఒ. మిషన్‌ల అసలు ఉద్దేశాలు
- లాల్‌ఘడ్ పరిణామాలు
- క్షేత్రపరిశోధన అవసరమేమిటి?

# జాతీయ బాలల హక్కుల పరిశోధన ఫెలోషిప్‌లు 2009-10

భారతదేశంలో బాల్యం అందరికీ ఒకటే కాదు. నిజానికి అనేక రకాల బాల్యాలు సహజీవనం చేస్తాయి. సామాజిక, ఆర్థిక హోదా, శారీరక, మానసిక సామర్థ్యాలు, ప్రాంతం బాల్యం మీద ప్రభావం వేస్తాయి. బాలలు కూడా సర్వసత్తాక అధికారం కలిగిన, సమానమైన సభ్యులని గౌరవించడం తొలి అడుగు. ఆ దిశలో వారిని కేవలం లబ్ధిదారులుగా కాక భాగస్వాములుగా గుర్తించడం వారి సముచిత ప్రయోజనాలేమిటో అర్థం చేసుకోవడం కూడా సాగాలి.

బాలలకు న్యాయం అనే రాజ్యాంగ చట్రం లోపల ఉత్తమ ప్రయోజనం ప్రాతిపదికన బాలల హక్కులకు ఉన్న విభిన్న కోణాలను అన్వేషించే పరిశోధనకు చైల్డ్ రైట్స్ అండ్ యూ (సిఆర్‌వై) దరఖాస్తులను కోరుతున్నది.

బాల్యాలను నిర్ణయించడంలో సంస్కృతీ, చట్టాలూ, నైతిక సూత్రాలూ, విధానాలూ పరస్పరం సంబంధంలో ఉండేటప్పుడు ఏ సాధారణ, సంక్లిష్ట సత్యాలు వెల్లడవుతాయో అన్వేషిండం, కనిపెట్టడం, ఆ పనిని నియత పద్ధతిలోనూ, అనియత పద్ధతిలోనూ సాగించడం గురించి కొత్త భావనలను సిఆర్‌వై ఆశిస్తున్నది.

### కేంద్రీకరించదగిన విషయాలు

వారి జీవితానుభవాలను, దృక్పథాన్ని బట్టి ఈ ఇతివృత్తాలను విస్తరించడానికి, వ్యాఖ్యానించడానికి మిమ్మల్ని ప్రోత్సహిస్తున్నాం.

- బాల్యపు అనుభవంలో, వ్యక్తీకరణలో, కథలనూ, జానపద గీతాలనూ, కవితలనూ సామాజిక సంపర్కానికి చిహ్నాలుగా వాడుకోవడంలో సృజనాత్మకత, ఊహా శక్తి.
- బాలలకు తోటి బాలలతో, రాజ్యంతో, సమూహంతో, కుటుంబంతో ఉండే సంబంధాల అన్వేషణ.
- ఇల్లు, బడి, పని, ఆటస్థలం, పాలనావ్యవస్థలు వంటి నిర్ణయాధికార వేదికలలో బాలల పాత్రను అంగీకరించడం గురించి, తిరస్కరించడం గురించి ఆధారాలు.
- బాలలు అనుభవించే లేదా గమనించే జాతితత్వం, అసమానత, ఘర్షణల ఆధారాలు, సంబంధాలు
- ఉత్తమ ప్రయోజన ప్రాతిపదిక ఒక విలువనా, ఒక రాజ్యాంగ హక్కా, ఒక వ్యాఖ్యాన సహితమైన సంస్కరణ ప్రయత్నమా, లేక చట్టబద్ధ పాలనా?

### ఫెలోషిప్‌కు వర్తించే సూత్రాలు

**అర్హత :** దరఖాస్తుదారులు భారతదేశంలో నివసిస్తున్న భారతీయులై ఉండాలి. పద్దెనిమిదేళ్లకు పై బడి ఉండాలి. గతంలో ఈ ఫెలోషిప్ పొందినవారు అనర్హులు. ఫీజులు వసూలు చేయని ప్రభుత్వ పాఠశాలలో చదివిన అభ్యర్థులకు ప్రాధాన్యత ఉంటుంది. (ఇప్పటికే సాగిన అధ్యయనాల ప్రకారం, గ్రామాలలోనూ, పట్టణ మురికివాడలలోనూ, రెండు వేల అనాదృత వర్గాలలో సిఆర్‌వై పనిచేసిన అనుభవం ప్రకారం తేలినదేమంటే ప్రభుత్వ పాఠశాలలో చదువుతున్న విద్యార్థులు ప్రధానంగా దళితులు, ఆదివాసులు, స్త్రీలే యజమానులుగా ఉన్న లేదా భూమిలేని కుటుంబాలలోని బాలబాలికలే.)

ఫెలోషిప్ పొందగల అభ్యర్థులు సిఆర్‌వై పాటించే విలువలకు కట్టుబడి ఉంటారని ఆశిస్తున్నాం:

***మానవ గౌరవం పట్ల విశ్వాసం; లౌకికవాదం; అహింస; జవాబుదారీతనం; కొత్తదనం; పారదర్శకత; సహకార కృషి***

**భాష:** అభ్యర్థులు ఇంగ్లిష్‌తో సహా ఏ భారతీయ భాషలోనైనా పనిచేయవచ్చు. ఏ భాషలో పనిచేయదలచుకున్నారో స్పష్టంగా సూచించండి. దరఖాస్తు పరిశీలన ఇంగ్లిష్‌లోనూ, మీరు పనిచేయదలచుకున్న భాషలోనూ జరుగుతుంది. అందువల్ల మీ ప్రతిపాదనను, మీ జీవిత విశేషాలను (కరికులమ్ విటే), గతంలో చేసిన పనిని ఇంగ్లిష్ అనువాదంలో జతచేయండి.

**సిఆర్‌వై నుంచి మీకు అందేది:** మొత్తం మీద పది ఫెలోషిప్‌లు ఇవ్వడం జరుగుతుంది. అవి ఒక్కొక్కటి రు. 50,000 నుంచి రు. 1,00,000 వరకు ఉంటాయి. ఈ నగదు సహాయ భృతి మాత్రమే. అభ్యర్థులు తమ ప్రాథమిక వృత్తి ఉద్యోగాలలో కొనసాగవచ్చు. ఒక లక్ష రూపాయలకన్న ఎక్కువ ప్రతిపాదనలు పరిశీలనకు స్వీకరించడం జరగదు.

**తప్పనిసరి ఉండవలసినవి:**

1. ఒక మూడు పేజీల ప్రతిపాదన. అది మీరు పరిశోధించదలచుకున్న అంశాన్ని, ఒక చట్రంలోపల మీ పరిశోధనా ప్రశ్నల వివరాలను, ప్రతిపాదిస్తున్న సంవిధానాన్ని, పరిశోధనా కాలక్రమాన్ని, సంబంధిత సాహిత్య జాబితాను, లేదా ఈ అంశం మీద ఇప్పటికే సాగిన అధ్యయనాలను, ఒక వివరమైన ఆర్థిక అంచనాను (బడ్జెట్) కలిగి ఉండాలి.

2. రెండు పేజీల జీవిత విశేషాలు (సివి)

3. సంబంధిత విషయం మీద మీరిప్పటికే రాసి ఉన్న, ప్రచురితమైన లేదా ప్రచురితం కాని పత్రం లేదా వ్యాసం లేదా ఏదైనా సమాచారం.

ఒక సంవత్సరం కన్న ఎక్కువ వ్యవధి పట్టే ప్రతిపాదనలు పరిశీలించబడవు.

ఎంపికైన అభ్యర్థులు తమ పరిశోధనా ప్రణాళికలను ఇతరులతో పంచుకోవడానికీ, సామూహిక అనుభవం నుంచి గ్రహించడానికీ మార్చ్ 2010 ప్రాంతంలో ఒక ప్రాథమిక వర్క్‌షాప్‌లో పాల్గొనవలసి ఉంటుంది. అలాగే అర్ధవార్షిక సంభాషణా సమావేశంలో పాల్గొనవలసి ఉంటుంది. ఈ రెండు సమావేశాలకూ అవసరమైన ప్రయాణ, వసతి, భోజన ఖర్చులను సిఆర్‌వై భరిస్తుంది. కొందరు అభ్యర్థులకు వారి అభిప్రాయాలను, భవిష్యత్తు ప్రణాళికలను సిఆర్‌వై మదింపు బృందపు సభ్యులతో చర్చించడానికి అవకాశం ఉంటుంది.

### ప్రచారం

పరిశోధనా ఫలితాలను వివిధ భాషలలోకి అనువదించి, వేరువేరు వేదికల ద్వారా కార్యకర్తలకు, విద్యావేత్తలకు, అభివృద్ధి వ్యవహారాల నిపుణులకు, ఆసక్తిగల సాధారణ ప్రజానీకానికి అందుబాటులో ఉంచడం జరుగుతుంది. తద్వారా బాలల హక్కుల గురించిన చర్చాసరళిని ప్రభావితం చేయడానికి, ఉత్తమ ప్రయోజన ప్రాతిపదికన ప్రచారం చేయడానికి ప్రయత్నం జరుగుతుంది.

### యాజమాన్యం

తుది పరిశోధనా నివేదిక మీద, వస్తువు మీద రచయితలుగా అభ్యర్థుల హక్కును గౌరవిస్తూనే ఈ క్రమంలో సేకరించిన సమస్త సమాచారాన్ని పరిశీలనలను వీలైనంత ఎక్కువ మందికి బహిరంగంగా, ఉచితంగా అందుబాటులో ఉంచడం జరుగుతుంది. అభ్యర్థులు తమ పరిశోధనా కృషిలోని పరిశీలనలను ప్రచురించుకోవడానికి అవకాశం ఉంటుంది. అయితే ఆ పని జాతీయ బాలల హక్కుల పరిశోధనా ఫెలోషిప్, సిఆర్‌వై సౌజన్యంతో అని ప్రకటించాలి.

ఒకవేళ మీ ప్రతిపాదన మరేదైనా విద్యా సంస్థకు సమర్పించిన దరఖాస్తులో భాగమయినట్టయితే అది ఈ ఫెలోషిప్‌కు అనర్హమవుతుంది. అలాగే అభ్యర్థి ఇక్కడ ప్రతిపాదిస్తున్న పరిశోధన సాగించడానికి ఇదివరకే నిధులు పొందుతున్నట్టయితే ఈ ఫెలోషిప్‌కు అనర్హమవుతుంది. ఫెలోషిప్ పరిశోధన సాగుతున్న క్రమంలో అభ్యర్థి గనుక ఈ పరిశోధనా పరిధిని విస్తరించాలని, మరింత లోతుగా జరపాలని భావిస్తే ఆ విషయం గురించి, అదనపు నిధుల అవసరం గురించి మొట్టమొదట సిఆర్‌వై కి తెలియజేయాలి. అలాగే మరేవరైనా దాతలను ఆ నిధుల కోసం అడుగుతున్నట్టయితే వారికి ఇక్కడ ప్రధాన కృషి సిఆర్‌వై సహాయంతో జరుగుతున్నదని చెప్పవలసి ఉంటుంది.

**దరఖాస్తుల దాఖలకు చివరి గడువు సెప్టెంబర్ 12, 2009**

మీ దరఖాస్తును research@crymail.org కి ఈమేయిల్ చేయండి. మీకు ఇంటర్నెట్ అందుబాటులో లేనట్టయితే మీ దరఖాస్తును పోస్ట్ ద్వారా

**CRY - Child Rights and You, Documentation Centre,**
**189 A, Anand Estate, Sane Guruji Marg,**
**Mumbai - 400 011**

ఫెలోషిప్‌కు ఎంపికైన పరిశోధకుల పేర్లను సిఆర్‌వై వెబ్‌సైట్ మీద 2010 ఏప్రిల్ లోపు ప్రకటించడం జరుగుతుంది.



వీక్షణం 97

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఆగస్ట్ 2009
సంపుటి : 7
సంచిక : 8



గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

సబ్ఎడిటర్ :
**పి. గాయత్రీ ప్రసన్న**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్,** హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


## సంపాదకీయం

# ధరలెందుకు పెరుగుతున్నాయి?

ఎన్నికలకు ముందరి ప్రభుత్వాలు కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ ప్రవేశపెట్టిన తాత్కాలిక బడ్జెట్ల స్థానంలో రెండు చోట్లా పూర్తి బడ్జెట్లు వచ్చాయి. కాని నిస్సారమైన ఆ బడ్జెట్ల మీద వ్యాఖ్యానించడం కన్న ముఖ్యంగా నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల గురించి మాట్లాడవలసి ఉంది. బడ్జెట్ల తయారీ, చట్టసభలలో ప్రవేశపెట్టి, కొద్దిరోజులపాటు చర్చలు జరిపి, ఆమోదం పొందడం అనే ప్రక్రియ అంతా ఏ మాత్రం ప్రాధాన్యం లేని మొక్కుబడి వ్యవహారంగా మారిపోయింది. ప్రభుత్వం తీసుకునే అన్ని రాజకీయార్థిక నిర్ణయాలను ప్రకటించే పవిత్ర పత్రంగా ఉండిన బడ్జెట్లు ఆ స్థానాన్ని కోల్పోయి చాల కాలమే అయింది. బడ్జెట్ కు ముందో వెనుకో, బడ్జెట్ తో సంబంధం లేకుండా ముఖ్యమైన రాజకీయార్థిక నిర్ణయాలను ప్రకటించడం, బడ్జెట్లలో మొక్కుబడిగా కొన్ని విధాన ప్రకటనలు చేయడం ప్రభుత్వాలకు అలవాటయిపోయింది. నిజానికి ఈసారి బడ్జెట్ల ప్రవేశం సమయానికి దేశవ్యాప్తంగానూ, రాష్ట్రంలోనూ నిత్యావసర వస్తువుల ధరలన్నీ భయానకంగా పెరిగిపోయి ఉన్నాయి. అటు కేంద్ర బడ్జెట్ ప్రవేశపెట్టిన ప్రణబ్ ముఖర్జీ గాని, ఇటు రాష్ట్ర బడ్జెట్ ప్రవేశపెట్టిన కె. రోశయ్య గాని ధరల నియంత్రణకు ఎటువంటి చర్యలు చేపట్టనున్నారో కనీసమైన ప్రకటనలు కూడ చేయలేదు. ఒకపక్క బియ్యం ధర కిలోకు రు. 35 - 40 దాకా పెరిగిపోగా, కందిపప్పు ధర రు. 80 - 90 దాకా చేరింది. ఈ రెండు ఆహార పదార్థాల ధరల గురించి పెద్దఎత్తున చర్చ జరుగుతున్నది గాని, అసలు నిత్య జీవితావసర వస్తువులన్నిటి ధరలూ విపరీతంగా పెరిగిపోయాయి. నానాటికీ పెరుగుతున్నాయి. ఆ పెరుగుదల అసాధారణంగా యాభై శాతం నుంచి వంద శాతం దాకా ఉంది. ధరలను నియంత్రించడానికి ప్రభుత్వాలు, అధికార యంత్రాంగం ఏ చర్యలూ చేపట్టడం లేదు. పైగా, ప్రజలను వంచించడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తున్నాయి. ధరల పెరుగుదలకు పంట దిగుబడి తక్కువ కావడాన్ని మాత్రమే కారణంగా ఒకవైపు చూపుతూ, మరొకవైపు పొరుగు రాష్ట్రాలలో ధరలు ఆంధ్రప్రదేశ్ లోకన్న ఎక్కువగా ఉన్నాయని, ఆమేరకు మన రాష్ట్రమే నయమని ప్రభుత్వం ప్రకటిస్తోంది. ఆహార సంక్షోభ సమయంలో 2008 లో పేదదేశాల ప్రజలు ఎక్కువ తినడం వల్లనే సంక్షోభం వచ్చిందని అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ వ్యాఖ్యానించినట్టు, ఇప్పుడు కూడ రాష్ట్ర పౌరసరఫరాల మంత్రి జూపల్లి కృష్ణారావు ప్రజలందరూ సన్నబియ్యం తినడం వల్లనే బియ్యం ధరలు పెరిగాయని వ్యాఖ్యానించారు. నిజానికి ధరల పెరుగుదలకు కారణం ఏ ఒక్కటో కాదు. ఆహారధాన్యాల, ముఖ్యంగా పప్పు దినుసుల సాగు విస్తీర్ణం తగ్గడం, అందువల్ల పంటల దిగుబడి తగ్గడం, వ్యవసాయోత్పత్తులలో భవిష్యత్తు ధరల సట్టా వ్యాపారం ప్రారంభం కావడం, చాలా వ్యవసాయోత్పత్తులు అంతర్జాతీయ మార్కెట్‌తో అనుసంధానంలోకి రావడం, లాభార్జన దృష్టితో వ్యాపారులు అక్రమ నిలువలు పోగు చేయడం, ఇంధన ధరలు పెరిగి సరుకుల రవాణా వ్యయం పెరగడం, ప్రజాపంపిణీ విధానాన్ని, చౌకధరల దుకాణాలను బలహీనపరచడంతో బహిరంగ మార్కెట్ వ్యాపారుల ఇష్టారాజ్యంగా మారిపోవడం వంటి అనేక కారణాలు కలగలిసి ధరల పెరుగుదలకు దారితీస్తున్నాయి. ఈ కారణాలలో కొన్ని ప్రత్యక్షంగా ప్రభుత్వ విధానాల వల్ల, నూతన ఆర్థిక విధానాల వల్ల తలెత్తినవి. కొన్ని ప్రభుత్వ యంత్రాంగం సక్రమంగా పనిచేయకపోవడం వల్ల, ఉన్న చట్టాలను కూడ సవ్యంగా వినియోగించకపోవడం వల్ల తలెత్తినవి. ప్రభుత్వం తలచుకుంటే అక్రమ నిలువదారుల మీద, బడావ్యాపారులమీద దాడులు చేసి అక్రమ నిలువలను బయటికి లాగి మార్కెట్లో ఆయా సరుకుల సరఫరాను పెంచి తద్వారా ధరలు తగ్గించవచ్చు. ప్రభుత్వ గిడ్డంగులలో ఉన్న నిలువలను ప్రజాపంపిణీ వ్యవస్థలోకి మళ్లించి ధరలు తగ్గడానికి మార్గం సుగమం చేయవచ్చు. కాని అటువంటి ప్రజోపయోగకర కార్యక్రమాలు చేపట్టడం తమ బాధ్యత అని మన ప్రభుత్వాలు అనుకోవడం లేదు. పాలకపక్షాలు అలా అనుకునేలా ఒత్తిడి తేవడం, ప్రజాందోళనలు నడపడం తమ బాధ్యత అని మన ప్రతిపక్షాలు అనుకోవడం లేదు. ప్రతిపక్షాల ఆర్భాటపు నిరసన కార్యక్రమాలు పత్రికలకూ టీవీలకూ పరిమితమయిపోతున్నాయి. అటు పాలకపక్షానికీ, ఇటు ప్రతిపక్షాలకూ ప్రజల గురించి శ్రద్ధాసక్తులు లేని ఈ స్థితిలో 'ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురుచూడకుండా' ధరలను దించే క్రియాశీల కార్యక్రమానికి, అక్రమ నిలువలను బయటికి లాగడానికి, అధికారయంత్రాంగాన్ని నిలదీయడానికి పూనుకోవలసినది సామాన్య ప్రజానీకమే. వీ

## ఎట్టకేలకు లిబర్హాన్ నివేదిక

బహిరంగంగా లక్షలాది మంది చూస్తుండగా, వందలాది మంది పాత్రికేయుల ఎదుట, భవిష్యత్తుకోసం కెమెరాలు నమోదు కూడ చేస్తుండగా జరిగిన ఒక విధ్వంసం, దేశచరిత్రలో జరిగిన అతిపెద్ద నేరాలలో ఒకటి, ఎలా జరిగిందో విచారించడానికి ఏర్పాటయిన న్యాయవిచారణ కమిషన్ కు పదిహేడు సంవత్సరాల కాలమూ, ఎనిమిది కోట్ల రూపాయల ప్రజాధనమూ కావలసివచ్చాయి. సంఘపరివారం రెచ్చగొట్టిన ఉన్మాదంతో, స్వయంగా భారతీయ జనతాపార్టీ కేంద్ర నాయకులు లాల్ కృష్ణ అద్వానీ, మురళీ మనోహర్ జోషి, ఉమాభారతి, రాష్ట్ర ముఖ్యమంత్రి కళ్యాణ్ సింగ్ కనుసన్నలలో, కాంగ్రెస్ ప్రభుత్వ ప్రధానమంత్రి పి వి నరసింహారావు మౌన ప్రోత్సాహంతో 1992 డిసెంబర్ 6 న అయోధ్యలోని బాబ్రీమసీదును, లక్షన్నర మంది చూస్తూ ఉండగా, కరసేవకులు కూల్చివేశారు. మసీదు విధ్వంసం జరగకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకుంటామని సుప్రీంకోర్టుకు హామీ ఇచ్చి కూడ రాష్ట్రప్రభుత్వం ఆ విధ్వంసాన్ని ప్రోత్సహించింది. దేశవ్యాప్తంగా ముస్లిం మతసమూహపు మనోభావాలను తీవ్రంగా గాయపరచిన ఆ దురంతం జరిగిన పది రోజులకే ఆ వ్యవహారంపై న్యాయవిచారణ జరిపేందుకు సుప్రీంకోర్టు మాజీన్యాయమూర్తి ఎం ఎస్ లిబర్హాన్ నాయకత్వాన ఏకసభ్య కమిషన్ ను కేంద్రప్రభుత్వం నియమించింది. మూడు నెలల లోపల విచారణ పూర్తి చేసి తన నివేదిక ఇచ్చిఉండవలసిన లిబర్హాన్ కమిషన్ 48 గడువు పొడిగింపుల తర్వాత ఎట్టకేలకు 2009 జూన్ 30 న తన నాలుగు సంపుటాల నివేదికను కేంద్రప్రభుత్వానికి సమర్పించింది. చట్ట నిబంధనల ప్రకారం ప్రభుత్వం ఈ నివేదికను, దానిపై తీసుకున్న చర్యల నివేదికను ఆరునెలల లోపుగా పార్లమెంటు ముందు ఉంచి, తద్వారా ప్రజలకు తెలియజేయవలసి ఉంటుంది. కనుక నివేదికలో న్యాయమూర్తి కచ్చితంగా ఏమి నిర్ధారించారో, ఆ నిర్ధారణలపై ప్రభుత్వం ఏ చర్యలు తీసుకోనున్నదో ఇప్పటికైతే తెలియదు. కాని కమిషన్ ను నియమించినప్పుడు రూపొందించిన నాలుగు విచారణాంశాలు ఆ నేరంలో భాగస్వాములైన వారందరి పాత్రనూ బహిర్గతం చేయడానికి సరిపోవు. ఆ విచారణాంశాలు బాబ్రీమసీదు విధ్వంసానికి దారితీసిన ఘటనలను కనిపెట్టడం, ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ నిర్వాహకుల పాత్రను కనిపెట్టడం, భద్రతా ఏర్పాట్లలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వపు వైఫల్యాలను కనిపెట్టడం, విధ్వంస దినాన ఆ ప్రాంగణంలో ప్రచారమాధ్యమాల సిబ్బందిపై జరిగిన దాడులకు బాధ్యులను కనిపెట్టడం మాత్రమే. అసలు ఈ విచారణాంశాలు తయారు చేయడంలోనే దేశంలో పెచ్చరిల్లిన మతోన్మాదం గురించి గానీ, ఆ మతోన్మాదం పెరగడంలో అన్ని రాజకీయ పక్షాల పాత్ర గురించి గానీ, విధ్వంసానికి ఏర్పాట్లు జరుగుతున్నప్పుడు, విధ్వంస వార్తలు వస్తున్నప్పుడు మౌనం, నిర్లక్ష్యం వహించిన పివి నరసింహారావు ప్రభుత్వ పాత్ర గురించి గానీ ప్రస్తావనే లేదు. పైగా ఆ ప్రాంగణాన్ని ప్రతి సందర్భంలోనూ 'రామజన్మభూమి – బాబ్రీ మసీదు ప్రాంగణం' అని ప్రస్తావించారు. నిజానికి అది బాబ్రీ మసీదు మాత్రమే. రామజన్మభూమి అనేది వివాదాస్పదమైన నమ్మకమే తప్ప రుజువు చేయదగిన వాస్తవం కాదు. అక్కడికి సీతారామలక్షణుల విగ్రహాలు చేరినది 1949లో జరిగిన ఒక దొంగచాటు దురాక్రమణ వల్ల మాత్రమే. కనుక కమిషన్ నివేదిక ఏమి చెప్పినా దాని ప్రారంభమే సరిగాలేదు గనుక, ఇంత ఆలస్యమయింది గనుక అది సాధించబోయేది ఏమీ ఉండదు. ఈ దేశంలో ఉన్న బహుళ సమాజాన్ని, వైవిధ్యాన్ని గౌరవించే ఉద్దేశ్యం పాలకులకు లేదని, మైనారిటీ మతస్తులను అవమానించినా, ఊచకోత కోసినా సరయిన విచారణ జరగని, కనీస శిక్షలు పడని వాతావరణం ఉందని ఈ ఉదంతం మరొకసారి తెలియజెపుతోంది.

## హంతకముఠాగా సి ఐ ఎ

అమెరికన్ పాలకవర్గాలు ప్రపంచవ్యాప్తంగా తమ శత్రువులుగా భావించిన వారిమీద దుర్మార్గమైన దాడులకు, హత్యాప్రయత్నాలకు పాల్పడతాయని, హత్యలు కూడ చేస్తాయని అందరికీ తెలిసిన విషయమే. అది ఈసారి స్వయంగా అమెరికన్ ప్రభుత్వ గూఢచార సంస్థ సెంట్రల్ ఇంటిలిజెన్స్ ఏజెన్సీ (సిఐఎ) అధికారిక ప్రకటనలలో వెల్లడయింది. జూన్ లో హౌజ్ ఇంటిలిజెన్స్ కమిటీ ముందర ఇచ్చిన వాంగ్మూలంలో సిఐఎ డైరెక్టర్ లియోన్ పానెట్టా, బుష్ పాలనా కాలంలో సిఐఎ ఒక హంతక బృందాన్ని తయారుచేసిందని, ఆ హంతకుల ముఠా గురించి ఉపాధ్యక్షుడు డిక్ షెనీకి తప్ప మరెవరికీ తెలియదని, కాంగ్రెస్ లోనూ, సెనేట్ లోనూ ఉన్న ప్రజా ప్రతినిధులకు తెలియకుండా ఈ హత్యా కార్యక్రమం సాగిందని చెప్పాడు. అమెరికా చట్టసభల సభ్యులకు తెలియకుండా అమెరికా విదేశాంగ నీతి, విదేశాలలో హంతక నీతి కొనసాగుతున్నదని తెలుసుకుని ఆ సభ్యులు దిగ్భ్రాంతి చెందారు. అప్పటినుంచీ ఇది పెద్ద చర్చనీయాంశమయింది. నిజానికి 1970లలో, 1980లలో అటువంటి హత్యలకెన్నిటికో సిఐఎ పథకరచన చేసింది. కాని 1976లో అప్పటి అధ్యక్షుడు జెరాల్డ్ ఫోర్డ్ అమెరికన్ ప్రభుత్వోద్యోగులెవరూ రాజకీయ హత్యలలో పాల్గొనడం గాని, హత్యలకు కుట్ర చేయడం గాని నిషిద్ధమని ప్రకటించాడు. అయినా ఆతర్వాత కూడ అమెరికన్ గూఢచార సంస్థ ఎడాపెడా హత్యలకు పాల్పడిందనేది, కిరాయి ముఠాలతో హత్యలు చేయించిందనేది జగమెరిగిన సత్యం. మళ్లీ సెప్టెంబర్ 11, 2001 న్యూయార్క్ ప్రపంచవాణిజ్య సంస్థపై దాడులతర్వాత జార్జి బుష్ 'టెర్రరిజం మీద యుద్ధం' ప్రకటించాడు. అల్ ఖైదాను ప్రధాన శత్రువుగా ప్రకటించాడు. ఆ నేపథ్యంలో డిక్ షెనీ ఈ హంతక ముఠాలను తయారు చేశాడని, ఆ విషయం చట్ట సభలకు తెలియకుండా దాచాలని కోరాడని ఇప్పుడు సిఐఎ ఉన్నతాధికారులు చెపుతున్నారు. ఇలాంటి ఒక రహస్య కార్యక్రమ ప్రణాళిక ఉన్నదని తనకు ఆ ముందు రోజే తెలిసిందని, తాను దాన్ని వెంటనే రద్దు చేశానని లియోన్ పానెట్టా కాంగ్రెస్ కమిటీకి జూన్ 23న చెప్పాడు. అప్పటికి ఆయన అధికారంలోకి వచ్చి నాలుగు నెలలు అయింది. ఆ నాలుగు నెలలు కూడ ఈ హంతక కార్యక్రమం కొనసాగిందన్నమాట. అంతకు ముందే సుప్రీంకోర్టులో సమాచార స్వేచ్ఛా చట్టం కింద దాఖలయిన ఒక వ్యాజ్యం వల్ల ఏప్రిల్‌లో బారక్ ఒబామా ప్రభుత్వం ఎన్నో బుష్ ప్రభుత్వ రహస్య పత్రాలను బయట పెట్టవలసి వచ్చింది. అమెరికన్ ప్రభుత్వం శత్రువులను ఏ విధంగా చిత్రహింసలకు, హత్యలకు గురిచేస్తున్నదో ఆ పత్రాలు వెల్లడించాయి. అలా రహస్య పత్రాలను బయట పెట్టడం తమ ప్రభుత్వం బహిరంగంగా, పారదర్శకంగా ఉండదలచుకున్నదనడానికి సూచిక అని ఒబామా ప్రభుత్వం ప్రకటించింది. కాని గత అత్యాచారాలకు, అక్రమాలకు, హింసాకాండకు ఎవరినీ బాధ్యులను చేసి విచారణ జరపదలచుకోలేదని ఒబామా సిఐఎ అధికారులకు అభయ హస్తం కూడ ఇచ్చాడు. అంతే కాదు, ఒకవైపు గత ప్రభుత్వ అక్రమాలను గురించి ప్రకటిస్తూనే, విమర్శిస్తూనే ఒబామా ప్రభుత్వం ఆ విధానాలనే యథాతథంగా కొనసాగిస్తోంది. పాత ప్రభుత్వ హయాంలో అమెరికన్ ప్రభుత్వం, సిఐఎ విదేశాలలో నిర్వహించిన జైళ్లన్నీ యథావిధిగా, రెడ్ క్రాస్ వంటి సంస్థలకు కూడ ప్రవేశం లేకుండా కొనసాగుతున్నాయి. అక్కడ చిత్రహింసలూ, హత్యలూ సాగుతూనే ఉన్నాయి. ఒక్క ఉదాహరణ చెప్పాలంటే అఫ్ఘనిస్తాన్ లోని బాగ్రామ్ వైమానిక స్థావరంలోని జైలులో వందలాది మంది ఖైదీలు ఎటువంటి నేరారోపణ, విచారణ లేకుండా మగ్గిపోతున్నారు. సామ్రాజ్యవాద దోపిడీనీ పాలననూ కొనసాగించడానికి ప్రధాన సాధనమైన సిఐఎ అధికారం అమెరికన్ ప్రజలకూ, చట్టసభలకూ కూడ అతీతమైనదని రుజువవుతోంది. వీ

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : సింగరేణి బొగ్గు గనులు - నిన్నా, నేడూ, రేపూ

ఇవ్వాళ సింగరేణిలో జరుగుతున్న ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటం అంటే, దేశ సహజ సంపదలు స్థానికులకు చెందకుండా చేసి జాతీయ అంతర్జాతీయ దోపిడి దొంగలకు కట్టబెట్టే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడటం. వారితో అంటకాగుతూ, తెలంగాణ బొగ్గు సంపదను వీలైనంత తక్కువ కాలంలో కాజెయ్యాలని, లేదా అమ్మివేయాలని చూస్తున్న ఆంధ్ర వలస పాలకుల కుట్రలకు వ్యతిరేక పోరాటం. ఇవ్వాళ ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటమంటే పర్యావరణ పరిరక్షణకోసం ఈ భూమి మీద భవిష్యత్ తరాలు బతకాలనే భరోసా ఇవ్వాలనే న్యాయ బద్ధమైన పోరాటం. ఇది మనిషి మనుగడ కోసం జరుపుతున్న పోరాటం. అంతిమంగా ప్రపంచీకరణకు వ్యతిరేక పోరాటం.



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028
















- **మారాజులు** – మంచికంటి కథలు – క్రాంతి ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు.40, ప్రతులకు : మంచికంటి, 4-179, మేడపైన, సాయిక్లినిక్ వెనకాల, దిబ్బలరోడ్, ఒంగోలు – 523002; సెల్ : 9949535895, ఇమెయిల్ : manchikanti64@yahoo.co.in
- **చాంద్‌తార** – కవిత్వం – షాజహానా, స్కైబాబ – నసల్ కితాబ్ ఘర్ – 7 – 154 పేజీలు, పాకెట్ సైజ్, రు. 25, ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాలలో; ఇమెయిల్ : skybaba@ymail.com, shajahana@rockmail.com, 9885420027, 9440322361
- **కోకిల ప్రవేశించే కాలం** – వాడ్రేవు చినవీరభద్రుడు – శ్రీ ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: డా. పి. విజయశ్రీ, 96, నవోదయ కాలనీ, మెహదీపట్నం, హైదరాబాద్ – 500 028; ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **ఆంధ్రప్రదేశ్‌లో విముక్త జాతులు** – వకుళాభరణం లలిత – నేషనల్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 190 పేజీలు, 1/8 డెమీ, రు. 65, ప్రతులకు : సంచాలకులు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, నెహ్రూ భవన్, 5 ఇన్‌స్టిట్యూషనల్ ఏరియా, ఫేస్ – 2, వసంతకుంజ్, కొత్త ఢిల్లీ – 110 070
- **ఊరు వాడ బతుకు** – దేవులపల్లి కృష్ణమూర్తి – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 135 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067, ఫోన్ : 23521849
- **ఒక మాదిగ స్మృతి** – (నాగప్ప గారి సుందర్రాజు పరిచయం) దార్ల వెంకటేశ్వరరావు – తెలుగు సాహిత్య వేదిక ప్రచురణలు – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : ఎం. మంజుశ్రీ, ఇ.నెం. 4-8-89, ఆలమపల్లి, వికారాబాద్, రంగారెడ్డి జిల్లా; డా. దార్ల రవికుమార్, చెయ్యేరు అగ్రహారం, వయా అనంతవరం (ఎస్.ఒ.), తూర్పు గోదావరి – 533 222; సమాంతర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్
- **తెలంగాణం** – వట్టికోట ఆళ్వారుస్వామి – తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ రచయితల వేదిక ప్రచురణ – 316 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఎం. కోదండరామ్, 12-13-578, నాగార్జుననగర్, తార్నాక, సికిందరాబాద్ – 500 017; ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **సింగూరు నుంచి లాల్‌గఢ్ వయా నందిగ్రామ్** – అమిత్ భట్టాచార్య – విస్థాపన్ విరోధి జన వికాస్ ఆందోళన్ – 90 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, సహచర బుక్‌మార్క్, నవోదయ బుక్‌హౌస్
- **కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్** – డాక్టర్ కూరెళ్ల విఠలాచార్య – సాహితీ కుటీరం ప్రచురణ – 74 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : శ్రీమతి కూరెళ్ల యమున, సాహితీ కుటీరం, వెల్లంకి, రామన్నపేట (మం), నల్లగొండ జిల్లా – 508 113, ఫోన్ : 08694 – 255013, సెల్ : 9949539765
- **చిత్రకళాతపస్వి డా. కొండపల్లి శేషగిరిరావు – జీవిత చరిత్ర** – కొండపల్లి (పెండ్యాల) నీహారిణి – కొండపల్లి వేణుగోపాల్‌రావు ప్రచురణ – 268 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: కె. వేణుగోపాల్‌రావు, ఇ.నెం. 1-2-214/5/1, గగన్‌మహల్ రోడ్, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029















'వీక్షణం జూలై 2009 గురించి చిన్న సవరణలు, సూచనలు. 'లాల్‌గఢ్ ఆదివాసుల ఆందోళన' సంపాదకీయ వ్యాఖ్యలో 'ఆ విధ్వంసం మాత్రమే కాక' – ఈ పద సముదాయాన్ని ఇంకా కొన్ని విధ్వంసాలను గురించి చెప్పు సందర్భంలో మాత్రమే వాడవచ్చు. చేయడమే కాక, దోచుకోవడమే కాక – లాంటి వాక్య భాగాల్ని ముందుచేసిన చర్యలకంటే – అవి మంచివైనా, చెడ్డవైనా – కాస్త ఎక్కువగా ఉన్నపుడే వాడాలి. ఉదాహరణకు – 'దొంగలు ఇంటిని దోచుకోవడమే గాక ఇంటి వారిని కొట్టి గాయపరిచారు.' ఇక్కడ కథనంలో 'విధ్వంసం తరువాత' నిర్మాణ పనులు ఉన్నాయి. అంచేత – 'ఆ విధ్వంసం మాత్రమే కాక' – ఈ భాగం పొసగదు. లోపం వాక్యంలో కొట్టవచ్చినట్టు కనబడుతుంది. గమనించకపోవడం ఇబ్బందికరం. 'ఆ విధ్వంసం మాత్రమే కాక', రెండు పదాల తర్వాత వచ్చిన 'కూడ' ఈ రెంటిని తొలగిస్తే కథనానికి ఇబ్బంది ఉండదు. వైరుధ్యమూ ఉండదు. ఇంకా ఈ సంఘటనకు కొన్ని సంవత్సరాల క్రితమే నిర్మాణ అభివృద్ధి కార్యక్రమాలు – అని కొద్దిగా మార్పు చేస్తే అర్థవంతంగా ఉంటుంది. పోతే, రోడ్డు తవ్వడం, చెట్లు నరికి రోడ్డుకు అడ్డంగా పడేయడం పోలీసుల రాకను నిరోధించుటకేనని మీ కథనంలోనే ఉంది. అదేం విధ్వంసం కాదు. ప్రభుత్వ వర్గాలు అనాల్సిన మాట మీరు అనడం బాగలేదు. (సంథాల్‌లు) ఇది ఉచ్చారణకు రాదు. 'సంతాలులు' అని రాస్తే ఇబ్బంది ఏముంది. రాత ఉచ్చారణకు భిన్నంగా ఎందుకుండాలి?

'జాతీయ ఉపాధి హామీ పథకం' బుర్ర శ్రీధర్, కేతిరెడ్డి వాసు, వీరు ఒకరో ఇద్దరో తెలియడం లేదు. ఈ వ్యాసం వీరు ఉపాధి హామీ చట్టం ఉద్దేశాలు చదివి వాటి ఆధారంగా రాసినట్లుంది. కూలీలకు కొందరికి మేలు జరుగుతున్నది కాదనము, అయితే పొక్లెయినర్లతో పనులు చేయించి కొందరు బిల్లు చేసుకుంటున్నారు. గ్రామాల్లో అక్కరకొచ్చే పనులు ఏవీ చేయడం లేదు. కొన్ని చోట్ల ఏమాత్రం ఉపయోగం లేని పనులు కేవలం ఆ పనులు చేయిస్తున్నవారికి ఆదాయం కోసం చేశారు. కొన్ని చోట్ల బోగస్ పేర్లతో డబ్బులు చేసుకున్నారు. 'సోషల్ ఆడిట్' అంటూ, ఎక్కడా జరగడం లేదు. ఏదో కొన్ని ప్రాంతాల్లో జనం చైతన్యవంతులైన చోట జరుగుతుండవచ్చు. కడప జిల్లాలో అది ఎక్కడా జరిగినట్లు లేదు. అన్ని పనుల్లో అవినీతి ఉన్నట్లే ఈ పథకంలో కూడా అది పుష్కలంగా ఉంది. ఇది ప్రభుత్వాన్ని కీర్తించినట్టుగా ఉంది. పోతే, రైతులు ఈ పథకంలో కూలీలు దొరక్క పొలం బీడుపెట్టుకుంటున్నారు. రైతులు ముఖ్యంగా చిన్న, సన్నకారు రైతులు – కూలీలతో ఇబ్బందిపడుతున్నారు. కొన్నాళ్లకు పొలాలు బీళ్లుండి పోతాయి.

**– వి. వెంకట రెడ్డి**
ఇంటేపల్లె, కడప

విశాఖ జిల్లా ఎలమంచిలిలోని 'అవగాహన' గ్రంథాలయంలో మార్క్స్ – ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో, రోజాలగ్జంబర్గ్, చే గువేరా మొదలు ప్రస్తుత మార్క్సిస్టు మేధావుల రచనలు ఉన్నాయి. సోషలిస్టు రిజిష్టరు సంపుటాలు 1997 నుంచీ ఉన్నాయి. ఇంకా ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, సెమినార్, ఫ్రాంటియర్, మెయిన్ స్ట్రీం, మంత్లీరివ్యూ మొదలైన పత్రికలు ఉన్నాయి. వెలువడినంత వరకు తెలుగులో కూడ మార్క్సిస్టు సాహిత్యం ఉంది. చదువుకోవాలనుకునే వారు స్వయంగా రావచ్చు. లేదా సమాచారం కోసం ఫోన్ చెయ్యవచ్చు. అవగాహన, ఎలమంచిలి, విశాఖపట్నం – 531 055; ఫోన్ 08931 – 231834

**– డా. మానేపల్లి**
ఎలమంచిలి, విశాఖపట్నం

'వీక్షణం' పత్రికలో వ్యవసాయ సంక్షోభం, విద్య, వైద్య, దళిత, మహిళ, అసంఘటిత కార్మికుల సమస్యలపై వ్యాసాలు, ప్రభుత్వ పనితీరు–పథకాల పై, కార్మిక సమస్యలపై వ్యాసాలు, విశ్లేషణలు వస్తే బాగుంటుంది.

**– సోమనాథం**
హరిపురం, శ్రీకాకుళం

'వీక్షణం' జూలై నెల సంచికలో 'మన పాఠశాల విద్యారంగం' గురించి పలువురు విద్యావేత్తలు గణాంకాలతో సహా వివరించిన వారందరికి అభినందనలు. సామాజికంగా, ఆర్థికంగా వెనకబడిపోయి ఉండడానికి, చదువులో వెనకబడిపోయి ఉండడానికి విడదీయరాని సంబంధం ఉందని ఈ గణాంకాలను చూస్తే అర్థం అవుతుంది. ప్రభుత్వానికి మాత్రం అర్థం కావడం లేదు. ప్రభుత్వం ప్రవేశపెట్టిన విధానాల వల్లనే ప్రభుత్వరంగ పాఠశాలలపైన ఉండే విశ్వసనీయత తగ్గుతుంది. సుమారు రెండు దశాబ్దాలుగా అమలు చేసే ప్రయత్నం చేస్తున్న ప్రపంచీకరణ విధానాల వల్ల, ప్రైవేటీకరణ విధానాల వల్లనే ప్రభుత్వరంగ పాఠశాలలు ఉనికిని కోల్పోతున్నాయి. ఇందులో భాగంగానే గత సంవత్సరం ప్రభుత్వం ప్రవేశపెట్టిన 'సక్సెస్ స్కూల్స్' అని చెప్పవచ్చును. విదేశీ సంస్థలు, ప్రపంచబ్యాంక్ నుండి అప్పులు పొందడానికి 6500 పాఠశాలలో ఆంగ్ల మాధ్యమంలో సిబిఎస్ విధానంలో ప్రభుత్వం ప్రవేశపెట్టింది. నిజానికి, గ్రామీణ ప్రాంతాలలోని విద్యార్థుల సామాజిక, ఆర్థిక, కుటుంబ పరిస్థితులను పరిగణనలోనికి తీసుకోకుండా, ఒకటి నుండి ఐదు తరగతుల వరకు తెలుగు మాధ్యమంలో విద్యను అభ్యసించిన విద్యార్థులు ఏకంగా ఆరవ తరగతిలో ఆంగ్లమాధ్యమంలో, అందులోను సిబిఎస్ విధానంలో విద్యను ఎలా అభ్యసిస్తారో పాలకులకే తెలియాలి. మరొక పక్క ఉపాధ్యాయులకు గత వేసవి సెలవులలో కంటి తుడువుగా పదమూడు రోజుల శిక్షణ ఇచ్చి సెంట్రల్ సిలబస్ బోధించండి, అంటే ఎంతవరకు వారు విద్యార్థులకు న్యాయం చేయగలరో 'విజ్ఞులు' ఎవరైనా అర్థం చేసుకోవచ్చు. ప్రస్తుతం చాలమంది ఉపాధ్యాయులు విద్యార్థులకు న్యాయం చేయలేమని భావించి బదిలీల ద్వారా నాన్ సక్సెస్ పాఠశాలలకు వెళ్లడానికి ఆసక్తి చూపుతున్నారు. వీటికి తోడు సకాలంలో ఆంగ్ల మాధ్యమ పాఠ్య పుస్తకాలు అందక, పాఠశాలల్లో తరగతులకు తగ్గటు మౌలిక సదుపాయాలు లేకపోవడం, అధికారుల పర్యవేక్షణ లోపం ఇత్యాది కారణాల వల్ల 'సక్సెస్' పాఠశాలలన్ని 'నాన్ సక్సెస్' పాఠశాలలుగా మారే ప్రమాదం ఉంది. కాబట్టి ప్రభుత్వం చేపట్టే ప్రజా ప్రయోజన విధానాలు ఏవైనా అవి క్షేత్రస్థాయిలో ఎంత వరకు అమలు అవుతాయో, సాధ్య సాధ్యాలను ఆలోచించి అమలు పరచినట్లైతే మంచి ఫలితాలు సాధించే అవకాశం ఉంటుంది.

**– బోరెడ్డి మధుసూదన్ రెడ్డి**
సిద్ధిపేట్, మెదక్

ఎన్నికల ప్రహసనం ముగిసింది. కేంద్రం, రాష్ట్రంలో కాంగ్రెస్ విజయకేతనం ఎగరవేసింది. కేంద్రంలో లెఫ్ట్ పార్టీల మద్దతు లేకుండా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే ఆధిక్యత కాంగ్రెస్ కూటమికి వచ్చింది. గడిచిన ఐదేళ్ల కాలంలో కాంగ్రెస్ మదిలో ఉన్న సంస్కరణలు ఇక అమలులోనికి రానున్నాయి. సంస్కరణలకు వేగం రానుంది. లెఫ్ట్ పార్టీల మద్దతు లేకుండా ప్రభుత్వాన్ని ఏర్పరచగల సత్తా కాంగ్రెస్‌కు రావడం మార్కెట్ వర్గాలకు ఉత్సాహం నింపింది. ముఖ్యంగా మన పారిశ్రామిక రంగంకన్నా అమెరికా పారిశ్రామికవేత్తలు, జి-8 దేశాలు, ఎం.ఎన్.సి.లు, ప్రపంచ వాణిజ్య సంస్థలు ఎక్కువగా హర్షిస్తున్నాయి. ఫలితాలు పూర్తిస్థాయిలో వెలువడకముందే సెన్‌సెక్స్ ఊపందుకుంది. ఈ సూచి త్వరలోనే 21,000 స్థాయికి చేరడానికి ఎంతోకాలం పట్టదని వాణిజ్య వర్గాల అంచనా. గత ప్రభుత్వంలో ప్రవేశపెట్టి అమలు చేయలేని బీమా, పెన్షన్ ఫండ్స్ పథకాలను వెంటనే అమలులోనికి తీసుకురావచ్చు. ఈ కొత్త పెన్షన్ స్కీంను ఉద్యోగ సంఘాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఇంతకాలం లెఫ్ట్‌పార్టీల ఒత్తిడితో ఆగిన డిజిన్వెస్ట్‌మెంట్ విధానాన్ని తిరిగి ప్రారంభిస్తుంది. ఇన్సూరెన్స్, బ్యాంకింగ్ రంగాల్లో విదేశీ పెట్టుబడులను భారీగా పెంచే అవకాశం ఉంది. ఇవేగాక అన్నిరకాల సేవారంగాలలో ఇదే పద్ధతిని అనుసరించవచ్చు.

ముఖ్యంగా దేశంలోకి భారీస్థాయిలో సెజ్‌లకు ఆహ్వానం పలకనున్నాయి. దీనివల్ల లక్షలాది ప్రజలు నిరాశ్రయులుగా మారడమే గాక ఉపాధినీ కోల్పోతారు. ఇప్పటికే జి–8 దేశాల మోసపూరిత విధానాలతో వర్ధమాన దేశాల వ్యవసాయం దిగజారుతోంది. రైతులు ఆహార పంటల స్థానంలో వాణిజ్య పంటలు పండిస్తున్నారు. సెజ్‌లు, దోహా చర్చలు వాణిజ్య పంటల ఫలితంగా ఆహార సంక్షోభాన్ని మనం

(... మిగతా 41వ పేజీలో)

## బాలికలదే పై చేయి

ఇంజనీరింగ్, అగ్రికల్చర్, మెడికల్ ఉమ్మడి ప్రవేశపరీక్ష (ఎంసెట్ – 2009) ఫలితాలు జూన్ 21న విడుదలయ్యాయి. ఇంటర్ మార్కులకు 25 శాతం వెయిటేజిని కూడ కలిపాక ప్రకటించిన ఫలితాలు. ఇంజనీరింగ్ విభాగంలో 79.8 శాతం, మెడికల్ విభాగంలో 84.3 శాతం మంది ఉత్తీర్ణులయ్యారు. రెండు విభాగాలలోనూ బాలికలే పై చేయి సాధించారు. ఇంజనీరింగ్ విభాగంలో మొత్తం 3,02,646 మంది ప్రవేశపరీక్షకు హాజరు కాగా 2,41,507 మంది క్వాలిఫై అయ్యారు. మెడికల్ విభాగంలో 62,656 మందికి గాను 52,797 మంది క్వాలిఫై అయ్యారు.

## వర్షాభావం

రాష్ట్ర వ్యాప్తంగా తీవ్ర వర్షాభావ పరిస్థితులు నెలకొన్నాయి. జూలై మొదటివారానికి కూడా వ్యవసాయ పనులు ఊపందుకోలేదు. అక్కడక్కడా సాగుచేసిన ఆరుతడి పంటలు నీరులేక ఎండిపోయే పరిస్థితి తలెత్తింది. పరిస్థితి ఇలాగే కొనసాగి, సాగు ఆలస్యమయితే దిగుబడిపై ప్రభావం చూపే అవకాశం ఉందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. జూన్ 1 నుంచి జూలై 1 దాకా 111.7 మిల్లీమీటర్ల వర్షం కురవాల్సి ఉండగా, 68.1 మిల్లీమీటర్లు మాత్రమే కురిసింది. ఇది సాధారణం కంటే 39 శాతం తక్కువ.

## అంతిమయాత్రలో పాల్గొనడం నేరమా?

మావోయిస్ట్ అగ్రనేత పటేల్ సుధాకరరెడ్డి అంత్యక్రియల్లో పాల్గొన్నారంటూ వరవరరావు (విరసం), రత్నమాల (ఎపిసిఎల్‌సి), పబ్లిక్ ప్రాసిక్యూటర్ పటేల్ శ్రీనివాస్‌రెడ్డి తదితరులపై మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల పోలీసులు నమోదు చేసిన క్రిమినల్ కేసును రాష్ట్ర హైకోర్టు రద్దు చేసింది. అంతిమ యాత్రలో పాల్గొనడం నేరమేమీ కాదని పేర్కొంది.

## కుటుంబ నియంత్రణలో మనమే ఫస్ట్

కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లు అమలు చేయడంలో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ మొదటిస్థానంలో ఉంది. గత ఏడాది (2008–09) 7,00,278 కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లతో ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో ఉండగా, 90,953 ఆపరేషన్‌లతో ఒరిస్సా చివరి స్థానంలో ఉంది. రాష్ట్రంలో గత ఏడాది కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న వారిలో 96 శాతం (6,70,233) మహిళలే ఉన్నారు.

## సహకార సేద్యానికి ఆమోదం

రాష్ట్రంలో సహకార సేద్యానికి మంత్రిమండలి ఆమోదం తెలిపింది. ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి అధ్యక్షన జూన్ 30న సచివాలయంలో కేబినెట్ సమావేశం జరిగింది. సమావేశ వివరాలను సమాచార శాఖ మంత్రి జె. గీతారెడ్డి విలేకరులకు వివరించారు. రాష్ట్రంలోని సన్న, చిన్నకారు రైతులను సహకార సంఘం పరిధిలోకి తీసుకురానున్నట్లు మంత్రి తెలిపారు. ప్రయోగాత్మకంగా, పైలెట్ ప్రాజెక్ట్‌గా అమలు చేయాలని నిర్ణయించారు. ప్రతి జిల్లాకు రెండు మూడు గ్రామాలలో తొలి విడత ఈ తరహా సేద్యం చేపట్టనున్నట్లు తెలిపారు. రైతులు స్వచ్ఛందంగా ముందుకు వచ్చే గ్రామాలలో మాత్రమే ఈ ప్రయోగం చేపడతామని ముఖ్యమంత్రి ఈ సందర్భంగా తెలియజేశారు. ఉత్పాదకత పెంచడమే దీని లక్ష్యం అని ఆయన అన్నారు. దీనిపై పలువురు మేధావులు ఆందోళన వ్యక్తం చేశారు. ఈ పద్ధతిలో రైతులు వాటినుంచి ఉపసంహరించుకునే స్వేచ్ఛ లేకపోవడం, పైదొలగాలనుకున్న రైతులు తమ భూములను కూడా వదులుకోవాలనే నిబంధన కూడా ఉండడం సర్వత్రా ఆందోళనకు కారణం.

## కప్పు, సాసర్లకు రు. 54 లక్షలు!

రాష్ట్ర ముఖ్యమంత్రితో సహా 36 మంది మంత్రుల తేనీటి సామాగ్రికి రాష్ట్ర ప్రభుత్వం రు. 54 లక్షలు జారీ చేసింది. మంత్రికి లక్షన్నర చొప్పున కేటాయిస్తూ సాధారణ పరిపాలనా శాఖ కేటాయించింది. ఈ కేటాయింపులు చూసి అధికారులు కూడా ఆశ్చర్యపోయారు.

## శ్మశానాల భూమి కూడా కబ్జా

జూలై 4న ముఖ్యమంత్రి సమక్షంలో రెవెన్యూ శాఖపై జరిగిన సమీక్ష సందర్భంగా శ్మశానాలకు భూములు లేని అంశం చర్చకు వచ్చింది. శ్మశానాల భూములు పెద్ద ఎత్తున కబ్జాకు గురవుతున్న సంగతి కూడా ప్రస్తావనకు వచ్చింది. నగర, పురపాలక, గ్రామపంచాయితీల్లో శ్మశానాల కోసం ఇప్పటికే 27,708.24 ఎకరాల భూమిని కేటాయించినట్లు తెలిపారు. మరో 8,498.32 ఎకరాల భూమిని శ్మశానాల కోసం అన్ని మతాల వారికి కేటాయించినట్లు ఆదేశించారు.

## విద్య వ్యాపారం

రాష్ట్రంలో విద్య వ్యాపారం దిన దిన ప్రవర్ధమానమవుతోంది. ప్రైవేట్ విద్యా సంస్థలు అడ్మిషన్‌ల పేరుతో వేల రూపాయల ఫీజులు వసూలు చేయడమే కాకుండా భారీగా డొనేషన్‌లు వసూలు చేస్తున్నాయి. ఫీజులు, డొనేషన్‌ల పేరుతో వసూలు చేస్తున్న మొత్తాన్ని లెక్కిస్తే విద్యా సంస్థల ఆదాయం పదివేల కోట్ల రూపాయలు దాటుతోందని పాఠశాల విద్యాశాఖ అధికారులు అంచనా వేస్తున్నారు. రాష్ట్రంలో అన్ని రకాల ప్రైవేట్ పాఠశాలలు కలిపి పదహారు వేలు ఉన్నట్లు విద్యాశాఖ లెక్కలు చెబుతున్నాయి.

## జీవిత ఖైదీల విడుదల?

సత్ప్రవర్తన కలిగిన, ఐదేళ్లకు పైగా శిక్షను పూర్తి చేసిన జీవిత ఖైదీల శిక్షాకాలాన్ని తగ్గిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జైళ్లలో ఏడువందల మంది వరకు జీవిత ఖైదు అనుభవిస్తున్న ఖైదీలు ఉన్నారు. వీరిలో మూడు వందల మంది వరకు సుదీర్ఘకాలంగా జైళ్లలో ఉన్నారు. వీ

*ఇంటా బయటా ప్రతిపక్షమే లేని యు.పి.ఎ. ప్రభుత్వం మరింత దూకుడుగా సరళీకరణ సంస్కరణలను అమలు చేయడానికి అనుకూలంగా కేంద్ర బడ్జెట్ ఉందంటున్నారు* **వి. హనుమంతరావు**

# కేంద్ర బడ్జెట్ ఎవరికోసం?

మన రాష్ట్రంలోలాగే కేంద్రంలో కూడా పాత ప్రభుత్వమే మళ్లా అధికారంలోకి వచ్చింది. కొత్తదల్లా ఆర్థికమంత్రి మరారు. ప్రపంచ ఆర్థిక మాంద్యం నేపథ్యంలో 2009-10 బడ్జెట్ ప్రవేశపెట్టడం జరిగింది. కాని ఇద్దరూ కాంగ్రెస్ ప్రభుత్వ మంత్రులే. ఇది కొత్త తరహా బడ్జెట్ అంటే కాంగ్రెస్ కొత్త విధానాలవలంబించిందని అనాల్సివస్తుంది. అది జరగలేదు కదా, ఇది కాంగ్రెస్ ప్రభుత్వం ఆరవ బడ్జెట్ అంతే. 2004లో ఎన్‌డిఏ ప్రభుత్వం గద్దె దిగింది కాని విధానాలు గద్దె దిగలేదు. అదే అమెరికా అనుకూల విధానం, ప్రపంచబ్యాంక్ ఆదేశాల విధానాల కొనసాగింపు కార్పొరేట్ రంగానికి సేవలు, పాప్యులిస్ట్ విధానాల కొనసాగింపు. పత్రికలన్నీ అదే మద్దెల దరువు. కార్పోరేట్ రంగం సేవల్లో తరిస్తున్న మీడియా అదేరాగం, అదే గానం, అదే పల్లవి కాక మరొక రాగం ఎత్తుకొంటుందా? అదేదో సరికొత్త విధానమయినట్లు నూరు దినాల పని గ్యారంటీ పథకాన్ని పతాక శీర్షికల్లో అలంకరించారు. అంతకు ముందు ఎకనామిక్ సర్వే ప్రకటించిన తర్వాత వామపక్షాల పీడ వదిలింది. సంస్కరణల కాలం వచ్చేసిందని ఈ మీడియాయే చంకలు గుద్దుకొన్నాయి. కార్పొరేట్ గాలులు ఎలా వీస్తే మీడియా అలా కొట్టుకపోవడం ఇటీవలి కాలంలో ఒక దురదృష్టకర పరిణామం.

బడ్జెట్ గురించి పార్లమెంట్‌లో, బయటా చర్చలు 1. ఇది ఆమ్ ఆద్మీ బడ్జెటే. 2. ఆదాయ వ్యయాలు-ద్రవ్యలోటు, భారీ రుణసేకరణ. 3. ప్రభుత్వ పెట్టుబడుల ఉపసంహరణ. 4. పారిశ్రామిక రంగానికి రాయితీలు. 5. వ్యవసాయరంగంపై చిన్నచూపు. ఈ విషయాలకు పరిమితమై విశ్లేషించుకొందాం. బడ్జెట్ చర్చ అంతా ఈ విషయాల చుట్టూనే పరిభ్రమించింది. గత అయిదేళ్లలో ఇవి తప్ప మరే విషయాలైనా దేశ ఆర్థిక జీవనంలో చోటు చేసుకోన్నాయా? లేదు. అందుకనే పాత ప్రభుత్వం, పాత బడ్జెట్ అని అనాల్సివచ్చింది.

ఇది ఆమ్ ఆద్మీ బడ్జెట్ అనడానికి ప్రధానంగా నూరు రోజుల పని గ్యారంటీ పథకాన్ని ఎత్తి చూపుతున్నారు. గత అయిదేళ్ల కాలంలో వామపక్షాలనే అంకుశంతో పోడుస్తూంటేనే కాంగ్రెస్ ఈ పథకాన్ని ప్రవేశపెట్టిందనే విషయం మరిచిపోరాదు. ఈ బడ్జెట్‌లో మార్పల్లా రోజుకు 80 రూపాయల కూలీని మరో 20 రూపాయల మేరకు పెంచారు. అంత వరకూ సంతోషం. ఈ పథకానికి కేటాయింపు పెంచింది అంకెల్లోనే గాని వాస్తవంలోకాదు. 80 రూపాయలను నూరురూపాయలకు పెంచిన తర్వాత కేటాయింపు పెంచాలి కదా. కుటుంబంలో సగటున అయిదుగురున్నరని అనుకొంటే, ఆ కుటుంబానికి సంవత్సరంలో నూరురోజులపాటు మాత్రమే తలసరి ఇరవై రూపాయల కూలీ ముదుతుంది. ప్రభుత్వమే నియమించిన అర్జున్ సేన్ గుప్తా కమిటీయే దేశంలో 75శాతం మంది దినసరి ఆదాయం ఇరవై రూపాయలని తేల్చి చెప్పింది. ఇపుడీ పథకం కింద అంతే ఆదాయం సమకూరు స్తానంటుంది. ఇందులో కొత్త ఏమిటి? ఈ నూరు రూపాయలైనా నూరురోజుల పాటు పూర్తిగా ముడుతాయా? ముట్టడంలేదనే ప్రభుత్వ లెక్కలే చెబుతున్నాయి.

ఈ పథకం అమలు పరచిన 2006-07, 2007-08, 2008-09 సంవత్సరాల్లో 50 శాతం కుటుంబాలే మాకు ఉపాధి కావాలని పేర్లు రిజిస్టర్ చేసుకొన్నాయి. వారికి మాత్రమే ఉపాధి లభించింది. సగటున వారికి ముట్టింది రు. 85. ఇది సగటు భారతదేశ చిత్రం అయితే మహరాష్ట్రలో రిజిస్టర్ చేసుకొన్న వారిలో 13 శాతానికే మాత్రమే ఉపాధి లభించింది. టైమ్స్ ఆఫ్ ఇండియా విలేఖరుల బృందం మూడు రాష్ట్రాల్లో పర్యటించి, సేకరించిన సమాచారం ప్రకారం నూరు రోజుల మాట అటుంచి, కనీసం ఒక్క రోజుకూడా ఉపాధి లభించని సందర్భాలను పేర్కొంది. గ్రామీణ ప్రాంతాల అధ్యయనంపై కేంద్రీకరించి పరిశోధన కొనసాగిస్తున్న జీన్‌డ్రీజ్ 12 రాష్ట్రాల్లో కొన్ని గ్రామాల్లో సేకరించిన సమాచారం ప్రకారం చట్టం నిర్దేశించిన పద్ధతిలో ఏదీ జరగటంలేదని తేల్చిచెప్పింది.

పని చేస్తున్న చోట ఏర్పాటు చేయాల్సిన కనీస సౌకర్యాలు, 80 రూపాయల చెల్లింపు, రిజిస్టరు చేసుకొన్న 15రోజుల్లోగా పనిచూపక పోతే నిరుద్యోగ భృతి చెల్లింపు, సకాలంలో వేతనం చెల్లించకపోతే నష్టపరిహారం చెల్లింపు, పథకం సరిగ్గా అమలు జరగటం లేదని ఫిర్యాదు చేస్తే దానిని విచారించే పథకం అమలు మొదలే లేదు. ఈ పథకం కింద చేసిన ఖర్చుకు జరగాల్సిన పనులు ఎంత వరకు జరిగాయనే సమాచారం లభించలేదు. పూట గడవలేని ఈ పేదల్లో నిరుపేదలను ప్రభుత్వ యంత్రాంగం ఎంతగా ఈసడించుకొంటుందో వేరే చెప్పాల్సిన పనిలేదు. ఆమ్‌ఆద్మీ పథకంలో ఈ ఒక్క పథకం అమలు జరుగుతున్న తీరు చూశారుకదా. మీకేమనిపిస్తుంది? సామాన్యులనుద్దేశించి ప్రవేశపెట్టి అమలు పరుస్తున్న ఇతర పథకాలు ఎంత మేరకు వారికి మేలు చేశాయో, ఇక ముందు చేస్తాయో ఊహించుకోవచ్చు. అందుకనే ఎకనామిక్ టైమ్స్-హాన్స్ రిసెర్చ్ బడ్జెట్‌పై స్పందనను 50 శాతం ప్రజలే ఈ బడ్జెట్‌కు అనుకూలంగా ఉన్నారని తేల్చి చెప్పింది. పేదరికపు రేఖ కింద దేశంలో 26 శాతం మంది నివసిస్తున్నారని ప్రభుత్వ లెక్కలు

చెబుతున్నాయి. వీరికి ఈ బడ్జెట్ ఏమిచ్చిందని అనుకూలంగా స్పందించాలి?

పది లక్షల కోట్ల బడ్జెట్ అంటే అది అందరికీ లాభిస్తుంది. ప్రజల చేతుల్లో ఎక్కువ డబ్బు ఉంటుంది. వారి కొనుగోలు శక్తి పెరిగి, పారిశ్రామికోత్పత్తికి గిరాకీ పెరుగుతుంది. దేశం బాగుపడుతుంది. అని అందరూ అనుకోంటారు. ఇదెంత వరకూ వాస్తవం? బడ్జెట్ అంతా అంకెల గజిబిజి సామాన్యులకే కాదు, కాస్తో కూస్తో ప్రవేశమున్న నాక్కూడా కొన్ని విషయాలు కొరుకుడు పడవు. నేనర్థం చేసుకొన్నంత వరకూ, ఆర్థిక విషయాల విశ్లేషకులు చేసిన పరిశీలనలను అధ్యయనం చేసుకొన్న మేరకు, సామాన్యుని పరిభాషలో పాయింట్లుగా మీ ముందుంచుతా.

మన బడ్జెట్ పది లక్షల కోట్లు, ఆదాయంలో నాలుగు లక్షల కోట్ల తరుగు కనిపిస్తుంది. కాగా నాలుగు లక్షల కోట్లు అప్పుతెస్తుంది. ఆర్థిక సూత్రాల ప్రకారం తెచ్చిన అప్పు ఆస్తుల సృష్టికి ఉపయోగపడాలి. వాటి నుంచి వచ్చే ఆదాయం అప్పు తీర్చి వేయడానికి వినియోగపడాలి. కాని ఇపుడు తీసుకొస్తున్న అప్పు రోజువారీ ఖర్చుల వినియోగానికి అవసరమవుతుంది.

ఆదాయం కన్నా ఖర్చు ఎక్కువైతే దానిని రెవెన్యూలోటు అంటారు. రెవెన్యూలోటు స్థూల రాష్ట్రాదాయంలో 2001-02లో 4.39 శాతం ఉంటే దానిని 2005-06లో 2.59 శాతానికి తగ్గించడానికి మూడేళ్ళు పట్టింది. ఆ లెక్కన బడ్జెట్‌లో చూపిస్తున్న 6.9 శాతంలోటును పూడ్చడానికి ఎనేళ్లు పడుతుంది? ఒక్క ఏడాదిలోనే ఈ లోటును భర్తీ చేసేస్తానంటున్నారు ప్రణబ్‌జీ. నముదామా?

ఎక్కడో అమెరికాలో సంక్షోభం ఏర్పడితే మన దేశం ప్రభావితం అయిందటే అది ప్రపంచీకరణ పుణ్యమే. తొమ్మిది శాతానికి పెరిగిన స్థూలజాతీయాదాయం రేటు 6.7 శాతానికి దిగజారిందంటే అది ప్రపంచీకరణ పులి తలకాయపెట్టడం వల్లనే, అయినా దాని చంకెక్కి దిగమంటారేమిటి? ఫలితం? మన దేశ ఆర్థిక పరిస్థితికి కొలమానం మన ఆదాయ వ్యయాలు కాదు స్టాక్ ఎక్స్‌ఛేంజ్ ఎగుడు దిగుడులు!

ఆదాయ వ్యయాలతో పాటు ప్రాధాన్యతలు, విధానాలు, లక్ష్యాలు, రాజకీయ విధానం కొలబద్దగా ఉండాలి. కాని బడ్జెట్ లోటు, మిగులు ప్రభుత్వ పెట్టుబడుల ఉపసంహరణ, సబ్సిడీలు ఇవీ నేటి కొలబద్దలు. ఎంత పతనం!

మన రుణభారం ఎంత తడిసి మోపెడయిందో అందుకు సంబంధించిన లావాదేవీలన్నీ చూడడానికి తెలుసుకోవడానికి ఒక కొత్త పరిపాలన శాఖనే ఏర్పాటు చేయాలనే ఆలోచనలో ప్రభుత్వం ఉంది. ఇప్పటి వరకూ రిజర్వుబ్యాంకే ఈ పని చేసింది. 230 బిలియన్ డాలర్ల అప్పు ఉండనే ఉంది. స్థూలజాతీయాదాయంలో మన రుణ భారం 22 శాతం.

రహదారుల కోసం ఈ ఏడాది లక్ష కోట్ల ఖర్చు చేస్తామని మంత్రి కమలనాథ్ ఉవాచ బాగానే ఉంది. కాని ఇప్పట్లో డబ్బుందా.

రెండు, మూడు ఉద్దీపన పథకాల పుణ్యమా అంటూ బాంకులో సుమారు లక్షా యాభైవేల కోట్ల నిధులు మూలుగుతున్నాయి. వీటిని రిజర్వు బాంకులో జమ చేసారు. రిజర్వు బాంకు ఇచ్చే వడ్డీ 3 శాతం మాత్రమే. అప్పిస్తే 10,12 శాతం వడ్డీ వస్తుంది. కాని ఈ మాంద్యంలో అప్పులిస్తే చేతులు కాలతాయేమోనని భయం.

కేంద్ర ప్రభుత్వ మాజీ ఆర్థిక సలహాదారు శంకర్ ఆచార్య ఇలా అంటున్నారు. “పెద్ద ఎత్తున పెరిగిన ప్రభుత్వ వ్యయాల్లో చాలా బాగా వడ్డీ చెల్లింపులు, రక్షణ శాఖ, సబ్సిడీలు, సిబ్బంది వేతన భత్యాలు, పెన్షన్లు, గ్రామీణ ఉపాధి హామీ, భారత నిర్మాణ్ వంటి సామాజిక కార్యక్రమాలకు ఖర్చవుతోంది. ఆర్థిక ఉద్దీపన పథకాల అవసరం తీరిపోవచ్చు కాని పై వ్యయాలను పెంచిన తర్వాత తగ్గించుకోవటం సాధ్యమా?”

ఆదాయం నేల చూపులు చూస్తూంటే, ఖర్చులు ఆకాశం వైపు చూస్తున్నయి. అప్పు చేయటం కన్నా మరో మార్గంలేదు. ప్రభుత్వ ఆర్థికవిధానాల ఫలితంగా ఆమ్ ఆద్మీ మాటేమోగాని ఆమ్ అంబానీలు తయారవుతున్నారు. ‘ప్రజా ప్రతినిధులైన’ పార్లమెంటు సభ్యుల ఆదాయాలు కోట్లలోనే ఉన్నాయి. ఆమ్ ఆద్మీ ఇదివరకు ఎక్కడున్నారో, అక్కడే ఉన్నారు. పాలకులు ‘సామజిక న్యాయంతో కూడిన అభివృద్ధి’ అనే నినాదం ఇందిరాగాంధీ హయాంలోనే ఇవ్వటం జరిగింది. నాలుగు దశాబ్దాల తర్వాత ఆ పాత నినాదానికి ‘ఆమ్ ఆద్మీ’ అనే కొత్త వలువలతో ముస్తాబు చేశారు. అప్పటి, ఇప్పటి నినాదాలకు మధ్య తేడా ఏమీలేదు. కార్పొరేట్ అనుకూల విధానాలకు ‘ఆమ్ ఆద్మీ’ అనే కొత్త తొడుగు తొడిగారు. ఆ తొడుగు ముసుగులో తమ పాత విధానాలనే కొనసాగిస్తూ ఉన్నారు.

ఈ బడ్జెట్టే తీసుకోండి 10 లక్షల రూపాయలపైగా ఆదాయం ఉన్న వారు చెల్లించే ఆదాయపు పన్ను మీద సర్‌ఛార్జ్ తొలగించారు. ఉన్నతోద్యోగుల కిచ్చే కారు అలవెన్సు, ఇంటి అలవెన్స్ లాంటి ఇతర కంపెనీ చిల్లర ఖర్చుల మీద పన్ను భారాన్ని చెల్లించే బాధ్యత నుండి కార్పోరేట్లకు విముక్తి కలిగించారు. స్విస్ బ్యాంకుల్లో దాచుకున్న కోట్ల రూపాయల నల్లధనం మీద పంజా విసరమంటే, ప్రభుత్వ రుణ సేకరణకు మార్కెట్ దూసుకువెళితే తనకు అప్పుపుట్టదనే భయం అవసరంలేదని ప్రణబ్ భరోసా ఇచ్చారు. వడ్డీ రేటు పెంచబోమన్నారు. ఎగుమతులు మందగించాయి కాబట్టి మీకు వేరే రకంగా రిలీఫ్ ఇస్తామన్నారు. ద్రవ్యలోటును మానెటైజ్ చేయబోమన్నారు. (అంటే రిజర్వుబాంకు చేత నోట్లు అచ్చు గుద్దించడం) ఈ హామీలన్నీ బడ్జెట్ ఉపన్యాసంలో ఇచ్చి సంస్కరణలు ప్రవేశ పెట్టబోవడం లేదేమోనన్న భయాన్ని కార్పొరేట్ రంగం వెలిబుచ్చగా ‘సంస్కరణల అమలు కోసం చట్ట రీత్యా ఇతర విధాలుగా సకల చర్యలు తీసుకొంటాం’ అని ప్రణబ్ ముఖర్జీ అభయ హస్తాన్ని అందిచ్చారు. ప్రభుత్వరంగ సంస్థల నుంచి పెట్టుబడులను ఉపసంహరించటంలో ఒక ప్రణాళిక రూపొందిస్తున్నాం’ అని కార్పొరేట్ల బ్లడ్‌ప్రెషర్ పెరక్కుండా చూశారు. బడ్జెట్ మీద చర్చకు జవాబిస్తూ ఈ వాగ్దానాన్ని మరోసారి పునరుద్ఘాటించారు.

కార్పొరేట్ రంగానికి ఇలా వరాల హామీల వర్షం కురిపించిన ఆర్థికమంత్రి ఆమ్ ఆద్మీకి ప్రస్ఫుటంగా కనిపించేలా ఇచ్చిన కానుక ఏమంటే గ్రామీణ ఉపాధి హామీ పథకం కింద రోజూవారికిచ్చే 80 రూపాయల కూలీని మరో 20 రూపాయలు పెంచటం మాత్రమే. గుడికి వెళ్లే భక్తులకు దోసిట్లో ప్రసాదం పెట్టినట్లు రైతుకు చిన్న చిన్న హామీలు విదిల్చారు. ఆమ్ ఆద్మీకి ఇచ్చిన రిలీఫ్ ఎంత అత్యల్పమైనదో వారి సమస్య విస్తృతిని గమనంలో ఉంచుకొంటే అర్థమవుతుంది. 2005లో

నేషనల్ సాంపుల్ సర్వే ప్రకారం గ్రామాల్లో ఆహారం కోసం నెలవారీ తలసరి ఖర్చు రు.333లు అయితే, పట్టణాల్లో రు.468లు, ఆహారేతర ఖర్చు గ్రామాల్లో రు.291 అయితే పట్టణాల్లో రు. 703లు ఖర్చు చేస్తున్నారు. ప్రతీ వెయ్యి కుటుంబాల్లో 192 మంది గుడిసెల్లో, 309 మంది సెమీ పక్కా ఇళ్లలో 498మంది పక్కా ఇళ్లలో నివసిస్తున్నారు. అంటే రోజూ రెండు పూటలా భోజనం, కాఫీ, టీలు వగైరాకు గ్రామాల్లో రు.33 ఖర్చు. అలాంటి తిండితో ఎలా బతుకుతారు, ఎలా పనిచేస్తారు? అరవై మూడు బడ్జెట్లు ప్రవేశపెట్టిన తర్వాత పరిస్థితి ఇదయితే, వాళ్ల జీవితాలు ఎపుడు తెల్లారతాయి, భారతీయులకు (అంటే ఆమ్ ఆద్మీకి), ఇండియన్స్‌కు (అంటే కుబేరులకు) మధ్య అంతరాలు ఎన్ని దశాబ్దాల తర్వాత తొలగిపోతాయి?

దేశంలో 242 కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలున్నాయి. వాటిలో 160 పరిశ్రమలు లాభాల బాటలో పయనిస్తున్నాయి. 1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశ పెట్టినపుడు మనకు రుణం ఇవ్వమని ప్రపంచ బ్యాంకును కోరితే, గవర్నమెంట్ హాజ్ నో బిజినెస్ టుబి ఇన్ బిజినెస్ అని చెప్పి, ప్రభుత్వరంగ పరిశ్రమలను ప్రయివేటు రంగానికి బదలాయించాలనే షరతు విధించింది. ఆ షరతును అంగీకరించిన ప్రభుత్వాన్ని ఆ సంస్థల్లో పనిచేసేవారు నిలదీశారు. బిజెపి ప్రభుత్వ హయాంలో ప్రయివేటీకరణ పొయ్యి అంటించమని ఒక మంత్రినే నియమిస్తే, అప్పుడు ఆ పార్టీతో భుజం భుజం రాసుకొని తిరుగుతున్న రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు రాష్ట్రంలో అలాంటి పరిశ్రమలను టోకుగా, చవకగా అమ్మేశారు. ఈ విజాతి అనుకరణను నిరోధించే ఉద్యమంలో బ్యాంకు ఉద్యోగులు అగ్ర భాగాన ఉన్నారు. ప్రపంచబ్యాంకు షరతు మేరకు ప్రభుత్వరంగ బ్యాంకులను విజాతీయం చేసి ఉండివుంటే, అమెరికాలో గత సంవత్సరం ఏర్పడిన సంక్షోభంలో మాడిమసి అయి ఉండేది. ప్రభుత్వరంగ బ్యాంకులు బతికి బట్టకట్టుకొని ఉన్నాయంటే అందుకు వామపక్షాలకు నూటికి నూరు మార్కులివ్వచ్చు. ప్రభుత్వవాటా 33 శాతానికి తగ్గించమని ఒత్తిడి వచ్చి దానికి ప్రభుత్వం ఒప్పుకోలేదంటే అందుక్కూడా బ్యాంకు ఉద్యోగుల ఉద్యమమే కారణం. అయినా నూటికి నూరు శాతం ప్రభుత్వరంగ బ్యాంకులలో ప్రభుత్వ వాటాను కాస్త కాస్త ప్రయివేటు రంగానికి కట్టబెడుతూనే వచ్చారు. ఇప్పుడు 51 శాతం ప్రభుత్వం చేతిలోనే ఉంటుందని చెబుతున్నారంటే అది నామక ప్రభుత్వరంగ సంస్థే. బోర్డు మీద అలాగేరాసి ఉంటుంది. 49 శాతం ప్రయివేట్‌రంగం చేతిలో ఉంటుందని గమనంలో ఉంచుకోవాలి. బ్యాంకింగ్‌రంగం తర్వాత ఇన్సూరెన్స్ రంగాన్ని వధ్యశిల మీదకు తీసుకుని పోవడానికి కత్తులు నూరుతున్నారు. వామపక్షాలు లేని పార్లమెంట్ సంస్కరణలను అమలు పరచడానికి ఇంతకన్నా మంచి అవకాశం మరొకటి దొరకదు. అయితే యుపిఏలో ఉన్న ఇతర పార్టీలు ఈ విషయంలో తమతో అడుగు వేస్తారనే నమ్మకం కాంగ్రెస్‌కు లేదు. గుడ్డిలో మెల్ల అన్నట్లు మమతా బెనర్జీ ప్రయివేటీకరణ ససేమిరా అంటోంది. పశ్చిమబెంగాల్‌లో ఆమెతో చేతులు కలపటం కాంగ్రెస్‌కు రాజకీయ అవసరం. బడ్జెట్ ఉపన్యాసంలో ప్రణబ్ ముఖర్జీ గోడమీద పిల్లివాటంగా మాట్లాడినా, చర్చకు ఇచ్చిన జవాబుతో ఆయన గోడ దూకినట్లే.

మూడు నెలల్లో ప్రణాళిక రెడీ అవుతుందని ప్రకటించారు. కార్పొరేట్‌ల ఒత్తిడి అలాంటిది. ఈ లెక్కన వచ్చే అయిదేళ్లలో ఉద్యోగులు, కార్మికులు తిరుగుబాటు చేయకపోతే ప్రభుత్వరంగం బోర్డు తిప్పేయటం ఖాయం అనిపిస్తుంది. నష్టం వస్తున్న సంస్థలకే ప్రైవేటీకరణను పరిమితం చేద్దామా అంటే నష్టం వచ్చే సంస్థలు ఎవడు కొంటాడు? ఒకవేళ కొంటానంటే నష్టం వచ్చే సంస్థలో లాభాలు దండిగా వచ్చే సంస్థను కూడా అమ్మమంటారు. ఇప్పటికే ఒఎన్‌జిసి, బిఎచ్ఇఎల్, ఎన్‌టిపిసి, ఐఒసి, సెయిల్ లాంటి లాభం ఆర్జిస్తున్న సంస్థల మీద వాళ్ల కళ్లు పడ్డాయి. రైల్వేలో కూడా ప్రయివేటీకరణకు శ్రీకారం చుట్టారు. బ్రిటన్‌లో థాచర్ ప్రధానిగా ఉండగా రైల్వేలను విజాతీయం చేసి చేతులు కాల్చుకొని తిరిగి ప్రభుత్వ రంగంలోకి తెచ్చుకొన్న విషయం పాఠకులకు గుర్తుండే ఉంటుంది.

వ్యవసాయ రంగం నాలుగు శాతం పెరగాలనేది లక్ష్యం. ఇదేమీ కొత్త లక్ష్యంకాదు, పాతదాన్నే పునరుద్ఘాటిస్తునారంటే, ఇన్నాళ్లు వైఫల్యం చెందారన్నది స్పష్టం. ఆ వైఫల్యానికి పెట్టుబడులు పెట్టకపోవడమనేది కూడా పాత కారణమే. వ్యవసాయానికి రుణం పెంచుతామనడం, కొంత మంది రైతులకు వడ్డీ తగ్గింపు- ఇదో విధాన ప్రకటనా? వ్యవసాయాన్ని చిన్నచూపు చూడటం మానలేదనడానికి ఇంత కన్నా వేరే నిదర్శనం అవసరం లేదు. నాలుగు శాతం సాధించాలంటే పదకొండవ ప్రణాళికలో సుమారు ఆరు లక్షల కోట్ల పెట్టుబడులు పెట్టాలని వ్యవసాయ శాస్త్రజ్ఞుల అంచనా. అంటే ప్రతీ సంవత్సరం 1.2 లక్షలకోట్లు ఇందుకుగాను ప్రణాళిక మెదటి ఏడాదిలో రు. 79,300 కోట్లు మాత్రమే సాధించింది. ఇందులో కూడా ప్రభుత్వం పెట్టిన పెట్టుబడి రు. 22,100 కోట్లు మాత్రమే. మిగతాది ప్రయివేటు రంగం నుంచి వచ్చింది. వ్యవసాయ రుణం లక్ష్యం 2009-10లో 3.25 లక్షల కోట్లట. ఇది గత ఏడాది కన్నా 38లక్షల కోట్లు ఎక్కువట. ఇదో పచ్చి దగా. ఎందుకంటే ప్రభుత్వం ఈ రుణాన్ని బడ్జెట్ నుంచి ఇవ్వటంలేదు. బ్యాంకులిస్తాయి. బ్యాంకుల్లో ఉండేది ఖాతాదారుల డిపాజిట్ చేసిన సోమ్ము. అలాంటిది ఏదో తన జేబులోంచి తీసి ఇస్తున్నట్లు మాట్లాడుతున్నారేమిటి ప్రణబ్ ముఖర్జీ? ప్రభుత్వరంగ సంస్థల నుంచి ప్రభుత్వ పెట్టుబడులను ఉపసంహరించడానికి ఆగమేఘాల మీద మూడు నెలల్లో రోడ్ మ్యాప్ తయారైపోతుంది కాని 120 కొట్ల భారత ప్రజలకు అన్నం పెడుతున్న వ్యవసాయానికి ప్రణాళిక ఆలోచనే లేదు! గత కొద్ది సంవత్సరాలుగా, వ్యవసాయరంగాన్ని కార్పోరేటీకరణ చేయాలనే ప్రభుత్వ ఆలోచన చర్చల్లో నలుగుతోంది. ఆ పని చాప కింద నీరులా జరిగిపోతోంది. ఇలాంటి అతిముఖ్యమైన విషయంమీద ప్రభుత్వ ఆలోచనకు బడ్జెట్ ఉపన్యాసంలో చోటులేదు. అలాగే సెజ్‌ల పేరుతో భూమి సేకరణ రైతాంగాన్ని ఎంత ఆందోళనకు గురిచేస్తుందో తెలిసిందే.

ఆర్థిక సంస్కరణలకు మళ్లీ తెరలేచింది. ఈ బడ్జెట్ ఆ దిశగా వేసిన ముందడుగు. సంస్కరణలంటే దేశ ఆర్థిక జీవనంలో ప్రభుత్వపాత్రను రానురాను తగ్గించడం. కాని సంక్షోభాన్ని ఎదుర్కోంటున్న అమెరికా తన ఆర్థిక పరిస్థితి కాపాడుకోవడానికి ప్రైవేటు బ్యాంకులు మాడిమసైపోకుండా ప్రభుత్వమే మోకాలొడ్డాల్సి వచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థకు కాలం చెల్లిందా అనే విషయం ప్రపంచ దేశాల్లో చర్చించబడుతోంది. ఆర్థికంగా ఆ దేశాల ముందు, మన ఆర్థిక పరిస్థితి ఎంత? ఆ నేపథ్యంలో మన ప్రభుత్వం ఆర్థిక సంస్కరణలను ఇంకా పట్టుకొని వేలాడుతానంటుంది. వీ

*డబ్బు సంచయాన్ని పెంచి తద్వారా మార్కెట్‌ను నిలబెట్టే దిశలో బడ్జెట్ ఉందనీ, ఆ క్రమంలో ధరలు పెరగడం, వ్యాపారస్తులు లాభం చేసుకోవడం వంటివి సాధారణమేననీ అంటున్నారు* **ఎం.సి. స్వామినాథన్**

# కేంద్ర బడ్జెట్ 2009-10

ప్రణబ్‌ముఖర్జీ ప్రవేశ పెట్టిన పూర్తి సంవత్సరపు కేంద్ర బడ్జెట్ లో పొందుపరిచిన పథకాల కంటే బడ్జెట్ పరిమాణం దాని స్వరూప స్వభావాలే ఎక్కువ చర్చనీయాలు. బడ్జెట్ పరిమాణాన్ని, అంటే మొత్తం ఖర్చు చేయదలిచిన సొమ్మును 2007-08 తో పోలిస్తే దాదాపు యాభై శాతం (ఏడు లక్షల కోట్ల నుండి పది లక్షల కోట్లకు) పెంచారు. ఇలా ప్రభుత్వ ఖర్చులను పెంచడం వలన దేశంలో డబ్బుల కరువు (ఆర్థిక మాంద్యం) తగ్గి ఉత్పత్తులకు గిరాకీ ఏర్పడుతుంది. ప్రపంచమంతా వ్యాపిస్తున్న ఈ కరువును పరిమితుల్లో ఉంచగలం. ఈ పెంపుదల, లోటుల ద్వారా పెంచడం గమనించ దగ్గ విషయం. 2007-08 సంవత్సరం తో పోలిస్తే రెవిన్యూ లోటు యాభై రెండు వేల కోట్ల నుండి రెండు లక్షల ఎనభై మూడు వేల కోట్ల కు, ద్రవ్య లోటు లక్షా ఇరవై ఏడు వేల కోట్ల నుండి నాలుగు లక్షల వెయ్యి కోట్లకు పెరిగినాయి. ప్రభుత్వ రాబడులను పెంచడం ద్వారా చేస్తే అంత మొత్తానికి ప్రైవేటు ఖర్చులు తగ్గి పోతాయి. అందుకనే ఖర్చుల పెంపుదల లోటు ద్వారా పెంచ బడినది. ఈ రెండు ప్రక్రియలు చాలా దేశాలు చేశాయి.

బ్రిటన్, అమెరికాలతో సహా అమెరికా బడ్జెట్ లోటు పది లక్షల కోట్ల డాలర్లు. ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడిన డబ్బుల కరువు మనదేశానికీ వ్యాపించకుండా ఉండటానికి ఇది మంచి ఉపాయమని ఆయా ప్రభుత్వాలూ తలుస్తున్నాయి. కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు లోతులను ఇంతగా పెంచితే కలిగే అనర్థాలను గురించి హెచ్చరిస్తున్నారు. నిన్ననే మన పార్లమెంటులో ప్రభుత్వ పార్టీకే చెందిన రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ రంగరాజన్ కూడా ఈ హెచ్చరిక చేశారు. ఇలా జరుగకూడదనే కదా మనం ఫైనాన్సియల్ రెగ్యులేషన్ - బడ్జట్ మేనేజ్‌మెంట్ చట్టం ఏర్పరచుకొన్నాం అనేవాళ్లూ ఉన్నారు. అన్య దేశాలలో, ప్రముఖంగా బ్రిటన్ అమెరికాలలో లోటు ఉండరాదనే వాదన వినిపిస్తున్నది. ఈ వాదనలకు మూలాధారం 1930 దశకం దాకా ఆర్థిక శాస్త్రవేత్తలు నమ్మి బోధించిన 'అదృశ్య హస్తం' సిద్ధాంతం. దీని ప్రకారం ఏ దేశపు ఆర్థికవ్యవస్థలోనైన గిరాకీని మించిన ఉత్పత్తి జరుగదు. ఉత్పత్తి గిరాకీలు సమతుల్యం అవుతాయి. కొన్ని సమయాల్లో ఈ సమతుల్యం ఏర్పడటానికి సమయం పట్టినా దీర్ఘకాలంలోనైనా అవి సమానమవ్వక తప్పదు.

ఈ అదృశ్యహస్తం ఎల్ల వేళలా పనిచేయదని, అయినా దీర్ఘ కాలంలో మనందరం కీర్తి శేషులు అయిపోతాం కదా అని కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో అప్పటి ఆర్థికశాస్త్ర ప్రొఫెసర్ కీన్స్ దీన్ని ఖండించాడు. కీన్స్ రచించిన 'జనరల్ థియరీ ఆఫ్ ఎంప్లాయిమెంట్, ఇంటరెస్ట్ అండ్ మనీ' ఆర్థికశాస్త్రంలో అత్యంత చారిత్రక ప్రసిద్ధి చెందిన గ్రంథం. ఆర్థికవ్యవస్థల నియంత్రణ మీద మార్క్స్ 'దాస్ కాపిటల్' తరువాత కీన్స్ ఈ గ్రంథమంతటి ప్రభావం చరిత్రలో మరే గ్రంథం కలుగ జేయలేదంటే అతిశయోక్తి గాదు. ఈ గ్రంథం ప్రచురణ అయ్యే దాక ఏ దేశ ప్రభుత్వమూ అప్పుడు ప్రపంచాన్నంతా వేధిస్తున్న డబ్బు కరువును ఎలా ఛేదించాలో తెలియక సతమతమవుతుండేవి. కోట్లాది మంది ఉపాధి కోల్పోయారు. ఉత్పత్తులు అమ్ముడు పోలేదు. ఏమాత్రమయినా అమ్మకాలుంటే గిట్టుబాటు ధరలు వచ్చేవి కాదు. గిట్టుబాటు కాక ఉత్పత్తిదారులు ఉత్పత్తులు మానేసి, పనివాళ్లు మానేయగా కొనుగోలుదారులు తక్కువై అమ్మకాలు మరింత క్షీణించి పోయేవి.

డబ్బు కరువు నుండి బయట పడటానికి కీన్స్ ఈ గ్రంథంలో ప్రతిపాదించిన పరిష్కారం ఏమంటే ప్రభుత్వాలు ఖర్చులు ఎక్కువ చేయాలి, అందుకు కావలసిన వనరులను ప్రజల నుండి రాబట్టకూడదు. అలా ప్రజల నుండి వసూలు చేస్తే వారు చేసే ఖర్చులు తగ్గి వాటి బదులు ప్రభుత్వ ఖర్చులు పెరుగుతాయి. అంతే గాని మొత్తం (ప్రజలు, ప్రభుత్వాలు చేసే) ఖర్చులు పెరగవు. ప్రభుత్వాలు లోటుతో ఖర్చులు పెంచినప్పుడే ఆ ఆర్థికవ్యవస్థలో ఖర్చుల మొత్తం పెరిగి డబ్బు కరువు తగ్గుతుంది. ప్రభుత్వ ఖర్చులను పెంచడానికి రోడ్లు వేయడం, చెరువులు తవ్వడం లాంటి పనులు చేయించుకోవచ్చు. 'ఉన్న రోడ్లలో ప్రయాణీకులు లేరు, ఉన్న చెరువుల్లో నీళ్లు తీసుకుని పండించే రైతులేమో నిలవున్న ధాన్యాలనే అమ్ముకోలేకుండా ఉన్నారు' అనేవాళ్లకు ఆయన ఇచ్చిన జవాబు ఏమంటే ఉపాధి కల్పించడానికి కార్మికులను ఒక రోజు గుంతలు తవ్వడానికి మరుసటి రోజు ఆ గుంతలను పూడ్చడానికి పురమాయించి కూలి డబ్బులు ఇవ్వమన్నాడు. వాళ్లెళ్లి ఆ ఆదాయంతో వారికి కావలసిన వస్తువులు కొంటారు, ఆ వస్తువుల ఉత్పత్తికి గిరాకీ ఏర్పడుతుంది, ఆ ఉత్పత్తులలో మరికొంత మందికి ఉపాధి దొరుకుతుంది. అలా అమ్మకాలు పెరుగుతుండగా ఉత్పత్తులూ పెరుగుతాయి, ఉద్యోగాలు పెరుగుతాయి. వ్యవస్థ అంతా కుదుట పడుతుంది. కొంత ద్రవ్యోల్బణం ఏర్పడవచ్చు గాని దానివల్ల ఉపయోగమే కాని హాని ఏమీ ఉండదు.

1950 దశకం లో ఫిల్లిప్స్ అనే ఆచార్యుడు ఒక వందేళ్ల గణాంకాలను అధ్యయనం చేసి ద్రవ్యోల్బణం, నిరుద్యోగం

విలోమానుపాతంలో ఉంటాయని అన్నాడు. దీన్నే ప్రొఫెసర్ గాల్బ్రెత్ చెపుతూ ద్రవ్యోల్బణం ఉద్యోగాలు స్థిరంగా ఉన్నవాళ్లను వేధిస్తుంది గాని దానితో కూడా వచ్చిన ఉద్యోగాలు పొందిన వారికి కాదు అన్నాడు.

కీన్స్ సిద్ధాంతాలను దాదాపు అర్ధ శతాబ్దం ప్రపంచ ప్రభుత్వాలన్నీ ఆచరణలో పెట్టాయి. 1970 దశకంలో ఇంధనం ధరలు అమాంతం పెరిగేసరికి ద్రవ్యోల్బణం ఆకాశాన్నంటింది. అదే సమయంలో షికాగో విశ్వవిద్యాలయంలో ఆర్థికశాస్త్ర ఆచార్యుడైన మిల్టన్ ఫ్రైడ్మన్ లోటుతో ప్రభుత్వ ఖర్చులు పెంచే విధానమే ద్రవ్యోల్బణాన్ని తీవ్రం చేస్తున్నదనీ, ప్రభుత్వాలెప్పుడూ లోటులేకుండా రాబడులకు మించిన ఖర్చులు చేయరాదని వాదించాడు. ఆయన ప్రకారం ద్రవ్యోల్బణం అతి ప్రమాదకరం, దాన్ని నిరోధించడమే ప్రభుత్వాల ప్రథమ కర్తవ్యం. ఆయన మరో అడుగు ముందుకెళ్లి 'నాయిరు' (నాన్ అక్సేలరేటింగ్ ఇన్‌ఫ్లేషన్ రేట్ అఫ్ అన్‌ఎంప్లాయ్‌మెంట్) సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దాని ప్రకారం ద్రవ్యోల్బణం గతి పెరక్కుండా నియంత్రించాలంటే కొంత నిరుద్యోగం తప్పదు. ఫ్రైడ్మన్ గారి ఈ సిద్ధాంతాలను గురించి 1990 దశకంలో సందేహాలుత్పన్నమైనా, పోయిన సంవత్సరం దాక వాటినే ప్రభుత్వాలు అనుసరించాయి. దాన్ని ప్రభుత్వాలు, ఫ్రైడ్మన్ గారి 'నాయిరు' సిద్ధాంతాలను నమ్మిన ఆర్థిక శాస్త్రవేత్తలు వివరించిన విధానం ఇలా ఉంది: లోటుతో ప్రభుత్వ ఖర్చులను పెంచితే (అంటే ప్రభుత్వం కేంద్ర బ్యాంకు నుండి రుణాలు తీసేసుకుంటే) యితరులకు రుణాలు దొరకవు. దానితో ఆయ్యేదల్లా ఇతరుల / ప్రైవేటు పెట్టుబడిదారుల ఖర్చులకు బదులు ప్రభుత్వ ఖర్చులు ఉంటాయి గాని మొత్తం ఖర్చులు పెరగవు అన్న సిద్ధాంతం. వెరసి ధరలు పెరుగుతాయే తప్ప మరే ప్రయోజనం ఉండదు. ఈ వాదన నాణేనికి ఒక వైపు మాత్రమే చూపుతుంది. ప్రైవేటు పెట్టుబడులు పబ్లిక్ పెట్టుబడుల పై ఆధార పడతాయి.

పోయిన సంవత్సరం నోబెల్ పురస్కారాన్ని పొందిన ప్రొఫెసర్ పాల్ క్రూగ్మన్ ఈ మాటనే అంటున్నాడు. ఆయన ప్రకారం లోటు బడ్జెట్ల వలన ప్రైవేటు పెట్టుబడులకు రుణాలు దొరక్క పోవటమన్నది వనరులన్నీ, ముఖ్యంగా కార్మికశక్తి, సంపూర్ణంగా. వినియోగంలో ఉన్నప్పుడే జరుగుతుంది. కార్మికశక్తి ఇతర వనరులు సంపూర్ణంగా వినియోగంలో లేనప్పుడు లోటులు ఆర్థికవ్యవస్థను విస్తరించి పెంచుతాయి. వడ్డీ రేట్లు పెరగవచ్చు కాని ఆర్థికవ్యవస్థ పెరిగి డబ్బు కరువు నుండి బయటపడటానికి ఇది చాలా తక్కువ మూల్యమే. ఈ విధానంతో ఇంకొక ప్రమాదానికి తావున్నది. లోటులతో పెట్టిన ప్రభుత్వ ఖర్చుల వలన ఆ దేశపు ద్రవ్య స్థిరత్వం గురించిన అనుమానాలు ఉత్పన్నం అవ్వొచ్చు, దాంతో పెట్టుబడులు విదేశాల పలాయనం జరుగవచ్చు, దేశీయ ద్రవ్యవిలువలో తరుగు ఏర్పడవచ్చు, పర్యవసానంగా పెట్టుబడులకు వనరుల కొరతలు ఏర్పడవచ్చు, ఇలాంటిది జరిగే అవకాశం లేదనటం లేదు ప్రొఫెసర్ క్రూగ్మన్. ప్రణబ్ ముఖర్జీ బడ్జెట్ ప్రతిపాదించిన మరుసటి రోజే వివిధ దేశాల ద్రవ్య స్థిరత్వాల్ని అంచనా వేసే స్టాండర్డ్–పూర్ సంస్థ భారతీయ ద్రవ్య స్థిరత్వ ప్రమాణాన్ని 'స్థిరం' నుండి 'నెగటివ్'కు దించివేసింది. అంతర్జాతీయంగా దేశ ద్రవ్య స్థిరత్వాన్ని గురించిన ఆవేదనలు ప్రస్తుత ప్రపంచవ్యాప్త డబ్బు కరువులో పెద్దగా పట్టించుకోనవసరం ఉండదు. స్టాండర్డ్–పూర్ సంస్థ అంచనా భారత దేశ గణాంకాల మీద చేసిన విశ్లేషణ. ప్రపంచ దేశాలన్నింటిలో భారత దేశ ద్రవ్య విలువ భవిష్యత్తులో ఎలా ఉంటున్నది భవిష్యత్ గణాంకాల మీదే ఆధార పడుతుంది. జాగ్రత్త అవసరమనే మన ఆర్థిక మంత్రి కూడా అంటున్నాడు. ఆ జాగ్రత్త ఫ్రైడ్మన్ గారి 'నాయిరు' సిద్ధాంతాల దాకా వెళ్లకూడదనేదే విజ్ఞుల ఆశ. ప్రపంచమంతా అల్లకల్లోలంగా ఉన్న ఈ సమయంలో ధైర్యంతో, చొరవ తీసుకుని ముందుకు వెళ్లే వాడే బాగుపడే అవకాశం ఎక్కువ. ప్రణబ్ ముఖర్జీ ఈ లోటులతో భారత నిర్మాణ్, ఉపాధి హామీ, జాతీయ రహదార్ల నిర్మాణాలకు వినియోగించ నున్నాడు. ఈ కార్యక్రమాలు గతంలో లాగే డబ్బును ఖర్చుపెట్టే కార్మికవర్గాలకే ఎక్కువగా అందజేస్తాయి. ప్రజలంతా బాగా ఖర్చులు పెంచితే ఉత్పత్తులకు గిరాకీ పెరిగి, అమ్మకాలు పెరిగి ఉపాధులు ఉద్యోగాలు ఎక్కువయ్యే అవకాశాలు ఎక్కువవుతాయి. అమ్మకాలు వినియోగం ఎక్కువ అయితే డబ్బు కరువు(మాంద్యం) కరిగిపోతుంది. కాబట్టి స్టాండర్డ్–పూర్ సంస్థ విశ్లేషణ, దానికనుగుణంగా పలికే దేశీయ విశ్లేషకులూ చెప్పేదంతా లేని దయ్యాన్ని ఊహించుకొని భయపడటమే అవుతుంది.

ఆహార పదార్థాల ధరవరల్లో కలుగుతున్న పెరుగుదల విశ్లేషించకుండా ఈ చర్చ పూర్తి కాదు. ఈ మధ్యకాలంలో దేశమంతటా వస్తువుల ధరలు పెరిగాయి. ఇందులో ముఖ్యమైంది ఇదివరకు ఈ మార్కెట్లలో ప్రవేశార్హత లేని పేద ప్రజలు (ఉపాధి హామీ కింద కూలీలు సంపాదించుకొంటున్నవారు) ఇందులో పాల్గొంటున్నారు. గిరాకీ పెరగడంతో ధరలు పెరగటం సాధారణమే. మరో రెండు మౌలిక కారణాలు కూడా కలిసాయి. ఒకటి ఆహారపదార్థాల మద్దతు ధర ఈ మధ్యకాలంలో బాగా పెంచడం జరిగింది. ఇందువల్ల రైతులు బాగుపడ్డారు. ఉత్పత్తి పెరుగుతున్నది గాని ఎక్కువ గిరాకీ ఉన్న దొడ్డు రకాలవడం ఒక కారణం. ముతక బియ్యానికి కేరళ లాంటి రాష్ట్రాలలో అధిక గిరాకీ ఉండటంతో ఆ రకాలు ఎక్కువ పండిస్తున్నారు. అదీ కాక పండుతున్న సన్న బియ్యానికి రాష్ట్రం అవతల మంచి గిరాకీ ఉన్నందున అక్కడ అమ్ముకుంటున్నారు. ఇది రైతులే చేస్తున్నారా వ్యాపారస్తులు చేస్తున్నారా అన్నది అప్రస్తుతం. మన రాష్ట్రంలో వ్యాపారస్తులు లాభాలు చేసుకోకూడదని అనుకోవటం పొరపాటు. చాలా మంది విశ్లేషకులు 'మధ్య దళారీ'వర్గాలను భూతాలుగా చిత్రీకరిస్తుంటారు. ఇది మరీ చోద్యం. వ్యాపారం లేకుంటే రైతులు పండించే ధాన్యాలు వినియోగాదరులకు చేరవు, రైతులే నష్టపోతారు. ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా సామాన్య ప్రజలకు కొంత ఊరట లభిస్తోంది. మిగతావారు ఈ డబ్బు కరువుల రోజుల్లో కొంచెం అధిక ధరలు భరించక తప్పదు. లేకపోతే ఉపాధులకు గండిపడే ప్రమాదం ఉంది. ఈ బడ్జెట్‌లోని ప్రతిపాదనలు అమలు చేయకపోతే వారి ఉద్యోగాలు రేపే అస్తిత్వం కోల్పోవచ్చు. కీన్స్ నేర్పించిన పాఠాలను మరిచి అజ్ఞానాంధకారమనే ఊబిలో దిగబడకుండా ఆలోచిస్తే, ముఖర్జీ ప్రవేశపెట్టిన బడ్జట్ ఈ ప్రభుత్వానికి 'ఆమ్ ఆద్మీ'కి మంచి చేకూర్చడం బాగా తెలిసిన విద్యేనన్నది మరొకసారి గుర్తుచేస్తుంది. వీ

*వ్యవసాయ రంగ నిర్లక్ష్యంతో, అనుత్పాదక పథకాలతో ప్రధాని ప్రకటిస్తున్న సమ్మిళిత వృద్ధి సాధ్యం కాదంటున్నారు*

**వి. చలపతిరావు**

# ఆశించిన వృద్ధిరేటు సాధ్యమైనా?

ప్రణబ్ ముఖర్జీ 2009-10 సంవత్సరం కొరకు ప్రవేశపెట్టిన కేంద్ర బడ్జెట్, సంస్కరణల ప్రాధాన్యత కలదా లేదా సంక్షేమ ప్రాధాన్యత కలదా అన్న విషయం పై భిన్న అభిప్రాయాలు వ్యక్తమయాయి. కొంతమంది నిపుణులు పత్రికలు విశ్లేషించి బడ్జెట్ ఎక్కువగా గ్రామీణాభివృద్ధి దిశలో ఉందనీ, ఈ బడ్జెట్ సమ్మిళత అభివృద్ధి దిశలో ఉందనీ అభిప్రాయం వ్యక్తం చేశారు. అంటే ఈ బడ్జెట్ సంస్కరణలకు ప్రాధాన్యత ఇచ్చేదిగాలేదు, ప్రైవేటీకరణను కాని కార్పొరేట్ సెక్టార్‌ను బలోపేతం చేసే వైపుగా మొగ్గు చూపటం లేదు అనే అభిప్రాయాన్ని కొంత వరకు కలిగించేటట్లుగా ఉంది. అందుకే స్టాక్ మార్కెట్ వ్యాపారం బడ్జెట్ ప్రవేశ పెట్టిన రోజే 879 పాయింట్లు పడిపోయింది. అంటే కంపెనీల షేర్లలో పెట్టుబడులు పెట్టేవారు కంపెనీలలో ఈ బడ్జెట్‌లో సూచించిన విధంగా డిసిన్వెస్ట్‌మెంట్ ద్వారా ఎక్కువ నిధులు ప్రవహించుతాయో లేదో అన్న అనుమానంలో పడ్డట్లుంది. కాని తర్వాత ఆర్థిక మంత్రి పిఎస్‌యులలో 51 శాతం షేర్లను ప్రభుత్వం నిలిపి ఉంచుకొని మిగతా షేర్లను ప్రవేట్ కంపెనీలకు అమ్ముతామన్న సంకేతమిచ్చాడు. బడ్జెట్ చర్చకు సమాధాన మిచ్చే సమయంలో ఈ విషయం స్పష్టంచేయగానే స్టాక్ మార్కెట్ వ్యాపారం మరల పుంజుకున్నది.

ఈ బడ్జెట్ లక్ష్యం 9 శాతం జి.డి.పి.ని (స్థూలజాతీయోత్పత్తి) సాధించడం అని ఆర్థికమంత్రి పేర్కొన్నారు. దీని కొరకు ఇటు వ్యవసాయరంగానికి అటు పారిశ్రామికరంగానికి భారీగా ఉద్దీపన కార్యక్రమాలు చేబట్టడానికి, భారీ ద్రవ్యలోటు 6.8 శాతంతో, భారీ పెట్టుబడులు ప్రణాళిక వ్యయం, ప్రణాళికేతర వ్యయాలు కలుపుకొని మొత్తం 10.38 లక్షల కోట్లతో బడ్జెటును ప్రతిపాదించారు. ఈ బడ్జెట్‌లో రెవెన్యూలోటు 4.8 శాతం. ఈ రెవెన్యూలోటును పూడ్చుకోవడానికి ఈ బడ్జెట్ కాలంలో 4లక్షల కోట్ల రూపాయిల మేరకు మార్కెట్ నుండి అప్పులు రాబట్టవలసి ఉంది. ఈ ప్రభుత్వం సంస్కరణల పేర ఎన్ని పిఎస్‌యులలో ఎంత మేరకు డిసిన్వెస్ట్‌మెంట్ చేసి రెవెన్యూలోటు పూడ్చుకోగలదో ఈ బడ్జెట్ తేల్చి చెప్పలేదు.

గత యు.పి.ఏ ప్రభుత్వ కాలంలో సగటు జి.డి.పి వృద్ధి 8.5 శాతం ఉందని చిదంబరం గొప్పలు చెప్పినారు. ఒకవేళ నిజంగా గత ప్రభుత్వ కాలంలో సగటు జి.డి.పి వృద్ధి 8.5 శాతం ఉంటే, ఇప్పుడు ఈ బడ్జెట్ కాలంలో పెట్టుబడి కోసం 6.8 శాతం ద్రవ్యలోటు ఎందుకు ప్రతిపాదించవలసి వస్తుంది? ఈ బడ్జెట్‌లో చూపిన 6.8 శాతంతో పాటు, రాష్ట్రాల బడ్జెట్‌లలో ఉండే లోటులు, బడ్జెటేతర ప్రవేట్‌రంగంలోని ద్రవ్యలోటులను కలిపి వెరసి మొత్తం జి.డి.పి.లో ద్రవ్యలోటు 12 శాతం వరకు ఉంటుందని నిపుణుల అంచనా.

సదరు భారీ ద్రవ్య లోటును, రెవెన్యూలోటులను కేంద్రబడ్జెట్‌లో సూచించడం కేంద్రం తెచ్చిన ఎఫ్.ఆర్.బి.ఎం చట్టం నిర్దేశించిన లక్ష్యాల కన్న (ఈ చట్టం ప్రకారం లోటు మూడు శాతం కన్న ఎక్కువ ఉండకూడదు) ఎంతో ఎక్కువగా ఉంది. కేంద్రం దేశంలో, రాష్ట్రాలలో బడ్జెట్ లోటులను నియంత్రించడానికి తెచ్చిన సదరు చట్టాన్ని కేంద్రమే అతిక్రమించితే, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక మంత్రి రోశయ్య తన బడ్జెట్‌లో కూడా భారీ రెవెన్యూ, ద్రవ్యలోటులను చూపడంలో సంక్షేమ పథకాలకు భారీ కేటాయింపులను చూపడంలో ఇంకా ఎక్కువ వేగాన్ని ప్రదర్శించే ప్రయత్నం చేస్తారు. ఎందుకంటే గత సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ ఒక లక్ష కోట్ల రూపాయిల పెట్టుబడులతో ఆమోదం పొందినప్పటికీ, దీనికి సంబంధించిన వివిధ పద్దులపై నిధులు రు. 80,000 కోట్లకు మించవని సమాచారం. ఈ ఎనభై వేల కోట్ల రూపాయిల ఖర్చులో ఏ పద్దు కింద ఎంత ఖర్చు అయింది, ఈ ఖర్చుకు వ్యతిరేకంగా ఎంతవరకు భౌతిక లక్ష్యాలు సాధించబడినవి అన్న వివరాలు బహిరంగపరచలేదు. అసలు రోశయ్య బడ్జెట్లన్నీ గందరగోళాలతో కూడుకున్నవే. అవి పద్దువారిగా చర్చింపబడి ఎన్నడూ ఆమోదించబడలేదు. ఎప్పుడూ గెలిటిన్ పద్ధతితో ఆమోదించబడినవే. తర్వాత అమలులోను గందరగోళమే. పద్దు వారి ఖర్చుల వివరాలు సరిగా అందజెయబడవు. ఈ విషయంలో కాగ్ (రాజ్యాంగ పరమయిన ఆడిట్ సంస్థ) ఎన్నోసార్లు తప్పుబట్టినా దానికి సరి అయిన జవాబులు ఉండవు. అసలు కొత్త సంవత్సరపు బడ్జెట్‌లు ప్రవేశపెట్టే ముందు పాత బడ్జెట్ల పద్దువారి ఖర్చులు వాటి భౌతిక లక్ష్యాల వివరాలు ఒక ఇవాల్యూయేషన్ రిపోర్ట్ రూపంలో కాని అమలు అయిన తీరు రిపోర్ట్ కాని ఇవ్వాలని రెండు మూడు సంవత్సరాల కింద ఒక నియమం పార్లమెంట్‌లో వచ్చింది. అయినా దానిని అటు పార్లమెంట్‌లో కాని ఇటు అసెంబ్లీలలో కానీ పాటించిన దాఖలాలు లేవు. వీటి గురించి ప్రశ్నించిన దాఖలాలు లేవు.

కేంద్ర ప్రభుత్వం బడ్జెట్‌లో భారీ ద్రవ్యలోటును(6.8 శాతం) అరికట్టడానికి లేదా పూడ్చడానికి భారీ రుణ సేకరణ, అంటే సూమారు 4,00,000 కోట్ల రూపాయల అప్పులు ఇటు ప్రభుత్వ బాండ్ల అమ్మకం ద్వారా కానీ లేదా అటు రిజర్వు బ్యాంకు ద్వారా కానీ నేరుగా అప్పులు ఎత్తటం కాని చేయవలసి వస్తోందని నిపుణుల అంచనా. దీని వలన మార్కెట్‌లో డబ్బు సరఫరా ఎక్కువ కావటమే కాక ద్రవ్యోల్బణం పెరగటం దానితో పాటు ధరలు మరింత పెరిగిపోయే ప్రమాదం ఉంది. ఇప్పటికే దేశంలో సగటు వినియోగదారుడు అత్యవసర సరకుల పెరుగుదలతో

సతమతమవుతు కష్టాలపాలవుతున్నాడు. ప్రభుత్వం ఇంత క్లిష్ట దశలో కూడా సగటు పౌరున్ని ఈ ధరాఘతం నుండి రక్షించటానికి, తమ పొదిలో ఉన్న మంచి ఆయుధం అత్యవసర సరకుల చట్టాన్ని అమలు చేయక, ఇంకొక వైపు ప్రజా పంపిణీ విధానాన్ని బలహీనపరిచి, రైస్ మిల్లర్లతో అక్రమ సరకుల నిలువదారులతో దోస్తీ బడాయించి, ఇప్పుడు నాటకీయంగా సరికొత్త చట్టం ఆహార భద్రత చట్టం ప్రసక్తి ఈ బడ్జెట్‌లో ముందుకు తీసుక వచ్చింది. ఈ నాటకాలతో, బూటకపు చర్యలతో ప్రజల ఆర్థికాభివృద్ధి తక్కువ, ప్రభుత్వాన్ని ఏలే పాలకులకు రాజకీయ లబ్ధి ఎక్కువ.

ఇంత భారీగా ద్రవ్య, రెవిన్యూ లోటును ప్రకటిస్తూ ఆర్థికమంత్రి అదే సమయంలో దేశంలోని 'ఆమ్ ఆద్మీ'ని కేంద్ర బిందువుగా తీసుకొని బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. దీని కోసం జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం కోసం భారీ ఉద్దీపన కేటాయింపులు (రు. 39,100 కోట్లు) చేయడమే కాక ఇతర గ్రామీణాభివృద్ధి, భారత్ నిర్మాణ్‌లాంటి స్కీంల కింద తగు నిధుల కేటాయింపు చేయడం జరిగింది. రైతులకు భారీ రుణ సౌకర్యం రు. 3,20,000 కోట్ల లక్ష్యంతో కలిగించింది. ఈసారి ఎరువులపై ఇచ్చే సబ్సిడీని రైతుకే నేరుగా ఇవ్వగలమని ప్రకటించారు. మంచిదే, ఇలాంటి గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలకు భారీ కేటాయింపులను, వాటి భౌతిక లక్ష్యాలను నిజం చేయబూనటం, తత్సంబంధిత స్కీంలను విజయవంతంగా చేయబూనటం లాంటి ప్రయత్నాలను చేబట్టడం ఒక విధంగా ఆర్థిక మంత్రి జూద క్రీడలోకి దిగటమే. ఎందుకంటే ఇది ఒక విధంగా అప్పు చేసి పప్పుకూడు తినటంలాంటిది. ఇక్కడ పప్పుకూడు తినే ప్రయత్నం చేయటం అంటే గ్రామీణాభివృద్ధి పేర కొన్ని అనుత్పాదక పథకాలు అమలు చేయబూనటం. ఇది కేవలం రాజకీయ లబ్ధి కొరకు మాత్రమే అని అనుకోవాల్సి వస్తుంది. గ్రామీణ ఉపాధి హామీ పథకం ప్రవేశ పెట్టడం వల్లనే కాంగ్రెస్ కేంద్రంలో అధికారంలోకి వచ్చిందని కాంగ్రెస్సే కాక ప్రతిపక్షాలు కూడా భావిస్తున్నవి. అయితే ఈ ప్రతిష్టాత్మక స్కీంతో పాటూ ఇంకా ఇతర రైతుల అప్పులు మాఫీ లాంటివి గత సంవత్సరం అమలు పరిచిన వ్యవసాయరంగం వృద్ధి 1.8 శాతం వద్దే నిలిచి ఉంది. ఇప్పుడు సదరు గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని మరింత బలోపేతం చేయాటానికి రోజువారి కూలీ 80 నుండి 100 రూపాయలకు పెంచడమే కాక కేటాయింపు కూడా 140 శాతం ఎక్కువ చేశారు. కానీ గతసారి సోషల్ ఆడిట్ రిపోర్టులలో పేర్కొన్నట్లు ఈ పథకం అమలులో అవినీతిని అరికడితే గ్రామాల నుండి వలసలను ఆపడమే కాక ప్రధానమంత్రి ఆశించినట్లు వ్యవసాయ రంగంలో 4 శాతం అభివృద్ధి సాధించవచ్చును. గ్రామాలలో ప్రజలకు చెరువులు కుంటల్లాంటి స్థిరాస్తులను కూడా అభివృద్ధి చేయవచ్చును.

కాంగ్రెస్ నాయకత్వంలో నడచిన యు.పి.ఏ ప్రభుత్వం గత అయిదు సంవత్సరాలలో సగటున 8.5 శాతం వృద్ధిని సాధించిందని చెప్పుకుంటోంది. కానీ ఇది వాస్తవంగా 5.5 శాతం దగ్గర్లోనే ఉంటుందని నిపుణుల అంచనా. అన్ని వస్తువుల ధరలు దినదినం ఆకాశాన్నంటు తుంటే ప్రభుత్వం ద్రవ్యోల్బణం 1.4 శాతం వరకు పడిపోయిందని తప్పుడు గణాంకాలను ప్రకటించడం లాంటిదే సదరు 8.5 శాతం వృద్ధి కూడా. ఒకవేళ గత యు.పి.ఎ. కాలంలో సగటు జి.డి.పి. వృద్ధి 8.5 శాతం ఉండి ఉంటే ఎందుకు ఇంత భారీ ద్రవ్య, రెవిన్యూ లోటులను కేంద్రం, రాష్ట్రాలు ఎదుర్కోవలసి వచ్చింది.

ప్రముఖ ఆర్థికవేత్త, బ్యాంకింగ్ నిపుణుడైన ప్రధాని దేశ జి.డి.పి. 9 నుండి 10 శాతం వృద్ధిని సాధించాలంటే వ్యవసాయ రంగ వృద్ధి జి.డి.పి.లో 4 శాతం సాధించాలని ఎన్నోసార్లు చెప్పారు. అందుకే ఆయన మన పంచవర్ష ప్రణాళికల అమలులో వార్షిక బడ్జెట్‌లలో సమ్మిళత అభివృద్ధికి ప్రోత్సాహం ఉండాలని సూచించారు. మన ఆర్థికాభివృద్ధి చరిత్రలో ఈ భావన కొత్తది కానప్పటికీ మన్మోహన్ సింగ్ ఈ సమ్మిళిత అభివృద్ధిపై ఎక్కువ గురుత్వాన్ని వేసినారు. అయినా కాని ప్రధాని ఆశించిన విధంగా దేశంలో సమ్మిళిత అభివృద్ధి సాధించబడడం లేదు. గ్రామీణ రంగంగాని, వ్యవసాయరంగం గాని బలోపేతం అయి, జి.డి.పి. లో 4 శాతం అభివృద్ధి సాధించే స్థాయికి రాలేదు. 60 శాతం ప్రజలు ఆధారపడి బతికే వ్యవసాయరంగం వృద్ధిరేటు 1.8 శాతం వద్ద నిలకడగా ఉండటం చాలా ఆందోళనకరమైన విషయం. దీని గురించి పాలకులు, ప్రజా ప్రతినిధులు, అధికారులు, దేశంలో ఆర్థికవేత్తలు కలిసికట్టుగా ఆలోచించాల్సి ఉంది. అప్పుడే వ్యవసాయరంగంలో, రైతుల ఆత్మహత్యలు లాంటి కారణాత్మక ధోరణులు తగ్గిపోయి, ఈ రంగంలో ఉత్పత్తి పెరిగి వృద్ధిరేటు పెరుగుతుంది. ముఖ్యంగా ఈ కింది విషయాలపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమ్మిళితాభివృద్ధిని ఆశించిన స్థాయిలో సాధించాలంటే దృష్టి పెట్టాల్సి ఉంటుంది.

1. ఎరువులపై సబ్సిడీ నేరుగా రైతులకి ఇచ్చినంత మాత్రాన సరిపోదు. అసలు రైతులకు విత్తే సీజన్‌కు పూర్వమే ఎరువులు, పురుగుమందులు, మేలు రకం విత్తనాలు సరఫరా తప్పక కావాలి. సరసమైన ధరలకు లభించాలి. ఎరువుల డీలర్లు స్టాకుల దాచి బ్లాక్ చేస్తుంటే రైతులు ఎన్నో మార్కెట్‌లలో డీలర్ల పై దాడి చేశారు. అరెస్టు అయినారు.

2. అదే విధంగా రైతులు పండించే పంటలను వ్యవసాయ మార్కెట్‌లకు అమ్ముకోవడానికి తరలిస్తే, అందరు వ్యాపారులు కుమ్మక్కయి సతాయించటం పరిపాటయింది. తర్వాత రైతులు విసిగెత్తి వ్యాపారులు ఇచ్చే తక్కువ ధరలకు అమ్మి పోవటం నిత్యం చూస్తున్న ధోరణి. ప్రభుత్వం ఏవిధంగానయితే రైస్ మిల్లర్లతో హోల్‌సేల్ డీలర్లతో కుమ్మక్కయి, నిత్యావసర వస్తువుల ధరలకు కళ్లెం వేయలేక పోతున్నదో, వినియోగదారులను రక్షించలేకపోతున్నదో అదే విధంగా వ్యవసాయ మార్కెట్లలో ధాన్యం కొనుగోలు దార్లతో కుమ్మక్కయి రైతులు పండించే ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు ఇప్పించలేకపోతున్నది.

3. రైతులకు సరిపోను కరెంటు, సాగునీరు అందించటం ప్రభుత్వ బాధ్యత. ప్రస్తుతం ప్రభుత్వం బ్యాంకుల ద్వారా రైతులకిచ్చే రుణ సౌకర్యం (రు. 3,20,000 కోట్ల రుణం) దేశంలో ఉన్న సగం రైతులకు కూడా సరిపోదు. మిగతా రైతులందరూ ప్రవేటు వడ్డీ వ్యాపారస్తుల వద్ద 24 శాతం నుండి 36 శాతం వడ్డీ రేట్లకు ఇంకా కొన్ని గ్రామాలలో అంత కన్న ఎక్కువ వడ్డీ రేట్లకు అప్పులు తెచ్చి సాగు చేయవలసివస్తోంది. ఇంత దారుణమైన అప్పులు తీసుకవచ్చి, మరల తీర్చలేక రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. సదరు రైతుల సమస్యల పరిష్కారానికి ఈ కేంద్ర బడ్జెట్‌లో సరి అయిన పరిష్కారం చూపబడలేదు. కావున ఈ బడ్జెట్‌లో ఆశించిన సమ్మిళిత అభివృద్ధిగాని, 9 శాతం జి.డి.పి.ని గాని సాధించడం కష్టతరమవుతుంది. వీ

*వ్యాపార ప్రయోజనాలే గాని ప్రజల సంక్షేమం పట్టని విధానాల కొనసాగింపులో భాగమే ఈ మంచినీళ్ల వ్యాపారం అంటున్నారు* **సి. రామచంద్రయ్య**

# ఆర్.ఓ. మిషన్ల అసలు ఉద్దేశాలు

మొదటి దశలో ప్రతి మండలానికొక రివర్స్ ఆస్మోసిస్ (ఆర్.ఓ.) ప్లాంట్ మిషన్ నెలకొల్పి శుద్ధి చేసిన మంచినీటిని 20 లీటర్ల డబ్బాను రు. 2.00లకు విక్రయించనున్నట్లు ప్రభుత్వం నిర్ణయించింది. ఈ పథకానికి 'సుజలాం–సుఫలాం'గా పేరుపెట్టినట్లు విన్నాం. ఈ పథకం ఉద్దేశం పట్ల, దాని ప్రభావం పట్ల విభిన్న అభిప్రాయాలున్నాయి. కాని పెద్ద ఎత్తున విమర్శలు, ఉద్యమం చేస్తామంటు వచ్చే హెచ్చరికలు పెద్దగా వినపడలేదు. గ్రామాలలో మంచినీటి వ్యవస్థకు, నీటిని శుద్ధిచేసే యంత్రాలకు, పెరుగుతున్న మంచినీటి వ్యాపారానికి సంబంధించిన కొన్ని కోణాలను ఇక్కడ చర్చించే ప్రయత్నం చేస్తున్నాను.

ప్రతి మండలంలోను, ఆ తర్వాత ఇతర గ్రామాలలోను ఆర్.ఓ. మిషన్లు పెట్టాలనే నిర్ణయాన్ని ప్రభుత్వం ఏ ప్రాతిపదికన తీసుకుంది? తాగునీటి, ప్రజారోగ్య సంబంధిత నిపుణుల కమిటీ ఏదైన ఒక అధ్యయనం చేసి, సిఫారసు చేసిందా? తాగునీరు ప్రజల ఆరోగ్యంతో ప్రత్యక్ష సంబంధం ఉన్న మాట నిజమే. అయినా నీటి శుద్ధికి వివిధ సాంకేతిక పద్ధతులున్నప్పటికీ ఆర్.ఓ. పద్ధతి మాత్రమే శ్రేష్టమైందని ఎవరు తేల్చారు? లేక దీని వెనుక ఇంకేమయిన మతలబు ఉన్నదా? గ్రామీణ నీటి సరఫరాకోసం ప్రతి సంవత్సరం ఖర్చు పెడుతున్న వందల కోట్ల నిధులు ఏమవుతున్నట్లు? రెండంకెల ఆర్థిక వృద్ధిరేటు సాధిస్తున్నామని, ప్రపంచంలోనే ఆర్థిక శక్తిగా ఎదుగుతున్నామని, సంక్షేమ కార్యక్రమాలో ప్రజలకు దగ్గరయ్యామని చెప్పుకొంటున్న ప్రభుత్వాలు గ్రామీణ ప్రజలకు తలసరి 40 లీటర్ల మంచినీటిని సరఫరా చేయడంలో విఫలమయ్యాయని ఒప్పుకుంటున్నాయా? లేక తాగునీటి రంగంలో ఇప్పటికే జరుగుతున్న ప్రయివేటీకరణకు అధికారిక ముద్రవేసి ప్రధాన రాజకీయపార్టీలు (ముఖ్యంగా అధికారంలో ఉన్న) తమ కార్యకర్తలకు అప్ప జెప్పే కాంట్రాక్టులలో భాగంగా ఆర్.ఓ. మిషన్ల వ్యాపారానికి గ్రామాలను పంచుకోబోతున్నాయా?

**పట్టిక–1**

| క్ర. సం. | నీటి సరఫరా స్థాయి | గ్రామాల (ఆవాసాల) సంఖ్య | శాతం |
|---|---|---|---|
| 1. | పూర్తిస్థాయిలో సరఫరా చేస్తున్నవి | 31,293 | 43.0 |
| 2. | పాక్షిక స్థాయిలో సరఫరా చేస్తున్నవి | 32,738 | 45.0 |
| 3. | అసలు సరఫరా లేనివి | 6,255 | 9.0 |
| 4. | క్షేమదాయక నీళ్లే లేనివి | 1,953 | 3.0 |
| | **మొత్తం** | **72,239** | **100.0** |

ఆధారం: గ్రామీణ నీటి సరఫరా, పారిశుద్ధ్యశాఖ, ఆం.ప్ర. ప్రభుత్వం

రాష్ట్రంలో ప్రభుత్వ విధానం ప్రకారం తలసరి రోజుకు 40 లీటర్లు సరఫరా చేస్తుంటే అలాంటి గ్రామాలను పూర్తిగా కవర్ చేసినట్లుగాను, 10–40 లీటర్ల సరఫరా ఉంటే పాక్షికంగా కవరైనట్లుగాను, 10 లీటర్ల లోపు ఉంటె అసలే లేనట్లుగాను గ్రామాలను గుర్తించడం జరిగింది. అధికారిక గణాంకాల ప్రకారం రాష్ట్రంలోని గ్రామాలలో నీటి సరఫరా పరిస్థితి పట్టిక 1లో ఉంది

గణాంకాలు అన్ని కోణాలను తెలపలేవు. పట్టికలో స్పష్టమవుతున్న విషయం సగానికి పైగా గ్రామాలలో నమ్మకమైన నీటి సరఫరా వ్యవస్థ లేకపోవడం. అనేక చోట్ల భౌతికంగా సదుపాయం కల్పించినప్పటికి ప్రజలకు కనీస మోతాదులో నీరు అందడంలేదు. ఈ పరిస్థితిని అధిగమించడం ప్రభుత్వ రంగానికి అంత కష్టమా? పంచాయితీలకు నిధులు, విధులు బదలాయించి పారదర్శకతను, జవాబుదారీతనాన్ని పెంపొందించే ప్రయత్నాలేమైన జరిగాయా? గ్రామీణ నీటి సరఫరా స్కీంలను రూపకల్పన, నిర్మించడంలో పంచాయితీ సభ్యుల కంటే కాంట్రాక్టర్ల, అధికార పార్టీల నాయకుల పాత్ర ఎక్కువన్నది నిజం కాదా?

గణాంకాలలో కానరాని కోణం నీటి నాణ్యత. ప్రభుత్వ లెక్కల ప్రకారం దాదాపు 72శాతం నీటి సరఫరా స్కీంలు భూగర్భ నీటిపైన, మిగిలినవి ఉపరితల నీటిపై ఆధారపడి ఉన్నాయి. గ్రామాలలో వివిధ కారణాల వలన భూగర్భ నీరు కలుషితమవుతోంది. వర్షాలు సరిగా లేని ప్రాంతాలలో లోతుకు వెళ్లే కొద్దీ నీటి నాణ్యత తగ్గుతోంది. నల్గొండ, అనేక ఇతర జిల్లాలలో ఫ్లోరైడ్ శాతం పెరగడం వలన కలుగుతున్న అనర్థాలు అన్నీ ఇన్నీకావు. పట్టణాల నుంచి విడుదలయ్యే మురికినీటిని శుద్ధి చేయకుండా వంకలు, వాగులు, చెరువులు, కుంటలలోకి వదలడం వలన అనేక గ్రామాలకున్న నీటి వనరులు కలుషితమవుతున్నాయి. ఒక గ్రామానికి గాని, ప్రాంతానికి గాని తాగునీటి వ్యవస్థను నిర్మించిన తర్వాత ఆ నీటి ఆధారాన్ని పరిరక్షించడం ప్రభుత్వ ప్రధాన కర్తవ్యం. కానీ ఆ ప్రక్రియను పూర్తిగా విస్మరించి భౌతికపరమైన సదుపాయాలైన బోరింగులు వేయడంలోను, ఎతైన నీటి ట్యాంకులను నిర్మించడంలోను, దూర ప్రాంతాల నుంచి పైపు లైన్లు వేయడంలోను ప్రభుత్వ విభాగాలు ఎక్కువ శ్రద్ధ చూపించాయి. అందువల్లనే నీటి సరఫరా సక్రమంగా జరిగిన అనేక గ్రామాలలో కూడా నేడు కొరత కనిపిస్తోంది. నీటిలో

నాణ్యత లేనందువలన ప్రజలు అనేక వ్యాధులకు గురవుతున్నారు. నీటి కొరత, కాలుష్యం ప్రధాన సమస్యలుగా ఉన్నాయి.

ముఖ్యంగా గత పదేళ్ల నుండి ఆరోగ్యం పట్ల ప్రజలలో చైతన్యం పెరిగింది. ఆర్థిక సంస్కరణలు కూడా తోడవడం వలన తాగునీటి వ్యాపారం విపరీతంగా పెరిగింది. మధ్యతరగతి ప్రజలలో కొనుగోలు శక్తి పెరిగిన మాట వాస్తవం. పట్టణాలకే మొదట్లో పరిమితమైన బాటిల్ నీళ్ల వ్యాపారం ఇపుడు పల్లెలకు కూడా విస్తరించింది. ఒకప్పుడు బస్టాండులలోనూ, రైల్వే స్టేషన్లలోనూ, కుళాయిల దగ్గర నీరు నింపుకోండం అలవాటుగా ఉండేది. ఇప్పుడు బాటిల్ నీళ్లు చేతిలో లేని ప్రయాణీకులు కనబడటం కష్టం. పెద్ద బహుళజాతి, దేశీయ కంపెనీలతో పాటు వందల కొలది లైసెన్సులు లేని చిన్న చిన్న నీటి వ్యాపారులు చిన్న పట్టణాలలో దర్శనమిస్తారు. లీటరుకు 10-14 రూపాయల వరకు చెల్లించి కొంటున్నారు. లేదా కొనవలసి వస్తున్నది. ముఖ్యంగా ప్రభుత్వ నీటిమీద నమ్మకం తగ్గడం వలన. ఇటీవల కాలంలో గృహాలకు నేరుగా 10-20 లీటర్ల నీళ్ల క్యాన్లు సరఫరా చేయడం కూడా జరుగుతోంది. చిన్న పట్టణాలకు, కొన్ని చోట్ల గ్రామాలకు ఈ వ్యాపారం విస్తరిస్తున్నది. కొనుక్కొని తాగే నీళ్లే శ్రేష్టమైనవనే భావన ప్రజలలో వ్యాప్తి చెందింది. ఇందులో ప్రభుత్వ పాత్ర కూడా ఉంది. కాని పేదవాళ్లు నీళ్ల కోసం ఏమి చేయాలి. ఇటీవల హైదరాబాద్‌లోని భోలక్‌పూర్ ప్రాంతంలో కలుషిత నీరు తాగి 16 మంది చనిపోగా కొన్ని వందల మంది ఆసుపత్రులపాలైనారు.

శుభ్రమైన తాగునీరు ప్రతి పౌరుడికి అందించడం ప్రభుత్వాల బాధ్యత అని, రాజ్యాంగంలోని ఆర్టికల్ 21 కల్పిస్తున్న జీవించే హక్కులో భాగంగా దానిని పరిగణించాలని, ఆ విధంగా తాగునీరు ప్రజల ప్రాథమిక హక్కు అని అనేక సందర్భాలలో హై కోర్టులు, సుప్రీం కోర్టు వ్యాఖ్యానించి ఉన్నాయి. భోలక్‌పూర్ మరణాల తర్వాత తాగునీరు అందించలేని ప్రభుత్వాలకు పాలించే నైతిక హక్కులేదని రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ అభిప్రాయపడింది. కాని తాగునీటిని కూడా అందించకుండా ప్రజల జీవితాలను అపహాస్యం చేస్తున్నాయి ప్రభుత్వాలు. అధికారంలో పార్టీలు మారినా వాస్తవ పరిస్థితులలో తేడా మాత్రం లేదు.

ప్రభుత్వం ప్రతి మండలంలోను ఆర్.ఒ. మిషన్‌లు పెట్టాలనే ముందు ఇప్పటికే కొన్ని గ్రామాలలో ప్రైవేటురంగం చొరవతో నడుస్తున్న నీటి సరఫరా వ్యవస్థలను పరిశీలించిందా అంటే అనుమానమే. అనంతపురం జిల్లాలో సత్యసాయి ట్రస్టు ద్వారా దాదాపు 1500 గ్రామాలలో నీటి సరఫరా జరుగుతోంది. ఈ స్కీం నిర్వహణ బాధ్యత ప్రభుత్వ శాఖలు చేపట్టిన తర్వాత ఉన్న అనుభవాలేమిటి? తద్వారా ఏమైన గుణపాఠాలు నేర్చుకొని తమపని మెరుగుపరచుకొనే దిశగా ప్రయత్నాలేమైనా జరుగుతున్నాయా? రెండు ప్రముఖ కార్పోరేట్ సంస్థలు బైర్రాజు ఫౌండేషన్, నాంది ఫౌండేషన్ కొన్ని జిల్లాలలో నీటి శుద్ధి మిషన్‌లను నెలకొల్పి 12-20 లీటర్ల నీటిని రు.1.50 నుండి 2.00 లకు విక్రయిస్తున్నారు. 'బాల వికాస' అనే స్వచ్ఛంద సంస్థ కూడా చాలా గ్రామాలలో ఆర్.ఒ. మిషన్‌లు స్థాపించింది. తాగునీటిని శుద్ధిచేసి అతి తక్కువ ధరకు గ్రామీణ ప్రజలకు సరఫరా చేయడంలో ఈ సంస్థలకున్న అనుభవాన్ని ప్రభుత్వం పరిగణనలోకి తీసుకున్నదా అంటే అనుమానమే. కొన్ని గ్రామాలలో 30శాతం ప్రజలు మాత్రమే తాగునీటికి వెచ్చించడానికి సిద్ధపడుతున్నట్లు తెలుస్తోంది. ఎంతో పట్టుదలతో మొదలు పెట్టినప్పటికి కార్పోరేటు సంస్థలే ఎందుకు ఈ స్కీంలను ఎక్కువగా విస్తరించలేక పోతున్నాయి. వీళ్ల అనుభవాల మీద సమగ్ర అధ్యయనం, చర్చ జరిగిన తర్వాత వాటి ఆధారంగా ఒక కొత్త నమూనాను చూపించగలిగే ప్రయత్నం ప్రభుత్వం చేయడం లేదు.

నీటిని శుద్ధి చేసేవారు ఆర్.ఒ.తో పాటు అల్ట్రావయొలెట్ (అతినీల లోహిత) పద్ధతి కూడా చాల ప్రాచుర్యంలో ఉంది. నీటి కాలుష్యాన్ని బట్టి సాంకేతిక పద్ధతిని ఎన్నుకోవాలి. అంతేకాని రాష్ట్రం మొత్తానికి ఒకే నమూనాను ఎంచుకోవడం అసమంజసం. అనుమానాస్పదం. అన్ని మండలాలలో స్వయం సహాయక బృందాలకు ఆర్.ఒ. మిషన్‌లను అప్ప జెప్పుతామంటోంది ప్రభుత్వం. అది కావాలని వాళ్లు అడిగారా? కానప్పుడు ఆర్.ఒ. మిషన్‌లను వాళ్ల మీద బలవంతంగా రుద్దడం కాదా? బ్యాంకుల నుంచి బలవంతంగా రుణాలు ఇప్పించి ఆర్.ఒ. మిషన్‌లను కొనుగోలు చేయించడమే ఇక్కడ ప్రధాన ఉద్దేశంగా కనబడుతోంది. వాళ్ల నీటిని కొనేవాళ్లు కరువై, పెట్టిన ఖర్చు రాక, బ్యాంకు అప్పు మిగిలి పోయినపుడు వాళ్ల పరిస్థితి ఏమిటి. కొన్ని వందల స్వయం సహాయక బృందాలు నిర్వీర్యమైపోయే పరిస్థితి ప్రభుత్వం కల్పిస్తున్నది.

ఆర్.ఒ. మిషన్‌లు సరిగా పనిచేయకపోతే రిపేరు చేసుకొనే సాంకేతిక పరిజ్ఞానం ఆ బృందాలకుంటుందా? ప్రభుత్వం ఇచ్చే శిక్షణే సరిపోతుందనుకుంటే ఫ్లోరైడ్ పీడిత గ్రామాలలో ఫ్లోరిన్ నిర్మూలన మిషన్‌లు ఎందుకు నిరుపయోగమైనాయి. ఆర్.ఒ. మిషన్‌ల పనితీరులో రెండు ముఖ్య భాగాలున్నాయి. ఒకటి నీటిని వడపోసే పొర. ఇది అత్యంత కీలకమైనది. ఈ పొర సమర్థవతంగా పని చేస్తేనే నీటిలోని కాలుష్యాన్ని నిర్మూలించగలదు. తరుచుగా నీటిని పరీక్షించినపుడే అది తెలుస్తుంది. స్వయం సహాయక బృందాలకు ఇది సాధ్యమా? చివరకు ఆర్.ఒ. మిషన్‌లోనుంచి వస్తున్నాయి కాబట్టి శుభ్రమైన నీరేలే అనుకొని (కాలుష్యం ఉన్నా సరే) తాగే స్థితికి ప్రజలు నెట్టబడరా? రెండు ఆర్.ఒ. పద్ధతిలో వృథా నీరు 50-60 శాతం ఉంటుంది. ఏ ఇతర నీటి శుద్ధి సాంకేతిక పద్ధతి కంటే ఇది చాలచాల ఎక్కువ. ఈ వ్యర్థ నీటిని ఏం చేస్తారు?

గ్రామాలలో ఇప్పటికే ఉన్న నీటి సరఫరా వ్యవస్థల నుండే నీరు తీసుకుంటారా లేక ప్రత్యేకంగా బోర్లు వేస్తారా? ప్రత్యేకంగా బోర్లు వేస్తే ఆ ఖర్చు ఎవరు భరించాలి? ఈ విషయాలను పరిగణనలోకి తీసుకొని ప్రభుత్వమేమైన ఒక సమగ్ర విధానాన్ని రూపొందించిందా? నీటి సరఫరా సజావుగా ఉన్న గ్రామాలు కూడా రాష్ట్రంలో చాలా ఉన్నాయి. ఈ ఆర్.ఒ.ల ప్రవేశం తర్వాత ఉన్న వ్యవస్థలను సరిగా పని చేయనిస్తారా? ఇంత హడావిడిగా అన్ని మండలాలలో ఆర్.ఒ. మిషన్‌లు పెట్టాలనడం వెనక తాత్కాలిక వ్యాపార ప్రయోజనాలు, రాజకీయంగా తమ అనుయాయులకు పనులు కల్పించడం లాంటి ఉద్దేశాలు తప్ప చిత్తశుద్ధితో ప్రజల భాగస్వామ్యంతో పంచాయితీలను బలోపేతం చేయడం వంటి వివిధ పద్ధతులలో గ్రామీణ నీటి సరఫరా వ్యవస్థలను బాగుచేయాలనే ప్రయత్నం కనపడడం లేదు.

వీ

*యశ్‌పాల్ సిఫారసుల నేపథ్యంలో పెద్ద ఎత్తున విద్య వ్యాపారీకరణకు ద్వారాలు తెరవబోతున్న కేంద్ర ప్రభుత్వ విద్యా విధానాన్ని వివరిస్తున్నారు* **కె. వేణుగోపాల్**

# ప్రైవేటీకరణే యశ్‌పాల్ సిఫారసుల ఎజెండా

స్వాతంత్ర్యం వచ్చిననాటి నుండి విద్యా రంగంపై విద్యా కమిషన్‌లు పలు సూచనలు చేశాయి. దేశ అవసరాలు, అందరికీ సమాన అవకాశాలు, సమాజ శ్రేయస్సు దృష్టిలో ఉంచుకొని గత కమిషన్‌లకు నాయకత్వం వహించిన విద్యావేత్తలు సూచనలు చేశారు. ఆ సూచనలలో కొన్ని అమలయ్యాయి. కొన్ని మంచి సూచనలు అటకెక్కాయి. 1990 తర్వాత రాజకీయవేత్తలు, పారిశ్రామికవేత్తలే విద్యా కమిషన్‌లకు నాయకత్వం వహించి నూతన ఆర్థిక విధానాల కనుగుణంగా విద్యారంగంలో ప్రైవేట్ పెట్టుబడులకు అనుమతులు, సమాన అవకాశాల స్థానంలో సెల్ఫ్ ఫైనాన్సింగ్ కోర్సులు, సంప్రదాయ కోర్సులకు బదులుగా ఫ్యాషన్ టెక్నాలజీ, హోటల్ మేనేజిమెంట్ వంటి కోర్సులను అనుమతించాలనే సిఫార్సులు చేశారు.

విద్యకున్న ఉదాత్తత, ఉండాల్సిన సృజనాత్మకత, పెరగాల్సిన నైపుణ్యం గురించి చెప్తూనే విద్యారంగంలో ప్రైవేటీకరణ ఎజెండా అమలుకు పచ్చజెండా ఊపుతూ విద్యావేత్త, యు.జి.సి. మాజీ ఛైర్మన్ యశ్‌పాల్ ఆధ్వర్యంలోని కమిటీ ఉన్నత విద్యా రంగంపై అనేక సిఫారసులు చేసింది. 'ఉన్నత విద్య పునరుద్ధరణ, పునరుజ్జీవం' పేరుతో ఈ నివేదిక విద్యా వ్యవస్థలో సమూల మార్పులను కోరుతూ తన అభిప్రాయాలను వెల్లడించింది.

విశ్వవిద్యాలయాలు జ్ఞాన సముపార్జన నిలయాలుగా ఉండాలనీ, అందులో అభ్యసించే విద్యార్థికి, సమాజానికి సంబంధం పెరిగి, తాను చదివే ఒక అంశం (డిసిప్లెయిన్)కు పరిమితం కాకుండా దాన్ని అధిగమించి విశాల జ్ఞానాన్ని ఆర్జించాలనీ, అందుకు ఒకే డిసిప్లిన్‌తో ఉండే ఉన్నత విద్యాసంస్థలన్నీ పూర్తి స్థాయి విశ్వవిద్యాలయాలుగా మారాలనీ, అవి ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకంగా ఉండాలనీ సిఫారసు చేశారు. యాంత్రికమైన చదువులు, భట్టీయం వేయడం, అప్పగించడం కాకుండా జ్ఞానవంతమైన సమాజ నిర్మాణానికి విశ్వవిద్యాలయాలు వేదికలుగా రూపొందాలి. అందుకు విశ్వవిద్యాలయాలు స్వీయ నియంత్రణతో స్వతంత్ర సంస్థలుగా రూపొందాలి. విశ్వవిద్యాలయాలు బాహ్య సమాజంతో సంబంధం కలిగి ఉండి ప్రజలు ఎదుర్కొనే రోజువారీ సమస్యలకు, ఆర్థిక, సాంస్కృతిక రంగాల సవాళ్లకు సమాధానాలు కనుగొనే సామర్థ్యం ఉండాలి.

తరగతి గదులకు, పుస్తకాలకు పరిమితమైన విద్యా వ్యవస్థ, దైనందిన జీవితంలోని సమస్యల పరిష్కారానికి ఉపయోగపడడం లేదు. పాఠ్యప్రణాళిక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయాలతో సంబంధం లేని విద్య, వేర్వేరు వ్యవహారాలుగా పరిశోధన, బోధన, నిర్బంధ ద్వీపకల్పంలా మారిన వృత్తి విద్యా కళాశాలలు, ఉన్నత విద్య నియంత్రణ, పర్యవేక్షణకు ఏకగవాక్షం లేకుండా ఉంది. యు.జి.సి, ఎ.ఐ.సి.టి.ఇ., ఎన్.సి.టి.ఇ. వంటి సంస్థల నిబంధనలు గందరగోళంగా ఉన్నాయి. అర్హులైన బోధకులు, మౌలిక సదుపాయాల కరువు, నాణ్యమైన బోధకులను విశ్వవిద్యాలయాలు అందించడంలేదు. విశ్వవిద్యాలయాలకు ఆర్థిక వనరుల కొరత, మితిమీరిన రాజకీయ జోక్యం ఎక్కువైంది. విశ్వవిద్యాలయాలు అనుబంధ డిగ్రీ కళాశాలలను పట్టించుకోవడం లేదు. సాంకేతిక, వృత్తి విద్యా కళాశాలలపై విశ్వవిద్యాలయాల అజమాయిషీ కొరవడింది. ప్రైవేట్ కళాశాలలు పుట్టగొడుగుల్లా వెలుస్తున్నాయి. అర్హత లేని యాజమాన్యాలు, ఫీజుల భారంతో విద్య వ్యాపారంగా మారింది.

స్వయం ప్రతిపత్తితో రాజ్యాంగ సవరణ ద్వారా ఎన్నికల కమిషన్ లాంటి 'ఉన్నత విద్య, పరిశోధన జాతీయ కమిషన్' (సి.ఎచ్.ఇ.ఆర్) ఏర్పాటు చేయాలి. యు.జి.సి. ఎ.ఐ.సి.టి.ఇ., ఎన్.సి.టి.ఇ. లాంటి సంస్థలను రద్దు చేయాలి. ఏకగవాక్షం ద్వారా ఉన్నత విద్యాసంస్థలకు గుర్తింపునివ్వాలి. సమాజం విసిరే సవాళ్లను, దైనందిన సమస్యలకు పరిష్కారం చూపే సామర్థ్యం పెంచే సిలబస్‌ను రూపొందించే సరికొత్త విద్యావిధానం రూపకల్పన చేయాలి. దేశ భౌగోళిక, సాంస్కృతిక, రాజకీయ భిన్నత్వాలను దృష్టిలో ఉంచుకొని పాఠ్యప్రణాళిక తయారు చేయాలి. పాఠశాల విద్యతో సహా అన్ని స్థాయిల్లోను నాణ్యమైన బోధకులను రూపొందించే బాధ్యత విశ్వవిద్యాలయాలకు అప్పగించాలి.

వివిధ రకాల వృత్తులు, ఉద్యోగాలపై విద్యార్థులకు అవగాహన కలిగించే పాఠ్య ప్రణాళిక రూపకల్పన చేయాలి. వృత్తి విద్యతో సహా అన్ని కోర్సుల పాఠ్యప్రణాళిక రూపకల్పనలో విశ్వవిద్యాలయాలకు స్వేచ్ఛ, స్వీయ నియంత్రణ బాధ్యతనివ్వాలి. ఉన్నత విద్య పరిశోధన జాతీయ కమిషన్ ద్వారా 1500 అత్యున్నత కళాశాలలకు విశ్వవిద్యాలయాల హోదా కల్పించాలి. విశ్వవిద్యాలయాల్లో ప్రవేశానికి జి.ఆర్.ఇ. లాంటి జాతీయ స్థాయి పరీక్ష నిర్వహించాలి. ఐ.ఐ.టి., ఐ.ఐ.ఎం.లను పూర్తి స్థాయి విశ్వవిద్యాలయాలుగా గుర్తింపు నివ్వాలి.

### కపిల్ సిబాల్ వంద రోజుల ప్రణాళిక

యశ్‌పాల్ కమిటీ చేసిన సిఫార్సులను అమలు చేయడానికి కేంద్ర మానవ వనరుల మంత్రి కపిల్ సిబాల్ 100 రోజుల్లో విద్యా

రంగంలో మార్పులు అంటూ ఆర్భాటంగా 25 జూన్ 2009 నాడు ఒక ప్రణాళికను ప్రకటించారు. ఈ ప్రణాళికలో యశ్‌పాల్ చేసిన సిఫార్సుల నేపథ్యంలో గత డిసెంబర్‌లో రాజ్యసభలో ప్రవేశపెట్టిన 'విద్యాహక్కు బిల్లు-2008'ను ఈ పార్లమెంట్ సమావేశాల్లో ఆమోదం, ఉన్నత విద్య, పరిశోధన, జాతీయ కమిషన్ ఏర్పాటు, ఎడ్యుకేషన్ ట్రిబ్యునల్ ఏర్పాటు, విదేశీ విద్యా సంస్థల నియంత్రణకు చట్టం, అఖిల భారత మదరసా బోర్డు, కాపీరైట్ చట్టానికి సవరణ. మోడల్ డిగ్రీ కళాశాలలు, 6000 మోడల్ ఉన్నత పాఠశాలలు, ఇందులో 3500 స్కూళ్లు ప్రైవేట్ భాగస్వామ్యంతో 20 ట్రిపుల్ ఐ.టీ.లు, 700 పాలిటెక్నిక్ కాలేజీల ప్రారంభం, 100 మహిళా హాస్టళ్లు, 12వ తరగతికి సింగిల్ బోర్డు, ఆప్షనల్‌గా 10వ తరగతి పరీక్ష, పేద విద్యార్థులకు వడ్డీ రాయితీ రుణాలు, ప్రాథమిక స్థాయిలో విద్యా సంస్థలకు గ్రేడులు ఇవ్వడానికి స్వతంత్ర ఏజెన్సీ ఏర్పాటు, డీమ్డ్ యూనివర్శిటీల పనితీరుపై సమీక్ష ఉన్నాయి.

సిబాల్ ప్రణాళికలో 'పదోతరగతి పరీక్ష రద్దు' దేశవ్యాప్త మీడియాలో చర్చనీయాంశం అయింది. కాని విదేశీ విద్యా సంస్థల ఏర్పాటు విద్యారంగంలో పబ్లిక్, ప్రైవేట్ భాగస్వామ్యంపై చర్చ జరగలేదు. చర్చ అంతా పాఠ్యప్రణాళిక, భట్టీ చదువులు, గ్రేడులు, మార్కులు, ర్యాంకులపై సాగింది. కాని దేశ అవసరాలు, స్వదేశీ వనరుల సద్వినియోగానికి మానవ వనరులను అభివృద్ధి చేసుకోవడం, అందుకు తగిన విద్యా విధానాన్ని రూపొందించుకోవడం, పెరుగుతున్న విద్యా వ్యాపారం, కొందరికే నాణ్యతగల విద్య, విద్యలో అంతరాలతో సమాజానికి జరగబోవు హాని వంటి మౌలిక విషయాలను మీడియా పట్టించుకోలేదు.

సిబాల్ ప్రణాళిక యశ్‌పాల్ సూచించిన అనేక అంశాలపై మౌనం వహించింది. ప్రభుత్వం అనుసరించే ఆర్థిక విధానాలకు అనుగుణంగా ఆయన సూచించని అనేక అంశాలపై ప్రభుత్వ వైఖరి ఈ 'వంద రోజుల ప్రణాళిక' ద్వారా బహిర్గతమవుతోంది. ముఖ్యంగా విదేశీ విశ్వవిద్యాలయాల ప్రవేశం, విద్యారంగంలో ప్రైవేట్ భాగస్వామ్యంతో విద్యారంగం వ్యాపారం కానున్నది. సిబాల్ ప్రణాళిక చెపుతున్నట్లు విద్యా నియంత్రణ వ్యవస్థ ద్వారా 'విద్య వ్యాపారమయం' కాకుండా ఆగకపోగా మరింత నియంత్రణ లేని పరిస్థితి ఏర్పడనుంది. ఇప్పటికే మన రాష్ట్రంలో అడ్డూ అదుపూ లేకుండా పెరిగిన వృత్తి విద్యా కళాశాలల్లో నియంత్రణ వ్యవస్థతోనే వందశాతం కన్వీనర్ కోటా కింద ఉన్న సీట్లు క్రమంగా 30 శాతం యాజమాన్య కోటాకు బదిలీ కావడం, రెండు రకాల ఫీజుల వ్యవస్థ రావడం, ప్రైవేట్ యాజమాన్యాల చట్టబద్ధ వ్యాపారానికి అనుమతిచ్చిన అనుభవం భవిష్యత్తులో ప్రతిపాదిత నియంత్రిత వ్యవస్థ క్రమంగా ప్రజలను విద్య వ్యాపారానికి అలవాటు చేసే ప్రమాదముంది. ఇదంతా నియంత్రణ వ్యవవస్థలోనే ప్రభుత్వ అనుమతితోనే జరిగింది. భవిష్యత్తులో ఈ సీట్లన్నీ మేనేజిమెంట్ కోటా కిందకి మారిపోయే అవకాశం ఉంది. ఫీజు రీయింబర్స్‌మెంటు సౌకర్యం చూపుతూ అన్ని సీట్లకు ఒకే ఫీజు విధానం తేనున్నారు.

పదవ తరగతి పరీక్ష రద్దు చర్చ ద్వారా ప్రభుత్వ పాఠశాలల్లోని చదువు నాణ్యత మరోసారి చర్చనీయాంశమై, తల్లిదండ్రులు తమ పిల్లలకు ప్రైవేట్ పాఠశాలలే శరణ్యమనే స్థితికి తేనుంది. ఇప్పటికే ఉపాధ్యాయుల కొరత, వసతుల లేమి, సకాలంలో పోస్టుల భర్తీ లేని ప్రభుత్వ పాఠశాలల్లో 'నిరంతర మూల్యాంకనం' లేక నాణ్యత లేని చదువు కోసం ప్రభుత్వ పాఠశాలలకు శాశ్వతంగా తల్లిదండ్రులను అడ్డుకట్ట వేయడమే పరీక్ష రద్దు ప్రతిపాదనలోని ఆంతర్యం. పరీక్ష రద్దు ప్రతిపాదనను పైపైన పరిశీలిస్తే విద్యార్థిపై ఒత్తిడి, ఆత్మహత్యలు, తల్లిదండ్రుల శ్రమ, సమాచారం మాత్రమే ఇచ్చే పాఠ్యబోధన, భట్టీయం ప్రోత్సహించే చదువు బాగానే అనిపించినా ఈ అవలక్షణాలన్నీ విద్యారంగంలో ప్రైవేటీకరణ పెరిగిన తర్వాతే వచ్చిన 'కుక్క మూతి పిందెలే' అన్న విషయాన్ని గమనించాలి.

ఉమ్మడి జాబితాలో విద్య ఉన్న విషయాన్ని పట్టించుకోకుండా పదో తరగతి పరీక్ష రద్దు, ఒకే బోర్డు ఏర్పాటు వంటి ప్రతిపాదనలు కపిల్ సిబాల్ చేస్తున్నారు. నిజానికి 10+2+3 పద్ధతి మన రాష్ట్రంలో కొఠారీ కమిషన్ సూచనల మేరకు అమల్లోకి వచ్చింది. అయితే ఆ పద్ధతిలో 10వ తరగతి పరీక్ష పై తరగతులకు వెళ్లడానికి అర్హతా పరీక్షగా ఉంది. ఈ పరీక్షను రద్దు చేయడం వలన ఏర్పడబోయే పరిణామాలను దృష్టిలో ఉంచుకోవాల్సి ఉంది. ఫెడరల్ వ్యవస్థగా ఉన్న మన దేశంలో రాష్ట్రాల అభిప్రాయాలను స్వీకరించకుండా, విస్తృతంగా చర్చ జరపకుండా ఏకపక్షంగా పదోతరగతి పరీక్ష రద్దు ప్రతిపాదన తేవడం అసలు విషయాల నుండి పక్కదారి పట్టించడమే అవుతుంది.

డీమ్డ్ విశ్వవిద్యాలయాల స్థాపనకు ఇచ్చిన అవకాశంతో ఎటువంటి ప్రమాణాలు లేని ప్రైవేట్ విశ్వవిద్యాలయాలు పుట్టగొడుగుల్లా రావడానికి కారణమయ్యాయని విచారాన్ని వ్యక్తం చేసిన యశ్‌పాల్ ప్రైవేట్ విశ్వవిద్యాలయాల స్థాపనకు అవకాశం ఇచ్చింది. అభివృద్ధి చెందిన దేశాల్లోని విశ్వవిద్యాలయాలు వెనుకబడిన దేశాల్లో నాణ్యతలేని విద్యనందిస్తున్నాయన్న ప్రపంచ బ్యాంకు అభిప్రాయాన్ని కూడా పట్టించుకోకుండా యశ్‌పాల్ చేసిన సిఫారసులను కపిల్ సిబాల్ అమలు చేస్తాననడం సరళీకరణ ఆర్థిక విధానాల నేపథ్యమే.

ఇక సర్వాధికారాలు ఉండే 'ఉన్నత విద్యా పరిశోధనా జాతీయ కమిషన్' యు.జి.సి., ఎ.ఐ.సి.టి.ఇ., ఎం.సి.ఐ. వంటి సంస్థల స్థానే కేంద్రీకరించడం ద్వారా ఉన్నత విద్యలో ఫాసిజానికి దారితీస్తుంది. ఒక్క కలం పోటుతో మరింతగా వివిధ దశల విద్యా వ్యాపారీకరణకు అవకాశం కలుగుతోంది. పైగా విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తిని నొక్కిచెప్పిన యశ్‌పాల్ ఉన్నత విద్యారంగంలో అధికార కేంద్రీకరణకు అనుకూలంగా సిఫార్సు చేయడం శోచనీయం.

ఉద్యోగులకు వేతనాలను ఇవ్వడంలో ప్రభుత్వ సంస్థలకు, ప్రైవేట్ కార్పొరేట్ రంగాలకు విపరీతమైన తేడాలున్నాయి. ఉద్యోగ భద్రత, పదవీ విరమణ ప్రయోజనాలు అంతంత మాత్రం ఉన్న ప్రైవేట్ రంగంలో లక్షలాది రూపాయలు వేతనాలుంటే, ప్రభుత్వరంగంలో వేతనాలిచ్చే పరిస్థితిలేదు. పైగా కాంట్రాక్ట్, తాత్కాలిక ఉద్యోగుల సంఖ్య పెరుగుతోంది. రెగ్యులర్‌గా టైంస్కేలుపై ఉండే ఉద్యోగులను తగ్గించాలనే ప్రపంచబ్యాంకు సూచనలతో అవుట్ సోర్సింగ్ ఒక విధానంగా అమలవుతోంది. నాణ్యమైన బోధకుల విషయాన్ని యశ్‌పాల్ కమిటీ నొక్కిచెప్తూ, ఆ బాధ్యతను విశ్వవిద్యాలయాలు స్వీకరించాలని సిఫార్సు చేసింది. దేశంలో పైన పేర్కొన్నట్లు అశాస్త్రీయ వేతన వ్యవస్థ, పని పరిస్థితులు, కార్పొరేట్ సంస్కృతి నెలకొన్న తరుణంలో తక్కువ వేతనాలకు, ఆకర్షణీయం కాని పని పరిస్థితులలో ఐ.ఐ.టి, మెడికల్,

# గొర్రెపాటి నరేంద్రనాథ్

సేంద్రియ వ్యవసాయ ప్రేమికుడు, దళితులకు ఆప్తుడు, భూసంస్కరణ ఉద్యమ నాయకుడు గొర్రెపాటి నరేంద్రనాథ్ (57) జూలై 5న హైదరాబాద్‌లో మెదడు క్యాన్సర్‌కు చికిత్స పొందుతూ మరణించారు. మంచి కోసం పనిచేసే ఏ వేదికలోనయినా ఇమిడి పనిచేసే తత్వం ఆయనది. సూటిగా తన అభిప్రాయాలను పంచుకునేవారు. ఏ సమస్యనైనా ప్రజలతో చర్చ పెట్టడానికి ఇష్టపడేవారు. ఆయనకు వ్యవసాయమన్నా, ప్రజా ఉద్యమాలన్నా ఎనలేని మక్కువ. ప్రత్యామ్నాయ ప్రజా ఉద్యమాలకు ఊతమిచ్చే 'లోకాయన్' అనే సంస్థతో కలిసి పనిచేసేందుకు గాను ఆయన ఢిల్లీలో తన బ్యాంక్ ఆఫీసర్ ఉద్యోగానికి రాజీనామా చేశారు. హైదరాబాద్‌లో మతఘర్షణలు జరుగుతున్న కాలంలో మతతత్వాన్ని, మతతత్వ పార్టీలని తిడితే సరిపోదని తలచి పాతబస్తీలో ప్రజలకు కరువైన పౌరసదుపాయాలు కల్పించడం, వాటికోసం ఆందోళన చేయడం అవసరమని నమ్మి 'హైదరాబాద్ ఏక్తా'లో భాగమయ్యారు. ఆ తరువాత చిత్తూరు జిల్లాలోని పాకాల వద్దగల తన స్వగ్రామం వెంకటరామాపురంకు వెళ్లి సేంద్రియ వ్యవసాయం మొదలుపెట్టారు. గత రెండు దశాబ్దాలుగా ఒక రైతుగా సేంద్రియ వ్యవసాయం చేస్తూనే అంటరానితనంపై, భూసమస్యలపై, నిర్వాసితుల పునరావాసంపై, రైతు సమస్యలపై ఎంతో కృషి చేశారు. పౌరహక్కుల సంఘం, మానవ హక్కుల వేదిక, రాష్ట్రీయ రైతు సేవా సమితి, భూమి కమిషన్, ఎన్ఎపిఎం వంటి సంస్థలతో కలిసి పనిచేశారు. సేంద్రియ వ్యవసాయదారుడిగా మారిన నరేంద్రనాథ్ చేసిన ప్రయోగాలు, సాధించిన ఫలితాలు, అనుభవాలను 'ఇట్లు ఒక రైతు' అనే పుస్తకం రూపంలో తీసుకొచ్చారు. తన నిజజీవితంలో ఆసక్తికరమైన విషయాలను ప్రస్తావిస్తూనే సేంద్రియ వ్యవసాయ ప్రాధాన్యతను, వ్యవసాయరంగపు సాధక బాధకాలను, పల్లె జీవితంలోని ఒడిదుడుకులను ఆయన ఈ పుస్తకంలో కళ్లకు కట్టినట్టు వివరించారు. ఆయన 'వ్యవసాయ విద్యుత్ చిత్రపటం' శీర్షికన లోతయిన పరిశీలనతో, గణాంకాలతో వివరమైన వ్యాసాన్ని 'వీక్షణం' జనవరి 2006 సంచికలో రాశారు. వీ



ఇంజనీరింగ్ లాంటి వృత్తి విద్యా సంస్థలలో బోధకుల కొరత పెరుగుతోంది. కార్పొరేట్ రంగంలో లక్షలాది వేతనాలను పొందుతున్నవారు వేల రూపాయల వేతనాలకు బోధకులుగా ఉద్యోగాలు ఆశించడం లేదు. అత్యున్నత వేతన వ్యవస్థను బోధకులకు రూపొందించినప్పుడే నాణ్యమైన బోధకులను ఆశించగలం. ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు తక్కువ వేతనాలతో బోధకులను దోపిడీ చేసే అనుభవాలు ఇప్పటికే ఉన్న సందర్భంలో నాణ్యమైన బోధకులను ఆశించడం అడియాసే అవుతుంది. ఈ విషయంలో కపిల్ సిబాల్ ఉద్దేశపూర్వకంగా దృష్టి పెట్టలేదు.

పాఠశాల విద్యలో 6,500 మోడల్ ఉన్నత పాఠశాలలను ప్రారంభించడం, అందులో 3,500 పాఠశాలల్లో ప్రైవేట్ భాగస్వామ్యాన్ని అనుమతించడం, 'విద్యాహక్కు బిల్లు' ద్వారా ప్రైవేట్ పాఠశాలల్లో 25 శాతం సీట్లను బడుగువర్గాలకు కేటాయించి, ఆ ఫీజును రీయింబర్స్ చేయడం వంటి విధానాలతో ప్రైవేట్ పెట్టుబడులకు చట్టబద్ధత కల్పించడం నయా ఉదారవాద విధానాల్లో భాగమే. పైగా రాజ్యాంగ ప్రకటిత సమానత్వం, సమాన అవకాశాల ఆశయాలకు భిన్నంగా అనేకరకాల పాఠశాలలతో, యాజమాన్యాలతో, అంతరాలతో కూడిన విద్యను చట్టబద్ధం చేయడం ద్వారా పాఠశాల విద్య కూడా అంగడి సరుకు అయింది.

ఒక యూనివర్సిటీలో భారతదేశ వైవిధ్యం స్పష్టంగా కనబడాలంటూ ఓవైపు యశ్‌పాల్ సూచిస్తూ, మరోవైపు ఆ ప్రపంచంలోని అత్యున్నతమైన 200 విదేశీ విద్యాలయాలను అనుమతించాలనే వైరుధ్య సూచన చేస్తారు. ఈ విదేశీ విశ్వవిద్యాలయాలు భారతదేశ వైవిధ్యాన్ని ప్రతిఫలిస్తాయా? ఒకవేళ ప్రతిఫలించకపోతే అందులో విద్యనభ్యసించిన విద్యార్థులు ఈ సమాజంనుంచి పరాయీకరణ చెందరా? పైగా విదేశీ విద్యాలయాలు మన దేశ సంస్కృతిని ప్రతిబింబిస్తాయా అనేది వెయ్యి డాలర్ల ప్రశ్న? ఆ యూనివర్సిటీలు మన దేశ డిగ్రీలు మాత్రమే ప్రధానం చేయాలనే యశ్‌పాల్ ప్రవచనాలను ఒకసారి దేశంలోనికి అనుమతి లభించిన తర్వాత అవి ఖాతరు చేస్తాయా? ఈ పరిస్థితుల్లో విదేశీ విశ్వవిద్యాలయాలకు అనుమతినివ్వడం సరికాదు.

కపిల్ సిబాల్ ఈ విషయాలను వదిలివేసి విద్యారంగంలో మరిన్ని విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం, విద్యా రంగ ప్రైవేటీకరణకు పెద్ద పీట వేయడం, మరింత ప్రైవేట్ భాగస్వామ్యాన్ని అనుమతించడం, మరింత మార్కెట్ శక్తులకు విద్యారంగాన్ని అప్పగించడమే ఎజెండాగా ఉండగా యశ్‌పాల్ కమిటీ నివేదిక తేనె పూసిన విషగుళికగా ఉండి ఉదాత్తమైన ఉన్నత విద్యా లక్ష్యాలను చెప్తూ విశ్వవిద్యాలయాలు ఎలా ఉండాలంటూ, అందులోని విద్య విద్యార్థులను ఎలా జ్ఞాన పిపాసులుగా రూపొందించాలని చెప్తూ అనేక వివరణలు ఇస్తూ నయా సరళీకరణ విధానాలతో విద్యారంగ ప్రైవేటీకరణకు అనుకూల ప్రతిపాదనలతో నివేదిక ముగుస్తుంది. నిజానికి యశ్‌పాల్ సూచించిన విధంగా సృజనాత్మకత పెంచే విద్యావిధానం, నిజ జీవితంలో ఎదుర్కొనే సమస్యల పరిష్కారకర్తగా విద్య, సమాజహితం కోరే విద్యావ్యవస్థ ప్రైవేట్ యాజమాన్యాల భాగస్వామ్యంతో రూపొందదు. అటువంటి వ్యవస్థ నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ అభిప్రాయపడినట్లు పబ్లిక్‌రంగంలోని విద్యావ్యవస్థ ద్వారానే సాధించగలం.

పాఠశాల విద్యలో 'కామన్ స్కూల్ విధానం' అమలు చేస్తూ మొత్తం విద్యారంగాన్ని ప్రభుత్వం నిర్వహించడం ద్వారానే రాజ్యాంగంలో రాసుకున్న సమాన అవకాశాలతో అందరికీ విద్య సాధించగలం. సిబాల్ ప్రైవేటీకరణ విధానాలతో మరింత పరాధీనత, పరాయీకరణ పెరిగి మొత్తం సమాజమే సంక్షోభంలో కూరుకుపోతుంది.

వీ

*జాతీయోద్యమ స్ఫూర్తిని కొఠారీ కమిషన్ ప్రతిఫలిస్తే, సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు దాసోహమనే వైఖరిని యశ్‌పాల్ కమిషన్ ప్రతిఫలించిందంటున్నారు* **ఎం. శ్రీనివాస్**

# యశ్‌పాల్ సిఫారసులు - మార్కెట్ శక్తులు

వలస పాలన తర్వాత దేశీయ విద్యారంగానికి సంబంధించి వేసిన కమిషన్‌ల విషయంలో కొంత చర్చసాగినప్పటికీ, ప్రధానంగా రెండు సందర్భాలలో జరిగిన, జరుగుతున్న చర్చ దాని విస్తృతి, తీవ్రత అన్ని సామాజిక వర్గాల దృష్టిని తాకింది. ఈ చర్చ 1966 కొఠారీ కమిషన్ నివేదిక ఇచ్చిన సందర్భంలోను, మరో సందర్భం 2009 యశ్‌పాల్ కమిషన్ నివేదిక వచ్చిన సమయంలో జరుగుతోంది. గత నాలుగు దశాబ్దాల కాలంలో ఉత్పన్నమైన ఈ రెండు సందర్భాలు ఆ కమిషన్‌లు రెండు దృక్పథాల వెలుగులో విద్యారంగాన్ని వీక్షించాయి. విద్యా లక్ష్యాల అధ్యయనం, పరిశీలన కూడా ఈ దృక్పథాల నుండే జరిగింది. ఈ రెండు కమిషన్‌ల కాలమాన పరిస్థితుల్లో తేడా ఉంది. ఆ కాలాల్లో ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో చోటుచేసుకుంటున్న పరిణామాల ప్రభావం ఈ కమిషన్‌లపై ఉంది. కాబట్టి 60వ దశకం నాటి సమకాలీన సామాజికోద్యమాల ప్రభావం, జాతీయోద్యమ ఆకాంక్షల స్ఫూర్తి కొఠారీ కమిషన్‌ను ప్రభావితం చేయగా, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల స్ఫూర్తి, నూతన ఆర్థిక విధానాల ప్రభావం యశ్‌పాల్ కమిషన్ పై ఉంది. ఫలితంగానే విద్యాలక్ష్యాల పరిశీలనకు కొన్ని పరిమితులున్నప్పటికీ కొఠారీ కమిషన్ సమాజం, ప్రజల నుండి దృష్టి సారించింది. విద్యార్థి కేంద్రంగా సామాజిక ప్రయోజనాల దృక్కోణం నుండి విద్యాలక్ష్యాలను పరిశీలించింది. అయితే విద్యారంగంలో ప్రధానంగా ఉన్నత విద్యకు సంబంధించి గత రెండు దశాబ్దాలుగా, ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే దశాబ్దన్నర కాలంగా విద్యార్థి కేంద్రంగా, సామాజిక ప్రయోజనాల నుండి కాకుండా మార్కెట్ ఆర్థిక శక్తుల ప్రయోజనాల నుండి చర్చ సాగుతోంది. అందువల్లనే యశ్‌పాల్ కమిటీ మార్కెట్ కేంద్రంగా, మార్కెట్ శక్తుల ప్రయోజనాల నుండి విద్యా లక్ష్యాలను పరిశీలించినట్లుగా అర్థమవుతోంది.

ప్రాథమికంగా మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే నయా ఉదారవాద ప్రభుత్వాలు ముందుకు తెస్తున్న సంస్కరణలు, అవి ఏ రంగానికి సంబంధించినవైనా ఆ ప్రభుత్వాల ఆర్థిక విధానాలకు దోహదం చేసేందుకు, భావజాలరంగంలో ఈ ఆర్థిక విధానాలకు చట్టబద్ధత, ఆమోదం పొందేందుకు ఉద్దేశించినవే. 1990లో నూతన ఆర్థిక విధానాలు అంతర్జాతీయ బహుళజాతి సంస్థల, సామ్రాజ్యవాదుల ఆర్థిక ప్రయోజనాలకు సానుకూలంగా ప్రవేశపెట్టబడినవే. ఆ విధంగా అమలు లోకి వచ్చిన నూతన ఆర్థిక విధానాలకు అనుకూలతను చేకూర్చడం కోసం భావజాలరంగాన్ని ప్రభావితం చేయడానికి విద్యారంగ సంస్కరణలకు పూనుకున్నారు పాలకులు. ఏ మాత్రం సామాజిక స్పృహ, చైతన్యం లేని విద్యార్థులను తయారు చేయడం కాదు, ఉత్పత్తి చేయడం విద్యాలక్ష్యంగా ఉండాలన్నదే పాలకుల ఉద్దేశం. ఇందుకు అనుకూలంగా ప్రభుత్వం వేసే కమిటీలు, అవి ఇచ్చే నివేదికలు ఎలా ఉంటాయో అర్థం చేసుకోవచ్చు. ఈ నేపథ్యంలో వచ్చిందే యశ్‌పాల్ కమిటీ నివేదిక.

ఈ కమిటీ నేపథ్యాన్ని చర్చించడం వ్యాసకర్త ఉద్దేశంకాదు. కానీ ఒకటి రెండు అంశాలను పేర్కొనడం సందర్భోచితంగా ఉంటుంది. 1980లో అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థతో చేసుకున్న ఒప్పందం ఫలితంగా రాజీవ్‌గాంధీ ప్రభుత్వం 'నూతన జాతీయ విద్యా విధానం' పేరిట 1986లో విద్యారంగ సంస్కరణలు చేపట్టింది. ఈ సంస్కరణల వలన విద్యా ప్రైవేటీకరణ, నిర్వహణలో ప్రైవేట్ భాగస్వామ్యానికి అవకాశం ఏర్పడింది. 90వ దశకం తర్వాత నయా ఉదారవాద ఆర్థిక విధానాల వలన అది కాస్త బలపడి కార్పొరేటీకరణకు, వ్యాపారీకరణకు దారితీసింది. ఏకంగా విదేశీ పెట్టుబడులకు, విదేశీ విద్యాసంస్థల ఏర్పాటుకు అవకాశాన్ని ఇచ్చింది. 'ప్రైవేట్ యూనివర్సిటీల బిల్లు' ఈ నేపథ్యంలో వచ్చిందే. '2004 – 05 గాట్స్ ఒప్పందం' కూడా ఇందులో భాగమే. ఈ క్రమంలో సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందనీ, ఆర్ట్స్ కోర్సులను రద్దు చేయడమో, విడిగా బోధించడమో చేయాలనీ ప్రపంచ బ్యాంకు లాంటి సంస్థలు సలహాలు యిచ్చిన విషయం గుర్తుంచుకోవాలి. అందుకే 1980 నుండి ఉన్నత విద్య వివిధ భాగాలుగా అంటే సామాన్య, వైద్య, ఇంజనీరింగ్, న్యాయశాస్త్ర విద్యలుగా విభజించారు. ఒక దశలో ఒక శాస్త్రానికీ ఒక విద్యాలయాన్ని ఏర్పరిచారు. తెలుగు విశ్వవిద్యాలయం, ద్రవిడ, సంస్కృత తదితర విశ్వవిద్యాలయాలు ఈ రకంగా ఏర్పడినవే.

ఉన్నత విద్యావ్యవస్థలో ఉన్న లోపాలను ఎలా ప్రక్షాళన చేయాలో పాలకులు ఆలోచించాలి. పటిష్టమైన ప్రమాణాలతో నిర్మాణాత్మకంగా ఉన్నత విద్యాసంస్థలు కొనసాగలేకపోవడానికి నిర్దిష్ట కారణాలను పరిశీలించాలి. సరియైన విశ్లేషణలతో పరిష్కారాలను చూపాలి. ఈ ప్రక్రియ సామాజిక ప్రయోజనాల, ప్రజా అవసరాల దృక్కోణం నుండి జరిగినప్పుడే సాధ్య పడుతుంది. ఇది పాలకుల చిత్తశుద్ధి, నిజాయితీలపైన ఆధారపడి ఉంటుంది. ఉన్నత విద్యారంగంలో ప్రస్తుతం ఉన్న వాస్తవ పరిస్థితిని చూస్తే మౌలికవసతులు, బోధనా సిబ్బంది, నిధుల కేటాయింపు,

పాఠ్య ప్రణాళికను ఎప్పటికప్పుడు తాజాపరుచుకోవడం వంటి విషయాలు చాలా దారుణంగా ఉన్నాయి. 2012 నాటికి ఉన్నత విద్యలో ప్రవేశించే వారి సంఖ్య 15 శాతానికి పెంచాలన్న పాలకుల లక్ష్యం నెరవేరాలంటే 11వ ప్రణాళిక వేసిన అంచనా ప్రకారం రు. 2,26,410 కోట్లు కేటాయించాలి. కాని ఇందుకోసం రు. 77,933 కోట్లు మాత్రమే కేటాయించారు. మిగతా నిధుల సమీకరణ ఎట్లా చేయాలో పాలకులు చెప్పలేదు.

ఉన్నత విద్య లక్ష్యాలు కేవలం ఉత్పత్తి శక్తులను పెంచే మానవ వనరులను సృష్టించడం మాత్రమేకాదు, సామాజిక సంబంధాలను మానవీకరించే లక్ష్యం కలిగుండాలి. అందువలనే 'పాఠశాల సమగ్ర వ్యక్తిత్వం కలిగిన విద్యార్థులను తయారుచేయాలే కాని నిపుణులను కాదంటాడు' ఐన్‌స్టీన్. కొఠారీ కమిషన్ విద్యాలక్ష్యాలను పేర్కొంటూ విద్య సామాజిక లక్ష్యాలకు అనుగుణంగా ఉండాలనీ, సమాజ జీవితాన్నే కాదు, మనిషి జీవితాన్ని సైతం విమర్శనాత్మకంగా విశ్లేషించి పరిష్కారాలు చెప్పగలిగేదిగా ఉండాలంటుంది. ఇందుకు భిన్నంగా శ్యాం పిట్రోడా నాలెడ్జ్ కమిషన్ సూచించినట్లు 'విద్య ద్వారా ఉత్పత్తి పెంచి, పెంచిన ఉత్పత్తిని వినియోగించే శక్తిని కల్పించాలి'. అంటే డిమాండ్ సప్లయి సూత్రం ప్రాతిపదికన విద్యను విక్రయించడం, వినియోగించడంగా ఉండాలన్నమాట. సరిగ్గా ఇదే విషయాన్ని మరో రూపంలో యశ్‌పాల్ కమిషన్ చెప్పింది.

సమాజ శ్రేయస్సు, సమష్టి జీవన విలువలను పెంపొందించేవి గానూ సాంఘిక, సాంస్కృతికంగా మానవులను శాస్త్రీయంగా ఉన్నతీకరించేదిగా విద్య ఉపకరించాలి. ఇందుకు ప్రాథమిక స్థాయి నుండి ఉన్నత స్థాయివరకు అంటే సామాన్య విద్య, వృత్తి, సాంకేతిక, వైద్య విద్యలను ఈ దృక్పథంతో అంటే సామాజిక శాస్త్రాల, ప్రకృతి శాస్త్రాల పునాదిగా రూపొందించాలి. అందుకు విద్యాపరమైన, పాలనా పరమైన విషయాలతో విద్యాకమిటీలు చేసే సిఫార్సులు ఉండాలి. కాని యశ్‌పాల్ కమిషన్ చేసిన సిఫార్సులలో అధిక భాగం అందుకు భిన్నంగా ఉన్నాయి. అంతర్జాతీయ బహుళజాతి సంస్థల ఆర్థిక ప్రయోజనాలకు అనుకూలంగా ఉన్నత విద్యను పునర్వ్యవస్థీకరించేవిగా ఉండాలి.

ఉన్నత విద్యారంగంపై 1948లో తొలిసారి ఏర్పాటయిన రాధాకృష్ణన్ కమిటీ దేశ అవసరాలను దృష్టిలో పెట్టుకొని ప్రత్యేక విషయాల బోధన, పరిశోధనల కోసం కొన్ని ప్రత్యేక విద్యాసంస్థలను డీమ్డ్ యూనివర్సిటీలుగా రూపొందించాలని సూచించింది. 1956 వరకు ఈ నిర్దిష్ట లక్ష్యంతోనే డీమ్డ్ యూనివర్సిటీలు నడిచాయి. అందుకే (1956 నుండి 1995 వరకు) ఈ కాలంలో కేవలం 29 డీమ్డ్ యూనివర్సిటీలే ఉండేవి. దేశంలో యు.జి.సి ఏర్పడిన మూడున్నర దశాబ్దాల కాలంలో ఒక్క దాన్ని కూడా అనుమతించలేదు. అయితే 90వ దశకంలో నూతన ఆర్థిక విధానాల అమలు నేపథ్యంలో విద్యా రంగంలో వ్యాపార ధోరణులు ప్రబలి డీమ్డ్ యూనివర్సిటీలు సైతం విద్యా వ్యాపార కేంద్రాలుగా మారాయి. దీని పర్యవసానమే తమిళనాడు, మహారాష్ట్రలలో వందకు పైగా యూనివర్సిటీలు ఏర్పడ్డాయి. మరో 214 డీమ్డ్ యూనివర్సిటీల ఏర్పాటుకు ప్రతిపాదనలు వచ్చాయి. గత రెండు దశాబ్దాల కాలంగా డీమ్డ్ యూనివర్సిటీలో విద్యా వ్యాపార ధోరణులు ప్రబలి, విద్యా విక్రయ కేంద్రాలుగానూ, అంగళ్లులుగా మారాయనీ యశ్‌పాల్ కమిటీయే వాఖ్యానించింది. ఈ పరిస్థితికి నిర్దిష్ట కారణాలను యశ్‌పాల్ నివేదిక చెప్పకపోయినప్పటికీ ఈ కాలంలో ఆర్థిక, రాజకీయ రంగాలలో చోటుచేసుకున్న పరిణామాలు, మార్పుల ప్రభావమే ఇందుకు కారణం.

ఉన్నత విద్యారంగంలోని విద్యాసంస్థలు ప్రస్తుతం తమ సంస్థలకు సంబంధించిన పలు విషయాల్లో అనుమతి పొందడానికి వివిధ నియంత్రణ సంస్థల చుట్టూ తిరగవలసివస్తోంది. కొత్తగా ఏర్పాటు చేసే ఉన్నత విద్యాకమిషన్‌కు ఉన్నత విద్యకు సంబంధించి అధికారాలన్నీ ఉంటాయి. కనుక దేశంలోని ఉన్నత విద్యాసంస్థలు ఒకే కమిషన్ వద్దకు వెళ్లి అనుమతి పొందవచ్చు. ప్రస్తుత ఉన్నత విద్యారంగంలో ఉన్న నియంత్రణ సంస్థలు దేశంలోని ఉన్నత విద్యాసంస్థలకు పలురకాల ఇబ్బందులు కలిగిస్తున్నాయి. ఫలితంగా సామర్థ్యం, సృజనాత్మకత దెబ్బతింటోంది. అందువలన అఖిలభారత స్థాయిలో గల యు.జి.సి, ఎ.ఐ.సి.టి.ఇ, ఎన్.సి.టి.ఇలను రద్దుచేయాలని, ఎం.సి.ఐ, బి.సి.ఐ తదితర సంస్థల అధికారాలను కుదించి, వాటికి సంబంధించిన అన్ని అధికారాలను ప్రతిపాదిత 'ఉన్నత విద్యా, పరిశోధన జాతీయ సంఘాని'కే దాఖలుపరచాలని, యశ్‌పాల్ కమిషన్ నివేదిక సూచించింది. పార్లమెంట్ చట్టం ద్వారా మరొక అఖిలభారత సంఘాన్ని ఏర్పర్చడం ద్వారా ప్రయోజనం ఉండకపోగా ఈ సంస్థకే అధికారాలను కట్టబెడితే అధికార కేంద్రీకరణకు దారితీస్తుంది.

ప్రస్తుతం నియంత్రణ సంస్థలన్నింటినీ రద్దుచేసి, వాటిస్థానంలో, జాతీయ స్థాయిలో ఒకే సంస్థను ఏర్పాటు చేయడం వలన ఉన్నత విద్యకు సంబంధించిన అధికారాలన్నీ ఒక సంస్థలో కేంద్రీకృత మవుతాయి. దీని వలన జాప్యం, అధికార అవినీతి ప్రబలే అవకాశం ఉంటుంది. కేంద్రీకృత నియంతృత్వ ధోరణులు ఉత్పన్నమవుతాయి. ఉన్నత విద్యారంగంలో అనేక శాఖలలో ప్రతి శాఖకు ఒక నియంత్రణ, పర్యవేక్షణ సంస్థ ఉండటంవలన అధికార వికేంద్రీకరణ జరిగి, పని విభజన ఉంటుంది. పనివిభజన వలన సామర్థ్యం, ప్రావీణ్యం పెరుగుతాయి. ఏరంగంలోనైనా సామర్థ్యాన్ని పెంచడానికీ అధికార వికేంద్రీకరణ, పనివిభజన అమలు చేస్తున్న స్థితిని గమనిస్తున్నాం. వ్యవస్థ తగిన వెలుసుబాటుతో ముందుకు సాగడానికి ఇది అవసరం. నివేదిక ఇక్కడొక నిజాన్ని ఉద్దేశ పూర్వకంగానే దాచిపెట్టింది. అది ఏమంటే ప్రతి దేశంలో ప్రతి సేవారంగానికి 'గాట్' ఒప్పందం అమలుకు అనుకూలంగా ఒక స్వతంత్ర నియంత్రణ సంస్థను ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ అవసరం నుండే ఇందుకు సంబంధించిన సిఫారసు యశ్‌పాల్ నివేదిక ద్వారా పుట్టుకొచ్చింది.

ప్రస్తుతం ఉన్నత విద్య అనేక విధాలుగా విభజించబడి ఉంది. ఇందులో లాభాలు ఉన్నప్పటికీ మొత్తం ఉన్నత విద్యను సమగ్ర రూపంలో చూడలేక పోతున్నామన్నదే యశ్‌పాల్ కమిటీ అభియోగం. జ్ఞానం విడివిడి భాగాలుగా ఉండటం సమంజసం కాదంటూ సామాజికంగా అనేక రుగ్మతలకూ, నష్టాలకూ దారితీస్తుందని పేర్కొంటూ విశ్వవిద్యాలయాలు సమస్త శాస్త్రాల అధ్యయనానికీ, పరిశోధనలకూ కేంద్రంగా భాసిల్లాలనీ సామజిక, మానవీయ శాస్త్రాలతో అనుసంధానం

చేసి విజ్ఞానశాస్త్రాల బోధన జరగాలనీ, తద్వారానే సామాజిక పరమైన సత్ఫలితాలు ఒనగూడతాయనీ తెలియజేసింది. విశ్వవిద్యాలయాల ప్రాధాన్యతను దిగజార్చే రీతిలో కేవలం లిబరల్ కోర్సులకే విశ్వవిద్యాలయాలను పరిమితం చేశారని కమిటీ ఆవేదన వ్యక్తం చేసింది. ప్రొఫెషనల్ కోర్సులు, ఇతర వృత్తి విద్యాకోర్సులు, లిబరల్ కోర్సుల సమష్టి బోధన కేంద్రంగా విశ్వవిద్యాలయం ఉండాలన్న అభిప్రాయాన్ని నొక్కి చెప్పింది. పాలకవర్గ రాజకీయాలకతీతంగా విశ్వవిద్యాలయాలు స్వయం ప్రతిపత్తితో, స్వతంత్రంగా ఉండాలన్న ఆకాంక్షను వ్యక్తీకరించింది. అందుకు అవసరమైన సూచనలను చేసింది. చేపట్టవలసిన చర్యలను కూడా నిర్దిష్టంగా పేర్కొన్నది. విశ్వవిద్యాలయాలు బాహ్యప్రపంచంతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండాలి. గ్రామీణ, పట్టణ ప్రాంతాల ఆర్థిక, సాంస్కృతిక రంగాల నుండి వచ్చే సవాళ్లు కనుగొనే సామర్థ్యం యూనివర్సిటీలు పెంపొందించాలి. డిగ్రీ కోర్సులను పునర్ వ్యవస్థీకరించాలి. పాఠ్యప్రణాళికకు సంబంధించి అన్ని అంశాలకు ప్రవేశం ఉండేవిధంగా విద్యార్థులకు అవకాశం కల్పించాలి.

అదే విధంగా దేశంలో అన్ని ఐఐటీలు, ఐఎంఎంలు, వాటి ప్రత్యేకతలు కోల్పోకుండా విశ్వవిద్యాలయాలుగా మార్చడం, విశ్వవిద్యాలయాలు తమ స్వతంత్ర ప్రతిపత్తిని పారదర్శకంగా, బాధ్యతాయుతంగా కాపాడుకోవడానికి పాలనావ్యవస్థలో అవసరమైన సంస్కరణలు చేపట్టడం, దేశంలో వివిధ ప్రాంతాలకు ఉన్నత విద్యను అవసరమైన రీతిలో విస్తరింపచేసి అందరికీ సమానంగా నాణ్యమైన విద్య అందేవిధంగా చూడడం వంటి విషయాలను కూడా యశ్‌పాల్ కమిటీ సూచించింది. ఆచరణలో సాధ్యాసాధ్యాలను దృష్టిలో పెట్టుకొని చేసిన అంశాలేనా అన్నదే ప్రశ్న. అయినప్పటికీ ఇవి ఆహ్వానించదగిన అంశాలే. ఈ విధంగా నివేదిక ప్రథమ భాగాలలో యశ్‌పాల్ కమిటీ ఉన్నత విద్యాలక్ష్యాలకు సంబంధించి మంచి సూచనలే చేసింది. ఎన్నో మంచి అంశాలు రూపుదిద్దుకొని, కొన్ని సిఫార్సులున్నప్పటికీ అత్యంత కీలకమైన, పునాది అంశాలకు సంబంధించి నివేదిక మార్కెట్ ఆర్థిక శక్తుల ప్రయోజనాల నుండే ఉన్నత విద్యాలక్ష్యాలను పరిశీలించింది.

యశ్‌పాల్ నివేదిక ఉన్నత విద్యారంగంలోని విశ్వవిద్యాలయాలు విజ్ఞానంతో పాటు, ఉద్యోగ అర్హతను కూడా ఖరారు చేసేవిగా ఉండాలనీ, కోర్సుల రూపకల్పన ఆ దిశగా జరగాలనీ సూచించింది. విద్య విజ్ఞానం కోసమా? ఉద్యోగం కోసమా? విద్యను ఉద్యోగ ఉపాధి అవకాశాలకు కుదించడం భావజాలపరంగా విద్యార్థులను, మార్కెట్‌శక్తులను సానుకూలంగా మేధోమథనం చేయడమే. అంటే మార్కెట్‌శక్తుల ప్రయోజనాలకు కట్టివేయడమే. ఉన్నత విద్యావ్యవస్థ, ప్రభుత్వ వ్యవస్థలు వేరువేరుగా నిర్వహించాల్సిన విధులను ఉన్నతవిద్యలోని విశ్వవిద్యాయాలు ఈ పాత్రను పోషించాలని సూచించడం అర్థరహితం. సమాజ నిర్వహణ, అభివృద్ధికి అవసరమైన సామాజిక స్పృహ, జవాబుదారీతనం గల నిపుణులను, మేధావులను ఉత్పత్తి చేయడం విశ్వవిద్యాలయాల బాధ్యత, విధి. ఆ విధంగా సమాజంలోకి వచ్చిన వారికి తగిన ఉపాధి, ఉద్యోగ అవకాశాలు కల్పించి, వారి సేవలను వినియోగించుకోవడం ప్రభుత్వ బాధ్యత, విధికూడా. ఈ విషయాన్ని మరుగుపరచడం ద్వారా ప్రభుత్వ బాధ్యతను అప్రధానం చేయడమే నివేదిక ఉద్దేశంగా ఉన్నట్లు కనపడుతోంది. ఇందులో ఉన్న రెండు అంశాలలో ఒకటి అశాస్త్రీయమైన ధోరణి కాగా మరొకటి విద్య ఉత్పత్తిని పెంచి, ఆ ఉత్పత్తిని వినియోగించుకోగల సామర్థ్యంగల నిపుణులను తయారుచేసేవిగా ఉండాలన్న 'శ్యామ్ పిట్రోడా' నివేదికను సమర్థించేదిగా ఉంది. యశ్‌పాల్ నివేదిక సామాజిక ప్రయోజనాలకు, మార్కెట్ శక్తుల ప్రయోజనాలకు మధ్య గల మౌలిక వైరుధ్యాన్ని ఎత్తిచూపలేకపోయింది. మార్కెట్ శక్తుల భావజాల ప్రభావానికి నివేదిక గురియైనందునే ఈ పనిచేయ లేకపోయింది. అంతేకాదు విద్య ప్రైవేటీకరణ, వ్యాపారీకరణ పట్ల అసహనాన్ని ప్రదర్శించటం, డీమ్డ్ యూనివర్సిటీల వ్యాపార దృక్పథాన్ని ఎత్తిచూపడానికి ప్రయత్నిస్తూనే మరోవైపున ప్రైవేట్ యూనివర్సిటీలకు, విద్యలో ప్రైవేట్ శక్తుల భాగస్వామ్యానికి అవకాశాల్ని కల్పించడం, మన విద్యారంగంలో విదేశీ పెట్టుబడులు వంటి విషయాలను సమర్థించడం నివేదిక దృక్పథం ఏ వర్గాల ప్రయోజనాలకు ఉద్దేశించబడిందో తేటతెల్లమవుతోంది. ప్రపంచ బ్యాంక్, బహుళజాతి సంస్థల ఆదేశిత విధానాలకనుగుణంగా మార్కెట్ శక్తుల ప్రయోజనాలను సాకారం చేయడానికే ఈ నివేదిక దోహదపడుతుంది.

నివేదికలో పాఠ్య ప్రణాళిక ఎలా ఉండాలి? అది అందించే జ్ఞానం ఎవరి ప్రయోజనాలకు ఉపకరించాలి? వివిధ ప్రాంతాల విశ్వవిద్యాలయాలలో, ఆయా ప్రాంతాల సహజవనరులను, ఆ ప్రాంత ప్రజల అభివృద్ధికి అనుగుణంగా వినియోగించే జ్ఞానం, నైపుణ్యం, సామర్థ్యం విద్యార్థులకు అందించాలికదా? అయితే వివిధ రాష్ట్రాల విశ్వవిద్యాలయాలు రూపొందించే పాఠ్య ప్రణాళికను ఒకే లక్ష్య సాధనకు ఉపయోగించవచ్చా? అన్న ప్రశ్నలకు నివేదికలో జవాబులు లేవు. జాతీయ స్థాయిలో ఏర్పడే సంఘానికి అవసరమైన నిధులు ఆర్థిక శాఖ మంజూరు చేయాలని నివేదిక సూచించింది. ఆర్థిక శాఖ నిధులను మంజూరు చేస్తే ఆ సంఘం స్వతంత్ర ప్రతిపత్తితో ఎలా ఉండగలుగుతుంది? ఉన్నత విద్యారంగాన్ని పట్టిపీడిస్తున్న సమస్యలకు మూలకారణాలను, పరిష్కారాలను గత కమిషన్‌లు ప్రధానంగా – కొఠారీ కమిషన్ సూచించినట్లుగా కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో నిధుల కేటాయింపు విషయంలో కనీసంగానైనా ప్రస్తావించకపోవడం శోచనీయం.

యశ్‌పాల్ నివేదిక మార్కెట్ శక్తుల ప్రయోజనాల్ని ప్రతిఫలించేది కనుకనే నివేదిక అంశాలు పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి. విశ్వవిద్యాలయాలు మార్కెట్ శక్తులకు వెసులుబాటు కల్పించకూడదన్న విషయంలో నిశ్చితాభిప్రాయం వెల్లడించలేకపోయింది. అందువల్లనే సామాజిక ప్రయోజనాలకు, మార్కెట్ శక్తుల ప్రయోజనాలకు మధ్యగల వైరుధ్యాన్ని ఎత్తిచూపడంలో వెనుకడుగువేసింది. ఉన్నత విద్యారంగంలో మార్కెట్ శక్తులకు అవసరమైన బౌద్ధికవాతారణం ఈ కమిటీ కల్పించింది. రాజకీయ సైద్ధాంతిక కోణంలో ఈ సిఫారసులను విశ్లేషిస్తే ఈ నివేదికలోని అనేక కీలకాంశాలు మార్కెట్ శక్తుల ఆర్థిక, రాజకీయ దృక్పథాన్ని ప్రతిఫలించేవిగా ఉన్నాయి. కనుక యశ్‌పాల్ కమిషన్ సిఫారసులలో అత్యధిక అంశాలు విద్యాభివృద్ధికి, విస్తరణకు ఉపయోగ పడకపోగా మార్కెట్ శక్తుల ప్రయోజనాలను స్థిరీకరించేవిగా ఉన్నాయి.

వీ

*లాల్‌ఘడ్ పోరాటాన్ని మరో నక్సల్బరీగా పేర్కొంటూ విప్లవనాయకత్వంలో ఇటీవలి ఆదివాసుల సాహసోపేత పోరాటాన్ని వివరిస్తున్నారు* **శామ్ షెల్**

# లాల్‌ఘడ్ - ఆశావహమైన నిప్పురవ్వ

*'తిరుగుబాటు అనామకుల పాటకు పల్లవికావాలి...'*
– జాక్‌డెలార్‌బా

పశ్చిమబెంగాల్‌లోని పశ్చిమ మేదినీపూర్ జిల్లాలో ప్రస్తుతం ఒక అనూహ్యమైన సంఘటన జరుగుతోంది. ఈ విస్ఫోటనానికి ముందు, ప్రశాంతంగా ఉండే ఆ ప్రాంతం, స్థానికులకు తప్ప ఇతరులెవ్వరికీ అంతగా తెలియదు. ఇప్పుడు, ఇంతకాలం దోపిడి పీడనలకు గురవుతున్న ఆ ప్రాంత ఆదివాసీ ప్రజల నుండి పశ్చిమబెంగాల్‌లో కనివిని ఎరుగని స్థాయిలో ఒక ప్రజాఉద్యమం ప్రారంభమైంది. ఆ ప్రాంతం అంతా వేడి పుట్టింది. విశాలమైన భారతదేశానికి ఒక గొప్ప షాక్‌ను ఇచ్చింది. అదే 'లాల్‌ఘడ్ తిరుగుబాటు' గా అందరికీ పరిచయమయింది.

ఈ తిరుగుబాటు 2008 నవంబర్ తొలిదినాల్లో ఆవిర్భవించిందని ఎవ్వరైనా కచ్చితంగా చెప్పగలరు. ఈ ఘటనల క్రమాన్ని, ఎదుగుదల సందర్భాన్ని సక్రమంగా అర్థం చేసుకోవాలంటే కొంత వెనక్కువెళ్ళి పరిశీలించాల్సిన అవసరముంది. లాల్‌ఘడ్ పశ్చిమబెంగాల్‌లో నమ్మశక్యం కానంత దారిద్ర్యంలో ఉన్న ప్రాంతం. ఆ ప్రాంతంలో పోలీసుల సౌకర్యం కోసం ఏర్పాటైన ఒకే ఒక మంచిరోడ్డు ఉంది. కనీసం మోటారు సైకిల్ కూడా రాని ఆ ప్రాంతవాసులకు మాత్రం ఆ రోడ్డు నిరుపయోగం. మంచి నీటి సౌకర్యంగాని, విద్యుత్ సౌకర్యంగాని వాళ్లకి లేదు. పోలీసుల పాశవిక హింస ఆ ప్రాంతవాసులకు రోజువారీ అనుభవమైపోయింది. అకారణంగా వాళ్లను అరెస్ట్ చేయడం, హింసించడం, కొంతమందిని పదే పదే భయానక చిత్రహింసలకు గురిచేయడం జరుగుతోంది. ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేస్తామని పాలకులు చాలా సంవత్సరాల నుండి వాగ్దానాలు చేస్తున్నారు కాని అవి అమలైన ఉదాహరణలు మాత్రం మచ్చుకు కూడా కనపడవు.

ఆ ప్రాంతంలో ప్రత్యేక ఆర్థిక మండలాలను (సెజ్) ఏర్పాటు చేయడానికి జిందాల్ కంపెనీకి 2007లో అనుమతి లభించింది. అక్కడ ఉక్కు కర్మాగారాన్ని స్థాపించడం కోసం ఆ కంపెనీకి 4,300 నుండి 5000 ఎకరాల స్థలాన్ని కేటాయించారు. ఇందులో అత్యధిక భాగం ఆదివాసీ ప్రాంతం. భూసంస్కరణల ద్వారా ఆ భూముల్ని స్థానిక ఆదివాసులకు కేటాయించాలని, అన్యాక్రాంతం చేయకూడదని చెప్పే చట్టం కూడా ఒకటి ఉంది. అక్కడ 'అభివృద్ధి' ప్రారంభం కావడంతో ఆదివాసులు నిర్వాసితులయ్యారు. పర్యావరణ విధ్వంసం ఫలితంగా వాళ్ల జీవనోపాధి మార్గాలకు ప్రమాదం ఏర్పడింది. కొన్ని సంవత్సరాలుగా రాజ్య వ్యవస్థ ఆ ప్రజల పట్ల తన భాధ్యతల్ని వదిలిపెట్టేసింది. ఫలితంగా, వాళ్లు ప్రభుత్వ యంత్రాంగంలోని బ్యూరాక్రాట్ల పాదాల కింద నలిగిపోయారు. అతి నిరుపేదలుగా మారిపోయారు. వాళ్లపైన అవకాశం ఉన్న అన్నీ పద్ధతుల్లోనూ పీడన, దోపిడీ అమలయ్యింది. దీనికి పరాకాష్టగా వాళ్లని వాళ్లకు తెలిసిన ఆ ఒకేఒక్క ప్రాంతం నుండి బలవంతంగా తరిమి వేయాలని అనుకున్నారు. జిందాల్ ఉక్కు కంపెనీకి భూయాజమాన్య హక్కు కల్పించారన్న వార్త వ్యాపించగానే, ఆ ప్రాంతం అంతా కోపంతో అట్టుడికిపోయింది.

2 నవంబర్ 2008న పశ్చిమ మేదినీపూర్ జిల్లాలోని సాల్బోనీ అనే ప్రాంతం వద్ద ఒక లాండ్‌మైన్ పేలింది. ఆ సెజ్‌లో జిందాల్ స్టీల్ కంపెనీ పనుల ప్రారంభోత్సవ సభలో పాల్గొని తిరిగి వస్తున్న వ్యాపారస్తులు, ప్రభుత్వాధినేతలు – పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రితో సహా ప్రయాణిస్తున్న వాహనాలను లక్ష్యంగా చేసుకొని మావోయిస్ట్ గెరిల్లాలు దాన్ని పేల్చారు. ఆ ఫ్యాక్టరీ నిర్మాణం పట్ల తమ వ్యతిరేకతను బయటి ప్రపంచానికి తెలియజేయడానికి వాళ్లు దీన్ని పేల్చారు. దీన్ని సాకుగా తీసుకుని ఆ ప్రాంతంలోని గ్రామాలన్నిటిపైనా పెద్ద ఎత్తున పోలీసు బీభత్సం ప్రారంభమయ్యింది. అనుమానితుల పేరిట, మావోయిస్ట్ సానుభూతిపరుల పేరిట (ఆ ప్రాంతం అంతటా మావోయిస్ట్ పార్టీకి విస్తృతమైన ప్రజా మద్దతు ఉంది) స్థానిక ప్రజల్ని లక్ష్యం చేసుకొని అణచివేత అమలయ్యింది. ఆడ, మగ, పిల్లలు అనే తేడాలేకుండా, అందరిపైనా నిర్విచక్షణగా భౌతికదాడులు, చిత్రహింసలు, మానభంగాలతో హింస ప్రారంభమయ్యింది. ఒక మహిళను తుపాకీ మడిమతో మొహంమీద కొడితే ఆమె శాశ్వతంగా కంటిచూపు కోల్పోయింది. పదకొండు మంది మహిళలపై అత్యాచారం జరిగింది. మావోయిస్టులనే అనుమానంతో ముగ్గురు విద్యార్థుల్ని అరెస్ట్‌చేసి నిర్బంధించారు. (వాళ్ల అరెస్ట్ కిడ్నాప్‌లాగా జరిగింది) నిజానికి అక్కడి ప్రజలపై అమలయిన అమానుష హింసాకాండ ఇంతకంటే ఘోరంగా పలు ఘటనల రూపంలో జరిగింది.

ఈ హింసాకాండ ప్రారంభమైన కొన్ని రోజుల తర్వాత వేలాది ప్రజల సమీకరణ ప్రారంభమైంది. విల్లంబులు బాణాలువంటి సాంప్రదాయ ఆయుధాలు ధరించి, దశాబ్దాల నుండి ఎదుర్కొంటున్న పీడన నుండి విముక్తి పొందాలనే కృతనిశ్చయంతో ప్రజలు పోలీసు బలగాలు ఆ ప్రాంతంలోకి రాకుండా నిరోధించడం కోసం గోతులు తవ్వారు. చెట్లు నరికి రోడ్లకు అడ్డంగా పడేశారు. పోలీసు హింసపట్ల ప్రతీకారంతో ప్రజలు పోలీసు స్టేషన్‌లపై దాడిచేసి వాళ్ల వాహనాలు

తగలబెట్టారు. కార్యాలయాల కరెంట్ సరఫరా నిలిపివేశారు. ఇంతమంది ఆదివాసీ ప్రజలపట్ల ప్రయోగించిన హింసకు పోలీసులు సమాధానం చెప్పాలని డిమాండ్ చేశారు.

దాదాపు నెలపైగా విరామంలేకుండా కొనసాగిన ఈ భారీ ప్రజా సమీకరణ అందరి దృష్టినీ ఆకట్టుకుంది. పోలీసు అధికారులపై సాంఘిక బహిష్కరణ అమలయ్యింది. ఆ ప్రాంతంలో నివసించడానికి వీలుకాని పరిస్థితి వాళ్లకు ఎదురయ్యింది. వాళ్లకు నిత్య జీవితావసర సరుకులు కూడా దొరకని పరిస్థితి ఏర్పడింది. బలమైన మావోయిస్ట్‌ల ఉనికితోపాటు ప్రజలు అమలు చేసిన సాంఘిక అంచనాల్లో బహిష్కరణ ఫలితంగా లాల్‌ఘడ్ ప్రాంతం అంతా ప్రభుత్వ బలగాలు ప్రవేశించ వీలుకాని దుర్భేధ్యంగా మారిపోయింది. ఈ సంఘటనల పరంపర పశ్చిమ మేదినీపూర్ జిల్లాలోని వందలాది గ్రామాల్లో కార్చిచ్చులాగా వ్యాపించింది. కేవలం పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోనేకాక దేశవ్యాప్తంగా ఆ ఉద్యమానికి బలమైన మద్దతు లభించింది. అది ఒక నిర్దిష్టమైన రాజకీయ స్వభావాన్ని సంతరించుకుంది.

దలీల్‌పూర్ చౌక్ అనే ప్రాంతంలో 8 నవంబర్ 2008న పోలీసు అత్యాచారాల వ్యతిరేక ప్రచార కమిటీ (పిసిపిఎ) ఏర్పడింది. 95 గ్రామాల ప్రజలచేత ఎన్నికైన ప్రతినిధులతో దీని నిర్మాణం జరిగింది. ఫలితంగా సంస్థ పునాది బాగా విస్తరించింది. ఈ సంస్థ నిర్మాణంతో, అంతక్రితం ఆదివాసీ పెద్దలు, ప్రధాన స్రవంతి రాజకీయ పక్షాల ఆధ్వర్యంలో ఏర్పడిన సంస్థలకు కాలదోషం పట్టింది. ఆ ప్రాంత ప్రజలకు ఊరటనివ్వడంలో ఈ సంస్థలన్నీ పూర్తిగా విఫలమయ్యాయి. పిసిపిఎ పీడిత ప్రజానీకానికి ఒక నిర్మాణాన్నీ, ఒక ప్రజాస్వామిక గొంతునూ ఇచ్చింది. ఈ సంస్థ ప్రధాన నిర్ణయాలన్నీ వేలాది ప్రజల సమక్షంలో బహిరంగసభలో తీసుకున్నది. ఆ బహిరంగసభలకు వందలాది గ్రామాల నుండి పదివేలకు పైగా ప్రజలు హాజరయ్యి ఆదివాసుల బాధల్ని స్పష్టంగా తెలియజేస్తూ, ఈ సంఘం 13 అంశాలతో కూడిన డిమాండ్ల పత్రాన్ని ప్రకటించింది. పోలీసుల ప్రభుత్వ అధికారుల బహిష్కరణను కొనసాగించింది.

పిసిపిఎ అనేక పర్యాయాలు ప్రదర్శనలకు, రాస్తారోకోలకు, సమ్మెలకు పిలుపునిచ్చింది. పోలీసు క్యాంపులపైన ప్రధాన స్రవంతి రాజకీయపక్షాల కార్యాలయాలపైన ఒక రకంగా శాంతియుత దాడులను తొలిదశలలో ఆదివాసీ ప్రజలే నిర్వహించారు. వారి డిమాండ్లకు అనుగుణంగా అనేక సందర్భాల్లో పోలీసులు తమ బలగాలను ఉపసంహరించుకోక తప్పని పరిస్థితి ఏర్పడింది. తమ 13 అంశాల డిమాండ్లలో చాలావాటికి ఆమోదాన్ని పొందడం, తమ అభివృద్ధికి అవసరమైన ద్రవ్య సంబంధ హామీలను పొందడం వాళ్లు సాధించిన ప్రధాన విజయాలు. అందులో ఈ ద్రవ్య సంబంధ హామీలన్నీ బూటకమనీ, అవి ఆదివాసులకు ఏ విధంగాను ఉపయోగపడవని చివరకు తేలింది. కాని వాళ్ల అతి ప్రధానమైన డిమాండ్ – పోలీసులు ప్రతి గ్రామానికి వెళ్లి క్షమాపణలు కోరాలనేది – మాత్రం నెరవేరలేదు.

వారి తిరుగుబాటు ప్రారంభమైన తరువాతి నెలలంతా నిరంతర దాడులు, పోలీసులకు, ప్రభుత్వాధికారులకు, ఆయా పార్టీల కార్యకర్తలకు, పశ్చిమబెంగాల్ ప్రజల మధ్య చర్చలతో గడిచిపోయింది. కొన్ని సందర్భాలలో గ్రామీణ ప్రాంతాలను విముక్తి చేయడం, ప్రభుత్వ సాయుధ మూకలు వాటిని తిరిగి స్వాధీనం చేసుకోవడం కొనసాగింది. ఏప్రిల్ 2009లో జరిగిన లోక్‌సభ ఎన్నికలకు కొద్దివారాల ముందు ఒక ఆసక్తిదాయకమైన సంఘటన జరిగింది. ఎన్నికల సమయంలో పోలీసులెవ్వరూ గ్రామాల్లోకి ప్రవేశించకూడదనే ప్రజల డిమాండ్‌ను పిసిపిఎ ముందుకు తెచ్చింది. పోలింగ్ జరగడానికి ఆ ప్రాంత ప్రజలు అనుమతించారుగాని, పోలీసులెవ్వరైనా ఉంటేమాత్రం ఎన్నికలను జరగనివ్వమని వాళ్లు చెప్పారు. చాలాకాలంపాటు ప్రతిష్టంభన కొనసాగిన తరువాత పోలీసులు ఉన్నా, గ్రామానికి దూరంగా బయట ఎన్నికలను నిర్వహించుకోవడానికి చివరికి ప్రజలు అంగీకరించారు. ఓటు వేయడం పట్ల ఆసక్తి ఉన్న ప్రజల్ని ఎన్నికల సంఘం అద్దెకు తీసుకున్న బస్సులలో ఆ నిర్దేశిత పోలింగ్ కేంద్రాలకు తీసుకువెళ్లింది.

పశ్చిమబెంగాల్ వామపక్ష కూటమి ప్రభుత్వానికి ప్రధాన భాగస్వామి అయిన మార్క్సిస్ట్ పార్టీ పోషించిన అణచివేత పాత్ర ఈ తిరుగుబాటుకు ఒక ప్రధాన అంశం. ఈ కమ్యూనిస్ట్ పార్టీకి దశాబ్దాల పైబడి పశ్చిమబెంగాల్ పెట్టుబడిదారులతో అత్యంత సన్నిహితమైన సంబంధాలున్నాయి. ఆ పార్టీ పశ్చిమబెంగాల్‌లోని అసంఖ్యాక ఆదివాసీ ప్రజలను పాశవికంగా దోచుకుంది. లాల్‌ఘడ్ ప్రాంతంలో ప్రజల కోసం కేటాయించిన అభివృద్ధి నిధులను స్వంతం చేసుకోవడం మార్క్సిస్ట్ పార్టీ నాయకులకు దినచర్యగా మారిపోయింది. వాళ్ల పోలీసు యంత్రాంగం ఆదివాసులను మావోయిస్ట్‌లతో కలిసి పనిచేస్తున్నారన్న అనుమానంతో అరెస్ట్ చేసి చిత్రహింసలు పెట్టేవాళ్లు.

14 జూన్ 2009న పిసిపిఎ, మావోయిస్ట్‌లు కలిసి ఒక పెద్ద ప్రజాసమీకరణ కార్యక్రమంలో 48 గ్రామాలను విముక్తి చేసి, ధరంపూర్‌లోని మార్క్సిస్ట్ పార్టీ కార్యాలయాన్ని తీవ్రవ్యతిరేకత, తుపాకీ కాల్పులను ఎదుర్కొన్న తురువాత స్వాధీనంచేసుకున్నారు. వాళ్లు ఈ గ్రామాన్ని విజయవంతంగా విముక్తి చేయగలిగారు.

16 జూన్ 2009న లాల్‌ఘడ్‌లో మరొక గణనీయమైన తిరుగుబాటు జరిగింది. దాన్లో భాగంగా అనేక మంది ఆదివాసులు పోలీసు క్యాంపులను తగలబెట్టి రక్షకదళాలను, మార్క్సిస్ట్ పార్టీ కార్యకర్తలను, నాయకత్వాన్ని లాల్‌ఘడ్ నుండి బయటకు తరిమివేసి ఆ ప్రాంతాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ఆ ప్రాంతంలో ప్రజలందరి అసహ్యానికి గురైన ప్రభుత్వ అధికారి, మార్క్సిస్ట్ పార్టీ నాయకుడు అయిన అనూజ్ పాండే విశాలమైన భవంతిని ధ్వంసం చేయడం, ప్రత్యేకించి చెప్పుకోదగిన ఘటన. ఆ భవంతిని ధ్వంసం చేయడం ప్రజల క్రోధాగ్నికి ప్రతీక. అనేక సంవత్సరాలుగా ఆదివాసీ ప్రజలపైన అమలైన అణచివేతకు అది సాక్ష్యం. దాన్ని కూల్చివేయడం అంటే జనజీవితంలోకి సూర్య కాంతి ప్రసరించడానికి అవరోధాన్ని తొలగించడమే. పూదోటలో బలిసిన కలుపు మొక్కని పీకివేయడమే. దురదృష్టవశాత్తు, ఈ తిరుగుబాటు ప్రారంభమైనప్పటి నుండి భద్రతా దళాలు ఆ ప్రాంతంలోకి ప్రవేశించి గతంలోవలె తిరిగి హంతక అణచివేత కార్యక్రమాన్ని కొనసాగించాయి. కొత్తగా స్వేచ్ఛను పొందిన ఈ ప్రజలు, తమదైన శైలిలో పోరాట ఆకాంక్షను కాపాడుకుంటారని మనం ఆశిద్దాం.

కనీసం, గత కొద్ది వారాలుగా అమెరికా ఈ తిరుగుబాటును అణచివేయడానికి అవసరమైన సాంకేతిక సహాయాన్ని భారత ప్రభుత్వానికి అందిస్తున్నది. బారోపెర్లియా, కాంతాపహారీ, రాంఘర్, మహులాల్, పింగ్‌బోనీ, గోల్తోర్, ధరమపూర్, ఝిట్కా ప్రాంతాలను పర్యవేక్షించడానికి దాడుల పథకాలను రూపొందించడానికి భారత ప్రభుత్వం అమెరికా నిపుణులకు అనుమతినిచ్చింది. జూన్‌లో మావోయిస్ట్

పార్టీని దేశవ్యాప్తంగా 'అధికారికంగా' నిషేధించారు. వెంటనే ఒక విలేఖరుల సమావేశంలో మాట్లాడుతున్న మావోయిస్ట్ పార్టీ ప్రతినిధి గౌర్ చక్రవర్తిని కలకత్తాలో అరెస్ట్ చేశారు. తటస్థ పరిశీలకులుగా వెళ్లిన బయటి వారిని కూడా అరెస్ట్ చేసేదాకా ప్రభుత్వం వెళ్లింది. కలకత్తా నుండి వెళ్లిన మేధావుల బృందాల్ని – దాన్లో ఐఎల్‌పిఎస్ 2009 ప్రధాన కార్యదర్శి, సినీ నిర్మాత అపర్ణాసేన్ కూడా ఉన్నారు – పది మంది సామాజిక కార్యకర్తల బృందాన్ని పోలీసులు దాడిచేసి, అరెస్ట్ చేశారు.

భారతప్రభుత్వం తన సైనికదళాలను భారీగా మోహరించినప్పటికీ, విదేశీ సామ్రాజ్యవాద దేశాలు మద్దతునిచ్చినప్పటికీ పశ్చిమబెంగాల్ ప్రజలు, మావోయిస్ట్‌లు గెరిల్లా తరహా పోరాటాలు చేసి తమ స్థానాన్ని తాము కాపాడుకోవడమేకాక, కొత్తగా స్వాధీనం చేసుకున్న ప్రాంతాల నుండి పోలీసు బలగాలను తరిమి కొట్టాయి. ఆదివాసీ ప్రజలు పోలీసుల, సైనికుల రవాణాకు తీవ్రమైన ఆటంకాలు కల్పించగా, పిసిపిఎ, మావోయిస్ట్‌లు సైనిక తరహా పోరాటాలనెన్నింటినో చేశాయి.

పింగ్‌బోనీ, బీర్బన్‌పూర్ ప్రాంతాలను స్వాధీనం చేసుకోవడానికి పారామిలిటరీ బలగాలను, పశ్చిమబెంగాల్ రాష్ట్ర పోలీసుబలగాలను, 4 జులై 2009 నుండి వినియోగించారు. ఆ బలగాలు మావోయిస్టుల పైనా, ఆదివాసులపైనా దాడులు చేయడంలో భాగంగా కడాషోల్, సాల్బోనీ, గోడా మౌలీ, ఝిట్కా, కాంతాపారీ, రోన్‌జా వంటి లాల్‌ఘడ్ అటవీ ప్రాంతాలను జల్లెడపడుతున్నాయి. మావోయిస్టులకు మద్దతుని స్తున్నారన్న నెపంతో కొంతమంది పిసిపిఎ నాయకులపై ప్రత్యేకంగా దృష్టి సారించాయి. కోబ్రాతో సహా పదహారు పారామిలిటరీ బృందాలు ఈ ప్రాంతంలో పని చేస్తున్నాయి. కొన్ని పత్రికా వార్తల ప్రకారం సైనిక బృందాలు ఈ ప్రాంతంలో కనీసం జూలై నెలాఖరు వరకు ఉండవచ్చు. లాల్‌ఘడ్‌ను ప్రభుత్వ బలగాలు తిరిగి స్వాధీనం చేసుకున్నాయని ప్రధాన వార్తాపత్రికలు జూలై 8న ప్రకటించాయి. అయితే అక్కడ ఉన్న మావోయిస్టు శక్తులు ఏ మాత్రం చెక్కు చెదరకుండా బేల్ పహారీగుండా పురూరియార్‌ని ఆయోధ్య కొండ ప్రాంతంలోని అడవుల్లోకి తప్పించుకు పోయాయి. ఇప్పటికి అనేక గ్రామాలు విముక్తమై ఉన్నాయి.

## లాల్‌ఘడ్ తిరుగుబాటులో గుర్తించదగిన లక్షణాలు

ప్రారంభం నుండి లాల్‌ఘడ్‌లో తిరుగుబాటు అభ్యుదయ శక్తి గానే ఉంది. పుట్టుక నుండి ఈ ఉద్యమానికి సజీవ లక్షణం ఉందన్నది నిర్వివాదం. అవినీతికర వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడడానికి అది వేలాది మంది ప్రజల్ని కదిలించింది. ఉన్నతమైన ఆదివాసీ రైతుల పోరాటాల నుండి జన్మించిన ఈ ఉద్యమం, విద్యార్థులు, మానవ హక్కుల సంఘాలు చిన్న చిన్న దుకాణాల యజమానులు, ఆదివాసీ వలస కార్మికులు వంటి వైవిధ్య శక్తుల మద్దతును, సంఘీభావాన్ని సంపాదించడం ద్వారా గ్రామాలు, ఆదివాసుల ప్రాంతాల మధ్య ఉండే విభజన రేఖను అధిగమించింది.

పుట్టుక యాదృచ్ఛికమే అయినప్పటికీ ఈ ఉద్యమం అతి కొద్ది కాలంలోనే నిర్మాణ రూపాన్ని సంతరించుకుని ప్రజాస్వామిక పంథాలో నాయకత్వాన్ని అభివృద్ధి చేసుకోగలిగింది. ఈ పోరాట క్రమంలో ఆవిర్భవించిన తొలి ప్రజాసంఘం పిసిపిఎ దాని ఆవిర్భావం తర్వాత అనేక గ్రామాలలో కమిటీలు వెనువెంటనే ఏర్పడాయి. వాటిల్లో ఎక్కువ భాగానికి మహిళలే నాయకురాళ్లు. వందలాది గ్రామాల నుండి హాజరైన వేలాది మంది (పదివేలమంది దాకా కూడా) ఆదివాసుల సమక్షంలోనే సంఘ ప్రధాన నిర్ణయాలన్నీ చేశారు.

ఒక ప్రజా బాహుళ్య ప్రజాస్వామిక సంస్థగా పిసిపిఎ ఏర్పడడంతో పాటు, బీజ రూపంలో సమాంతర ప్రభుత్వ వ్యవస్థలు కూడా తలెత్తాయి. అవే గ్రామ కమిటీలు. భారత పాలక వర్గాల కీలు బొమ్మలుగా వ్యవహరించి పంచాయితీ వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా జనవరి 2009 లో ఈ గ్రామ కమిటీలు ఏర్పడాయి. ప్రతి కమిటీలోనూ 5గురు మహిళలు, 5గురు పురుషులు మొత్తం 10మంది ఎన్నికైన సభ్యులుండే వారు. విస్తృతమైన ఏరియా కమిటీ (10 గ్రామాలు) సమావేశంలో పాల్గొనడానికి ఇద్దరు ప్రతినిధులుండేవారు. ఈ కమిటీలకు పై స్థాయిలో కేంద్ర కమిటీ సమావేశంలో పాల్గొనడానికి 35 మంది ప్రతినిధులుండే వారు. ఈ స్థాయిలో స్త్రీ పురుషుల నిష్పత్తి సమానంగా ఉండాల్సిన అవసరంలేదు. (మహిళలకు కనీసం 12 స్థానాలు ఉంటాయి. ఈ కేంద్ర కమిటీ ఆ పాలనా బాధ్యతలను నిర్వహించేది. ఈ కమిటీలు తీసుకున్న ప్రతి నిర్ణయాన్ని ప్రజా అసెంబ్లీ ఆమోదించాలి. ఇలాంటి కమిటీలు 150 దాకా ఏర్పడ్డాయి (ఈ సంఖ్య ఎప్పటికప్పుడు మారుతుండేది). పోలీసుల, మార్క్సిస్టు పార్టీ కార్యకర్తల దాడుల నుంచీ ప్రజల్ని రక్షించడానికి, గ్రామరక్షక దళాలను ఏర్పాటు చేసుకున్నారు. ఆ ప్రాంతంలో ఉన్న పితృస్వామ్య, అధికారయుత సాంప్రదాయిక వ్యవస్థలకు పూర్తి భిన్నంగా, విలక్షణంగా ఈ కమిటీలు ఉన్నాయి.

ఈ కమిటీల ప్రతినిధులను కలవడానికి, ప్రభుత్వాధికారులు ఎప్పుడువచ్చినా వీరిని తమతో పాటు అల్లికచాపల మీద కూర్చో బెట్టేవాళ్లు. అధికారులు కుర్చీల మీద, ప్రజలు వాళ్ల చుట్టూ నేల మీద కూర్చునే సాంప్రదాయిక ఆచరణకు ఇది పూర్తి విరుద్ధం. ఇలాంటి ఆచరణ ఫలితంగా ఆ ప్రాంత ప్రజల్ని ఇంతకాలం కట్టిపడేసిన సంకెళ్లు తెగిపోయాయి. అధీనులమనే హీనస్థాయినుండి సమానులమనే స్థాయికి, కొద్ది మంది శిష్టులకు ఏ మాత్రం లొంగిఉండాల్సిన అవసరం లేని స్థాయికి ప్రజలు ఎదిగారు.

పోరాట క్రమంలో నూతన అభివృద్ధి కార్యక్రమాల అమలుకు చొరవ తీసుకున్నారు. కాంతాపహారిలో రెండు సంవత్సరాల నుండీ నిరుపయోగంగా ఉన్న ప్రభుత్వ ఆస్పత్రిని పి.సి.పి.ఏ స్వాధీనం చేసుకుని దాన్ని 'ప్రజా వైద్యశాల'గా మార్చింది. ఒక డాక్టరును, ఆరుగురు వైద్య కార్యకర్తలను నియమించి దాన్ని ప్రజల ఉపయోగంలోకి తెచ్చింది. అనేక గ్రామాలలో వ్యవసాయ గొట్టపు బావులను ఏర్పాటు చేయడం, కాల్వల పూడికలు తీయించడం వంటి కార్యకలాపాల ద్వారా ప్రజల తాగు, సాగు నీటి సమస్యల్ని పరిష్కరించడానికి కూడా పిసిపిఎ ప్రయత్నించింది. స్వచ్ఛంద శ్రమ, విరాళాల ద్వారానే ఈ కార్యక్రమాలన్ని అమలయ్యాయి.

ధనికులకు ఉపయోగపడే రీతిలో విదేశీ పెట్టుబడుల ద్వారా అమలయ్యే పథకాలకు భిన్నంగా, స్వయంశక్తి నమూనాను ప్రోత్సహించడం ద్వారా మావోయిస్టులు అభివృద్ధి పథకాల నిర్వహణలో ప్రధాన పాత్ర వహించారు. ఆరోగ్యకేంద్రాలు, తాగునీటి, సాగునీటి పథకాలు, రోడ్ల అభివృద్ధి వంటి పథకాలు వాటిల్లో ఉన్నాయి. సమాంతర పాలనా వ్యవస్థల నిర్మాణంలో సహాయం చేయడంతో పాటు, మావోయిస్టులు గ్రామీణ ప్రజలతో కలిసి యాభై కిలోమీటర్ల కంకర

*వట్టికోట ఆళ్వారుస్వామి సంకలనకర్తగా దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణగా 1956లో 'తెలంగాణం' పేరిట వచ్చిన వ్యాస సంకలనంలో **ఎస్. సోమరాజు** రాసిన వ్యాసమిది. తెలంగాణ రచయితల వేదిక, తెలంగాణ విద్యావంతుల వేదికల ఆధ్వర్యంలో మార్చ్ 2009లో ద్వితీయ ముద్రణ గా వచ్చిన 'తెలంగాణం' నుంచి. - సం.*

# సింగరేణి బొగ్గు గనులు - నాటి స్థితి

నేలబొగ్గు ఉపయోగాన్ని తెలుసుకొన్న నాటి నుండీ మానవుడు దానిపట్ల శతాబ్దాల తరబడి అపారమైన శ్రద్ధ వహిస్తునాడు. ప్రకృతి ప్రసాదించిన సహజ సంపదలను ఉపమోగించుకోగల విజ్ఞానశక్తి పైననే మానవ నాగరికత నిర్మిచబడుతుంది. పారిశ్రామిక పురోభివృద్ధి కోసమని ఒక దేశం తనకున్న సహజ సంపదలను ఎంత విరివిగా ఉపయోగించుకోగలుగుతుందో అంత చక్కగా అది అభివృద్ధి చెందుతుంది. ఏ పారిశ్రామిక సంపదకన్నా శక్తి నివ్వగలిగినటువంటి ప్రధాన ఇంధనం నేలబొగ్గు. దీన్ని పురాతన కాలంలో కూడా గ్రీకులు ఉపమోగించారని చెప్పడానికి నిదర్శనాలున్నప్పటికీ, మరెందువల్లనో ఈ మధ్యకాలంలో దీని ఉపయోగం ఆగిపోయింది. 18వ శతాబ్దం మధ్యలో మాత్రమే దీని ఉపయోగం యూరపులో తెలుసుకోబడింది. తత్ఫలితంగానే ఐరోపాలో బ్రహ్మాండమైన పారిశ్రామిక విప్లవం వచ్చింది. జేమ్స్‌వాట్ ఆవిరి యంత్రాన్ని కనిపెట్టాక దాని ప్రాముఖ్యత మరింత పెరిగింది. 1865లో స్టాన్లీజీవన్స్ అనే యూరపు శాస్త్రజ్ఞుడు నేలబొగ్గు ప్రాముఖ్యతను గురించి ఇట్లా అన్నాడు, 'మానవ ఉపయోగానికి బొగ్గు మరి ఏ ఇతర వస్తూవులకూ ద్వితీయ స్థానాన్ని ఆక్రమించలేదు. ఆక్రమించదు. మొత్తానికి బొగ్గు అన్ని పదార్థాలకంటే ముఖ్యమైనది. మనం చేసే ప్రతిపనీ బొగ్గునుండి వచ్చే శక్తిలేకుండా చేయలేం. ఈ బొగ్గుతో ఎట్టి అద్భుత కార్యాన్నన్నా సాధించగలుగుతాం. సాధించడం తేలికకూడా. బొగ్గు లేకపోతే మానవజాతి మరల అంధకార యుగాలలోని దారిద్ర్యానికి ఈడ్చబడుతుంది. నిజంగా కుడా ఈ నేలబొగ్గు ఉపయోగాలు అనంతం.' అణుశక్తి ఉపయోగంలోనికి వస్తున్న ఈ యుగంలో కూడా వచ్చే కొన్ని దశాబ్దాల వరకూ బొగ్గు ప్రాముఖ్యత ఎంత మాత్రం తగ్గదని శాస్త్రజ్ఞులు ఘంటాపథంగా చెబుతున్నారు. బొగ్గు యొక్క స్థానాన్ని అణుశక్తి ఆక్రమించగల అవకాశాలు ఇంతలో లేవని భారత కేంద్ర ప్రభుత్వ ఉత్పత్తిశాఖ మంత్రి కె.సి. రెడ్డి మొన్ననే ప్రకటించారు. ఇంతటి ప్రాధాన్యంగల ఈ బొగ్గు ఎట్లా పుట్టిందో కొంచెంగా తెలుసుకుందాం.

దాదాపు 210 మిలియన్ సంవత్సరాలకు పూర్వం ఇప్పుడు మనం చూస్తున్న భూమి లోపలికి కుంచుకుపోయిన బురద అగడ్తలతోనూ, పొడుగాటి అడవులతోనూ నానా భీభత్సంగా ఉండేది. అప్పుడు భూమిపై మానవుడు లేడు. సరీసృపాల్లాంటి బేతాళ జీవులు నివసిస్తుండేవి. అవి ఆ బురదనీళ్ళల్లో పుడుతూ, పాకుతూ నడుస్తూ, జీవిస్తూ తిరిగి నశించిపోతుండేవి. కాని పచ్చటి అడవులు బహు ఏపుగా పెరుగుతూ అందులోని మహా వటవృక్షాలు మాత్రం తారామండలానికి ఎగబాకుతుండేవి. దీన్న భూగర్భ శాస్త్రజ్ఞులు మహావట వృక్షకాలపు బొగ్గుయుగమని పిలిచారు. ఈ విధంగా పెరిగిన అరణ్యాలన్నీ

---

రోడ్డు నిర్మాణం చేశారు. గొట్టపుబావులు, నీళ్ల ట్యాంకులు ఏర్పాటు చేశారు. ఆరోగ్య కేంద్రాలను నిర్వహిస్తున్నారు.

మహిళా ఉద్యమంతో ఉద్వేగభరితమైన అనేక అభివృద్ధికర మార్పులు జరిగాయి. కమిటీలలో తగిన ప్రాతినిధ్యం పొందడంలో మహిళలు విజయం సాధించారు. మొత్తం ఉద్యమంలో కూడా నాయకత్వపు స్థానాలలో మహిళల ప్రాతినిధ్యం పెరిగింది. ఇలాంటి ఆచరణ సాంప్రదాయక పితృస్వామ్య వ్యవస్థను బలంగా ఎదుర్కోవడంలో ఉపకరించింది. పిసిపిఎ కు అనుబంధంగా ఒక మహిళా శాఖ ఏర్పడింది. పోలీసు దమనకాండకు మార్క్సిస్టు పార్టీ దాడులకు వ్యతిరేకంగా మాత్రమే కాక గృహ అణచివేతకు వ్యతిరేకంగా కూడా పోరాడడం దాని బాధ్యత. సారా తాగడాన్ని, అమ్మడాన్ని నిషేధించడం, దాన్ని ఉల్లఘించిన వారిపై సాంఘిక బహిష్కరణను అమలు చేయడం ఈ ఉద్యమ కాలంలో రూపొందిన మరొక విలక్షణమైన అంశం.

లాల్‌ఘడ్ విముక్తి కోసం జరుగుతున్న పోరాటం ధర్మబద్ధమైనదేనని నా విశ్వాసం. వాస్తవాలన్నీ ఈ విషయాన్ని బలంగా నిరూపిస్తున్నాయి. ఇలాంటి విస్తృతమైన ఉద్యమం ఈ ప్రాంతంలో ఇదే మొదలు. నిర్వివాదంగా న్యాయ సమ్మతమైన లక్ష్యంతో ప్రారంభమైన ఈ ఉద్యమాన్ని రూపొందించుకున్నదీ, నాయకత్వం వహిస్తున్నదీ స్థానిక ఆదివాసీ ప్రజలే. విప్లవ ప్రజానీకం ఈ ఉద్యమాన్ని గమనిస్తూ, తాము నేర్చుకోగలిగింది, నేర్చుకోవడంతో పాటు సాధ్యమైనంత సహాయాన్ని దానికి అందించాలి. ఈ పోరాటం నిస్సందేహంగా దీర్ఘకాలికమైనది. పశ్చిమ బెంగాల్ ప్రజలు విషమపరిస్థితుల్ని, కష్టాలను, కన్నీళ్లను ఎదుర్కొంటున్నారు. వర్తమాన రాజకీయ చరిత్రలో నూతన నక్సల్బరీగా పిలవబడుతున్న ఇది ఒక విలక్షణమైన సమీకరణ సందర్భం. రాబోయే భవిష్యత్తులో విప్లవ పోరాటానికి తప్పని సరిగా ఇది కేంద్రమవుతుంది.

(న్యూయార్క్ నుంచి వెలువడే స్వతంత్ర సోషలిస్టు పత్రిక మంత్లీ రివ్యూ ఆధ్వర్యంలో నడుస్తున్న ఎంఆర్ జైన్ వెబ్‌సైట్ సోజన్యంతో)

*(స్వేచ్ఛానువాదం : **సి.ఎస్.ఆర్. ప్రసాద్**)*

వీ

కూలిపోయి చెమ్మగా ఉండే భూమిలోనికి కుంచుకుపోతుండేవి. ఆ విధంగా చెట్లు పెరగడం, భూమిలోనికి కుంచుకుపోవడం ఆపైన మట్టి, రాళ్లుపడి లోనకు కుదించబడి తర్వాత భూగర్భంలో జరిగే అనేక పరిణామాలకు గురవ్వడం, ఆ విధంగా జరుగుతుండగానే మళ్లీ భూమిపై చెట్లూ, చేమలూ పెరిగి మహారణ్యాలయ్యాయి. ఈ విధంగా గతించిన ఇరవై ముప్ఫై మిలియన్ సంవత్సరాలలోనూ వృక్షాలు పెరిగాయి, కూలాయి, భూమిలోనికి కుంచుకుపోయాయి. దానిపై మట్టీ రాళ్లూ పడ్డాయి. తర్వాత అవి బొగ్గు పొరలుగా ఏర్పడ్డాయి. ఈ అరణ్యాల కలప వలన, సూర్యరశ్మి వలన భూగర్భంలో జరిగిన పరిణామాల వలన అది మొదటి దశలో ఒక తక్కువ రకం బొగ్గుగా అంటే పీట్ అనే బొగ్గు పొరలుగా ఏర్పాడ్డాయి. ఈ పొరలు మరల భూమి ఒత్తిడికి నొక్కబడి మంచి బొగ్గు పొరలుగా మారాయి. భూమి ఒత్తిడిచే 15 అడుగుల ఒక పీట్ బొగ్గు నొక్కబడితే – ఒక అడుగు మందం గలిగిన బొగ్గుపొరగా తయారవుతుంది. అంటే 30 అడుగుల మందంగల ఒక మంచి బొగ్గు పొర ఏర్పడ్డానికి 450 అడుగుల మందంగల పీట్ పొర నొక్కబడాలి. ఒక 100 అడుగుల మందంగల బొగ్గుపొర ఏర్పడాలంటే ఎంత బ్రహ్మాండమైన వృక్షజాలం ఈ పకృతి పరిణామాలల్లో నశించిపోయి ఉండాలో మనం ఊహించుకోవచ్చును.

ఒక దామోదర లోయలోనే ఇట్లాంటి బొగ్గుపొరలు ఒకదానిపై ఒకటి 18 వరకూ ఏర్పడి ఉన్నాయని భూగర్భ శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు.

ఈ బొగ్గు పొరలు ఎట్లా ఏర్పడ్డాయి. అన్న విషయంలో మరో సిద్ధాంతం కూడా ఉన్నది. దీనిని డ్రిఫ్టు సిద్ధాంతమంటారు. ప్రపంచ పరిణామాలలో వచ్చిన అపూర్వ వరదలకు మహా పర్వతాలలా పేర్కొని ఉన్న కలప లోయలలోనికి కొట్టుకొనిపోయి అక్కడ మేటగా ఏర్పడి భూమిలోనికి కుంచుకుపోయి ఈ బొగ్గు పొరలు ఏర్పడ్డాయని ఆ సిద్ధాంతం చెబుతుంది. బొగ్గు పొరలు అధికంగా నదీ లోయలలో కనబడ్డానికి కారణం కూడా ఇదేనని ఆ సిద్ధాంతంలో నమ్మకం ఉన్నవారు అంటారు. మన హైదరాబాదు రాష్ట్రంలో కనబడే బొగ్గు కూడా అట్టి లోయలో ఏర్పడినటువంటిదే. ఈశాన్య మూలనున్నటువంటి శాస్తి నుండి ఆగ్నేయాన ఉన్న రాజమండ్రి వరకు విస్తరించి ఉన్న ప్రాణహిత గోదావరీ లోయలో ఈ బొగ్గు పొరలు వ్యాపించి ఉన్నాయి.

మన భారతదేశంలో ఉన్న ఈ బొగ్గు నిధుల మొత్తం 68 వేల మిలియన్ టన్నులని ఇప్పటి వరకూ జరిగిన పరిశోధనల మూలంగా అంచనా వేయబడింది. ఇందులో మన హైదరాబాదు రాష్ట్రంలో ఉన్న బొగ్గు నిధుల మొత్తం ఇప్పటివరకూ చేసిన పరిశోధనల మేరకు ఒక వెయ్యి మిలియన్ టన్నులని కూడా శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. ఇప్పుడు ఇంకా భూగర్భ పరిశోధనలు జరుగుతున్నాయి. కాబట్టి ఆ పరిశోధనల ఫలితాలు తేలితే ఈ నిధుల మొత్తం ఇంకా కొన్నివేల మిలియన్ల టన్నులకు పెరగవచ్చున.

ఈ బొగ్గుకు మరింత ఉష్ణం కలుగజేసే పరిణామం జరిగితే అది మణులుగా మారుతుంది. మణిలో ఉండే మూలపదార్థం – కార్బన్. అందుకనే బొగ్గును నల్లమణులు అని పిలుస్తారు. నిజంగా మణులకు ఎంత విలువ ఉన్నదో ఈ బొగ్గుకు కూడా అంత విలువా ఉంది. 18వ శతాబ్ద మధ్యలో యూరప్ పారిశ్రామిక మహా విప్లవాన్ని సాధించిందంటే దానికి కారణం బొగ్గు ఉపయోగమే. బొగ్గు లేకపోతే ఈనాడు నాగరికతకు చిహ్నంగా నిలబడ్డ రైల్వేలకు నామరూపాలే లేకుండా పోయేవి. ద్వితీయ ప్రపంచ సంగ్రామ ప్రారంభంలో ప్రపంచ రాజ్యాలన్నిటినీ గజగజ లాడించిన హిట్లరు జర్మన్ రాజ్య ప్రాబల్యానికి ముఖ్యకారణం– సార లోయల్లోని బొగ్గు పరిశ్రమ. ఆ బొగ్గు పరిశ్రమనాధారం చేసుకొనే బ్రహ్మాండమైన ఉక్కు పరిశ్రమను, అపార యుద్ధ పరికరాలను తయారు చేయగలిగారు.

ఈనాడు ప్రపంచంలో బొగ్గును అధికంగా ఉత్పత్తి చేస్తున్న దేశం అమెరికా. 1995వ సంవత్సరంలో దాని సాలుసరి ఉత్పత్తి 448.46 మిలియన్ టన్నులు. అదే సంవత్సరంలో 347.10 మిలియన్ టన్నులు ఉత్పత్తి చేసి సోవియట్ యునియన్ ద్వితీయ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. బ్రిటన్ దేశం 225.13 మిలియన్ టన్నులు ఉత్పత్తి చేసి తృతీయస్థానాన్ని ఆక్రమిస్తున్నది. ఈనాడు ప్రపంచ రాజకీయాలలో – ఈ మూడు దేశాలు అదే వరసలో బలమైన రాజ్యాలుగా గుర్తించబడటం మనమందరం గమనిస్తూనే ఉన్నాం. అందువలననే ఒక దేశం పారిశ్రామిక పురోగమనానికి, ఆర్థిక సౌష్టవానికి బొగ్గు అతి ప్రధానమైన ఇంధనంగా అన్ని దేశాలు గుర్తించాయి.

ఈ బొగ్గు ఒక్క శక్తినిచ్చే ఇంధనంగానే కాకుండా ఇంకా అనేక ఉపపరిశ్రమలకు కూడా మూలాధారంగా ఉన్నది. దీనినుండే రోడ్లకు ఉపయోగించే తారు తయారవుతుంది. ప్లాస్టిక్ వస్తువులు ఉత్పత్తి అవుతున్నాయి. ఆఖరికి మనం తలకు ఉపయోగించుకొనే సువాసన నూనెలు, బట్టల అద్దకాలకు వేసుకొనే రంగులు కూడా ఈ బొగ్గునుండే తీయబడుతున్నాయి.

అన్నింటికంటే ముఖ్యం – మన పొలాలకు పచ్చటి పంటలనిస్తున్న రసాయనిక ఎరువులు ఈ బొగ్గునుండే తయారు చేయబడుతున్నాయి. తక్కువ రకం బొగ్గునుండి కృత్రిమ పెట్రోలు తీయబడుతున్నది.

ఇన్ని బహుళ ప్రయోజనాలు కలిగిన ఈ బొగ్గు ప్రపంచ ఉత్పత్తిలో భారతదేశం 9వ స్థానాన్ని మాత్రమే ఆక్రమిస్తున్నది. ఈ నేలబొగ్గు తవ్వకం భారతదేశంలో మొట్టమొదటిసారిగా ఝరియాలో 1774లో ప్రారంభింప బడింది. దీనికిన్ని సంవత్సరాల చరిత్ర ఉన్నా ఇది అంతగా అభివృద్ధి చెందకపోవడానికి ముఖ్యకారణం భారతదేశపు బానిసత్వం. భారతదేశాన్ని కొల్లకొట్టడం నేర్చిన తెల్లవారలు బొగ్గు పరిశ్రమను అభివృద్ధి చేస్తే దేశం పారిశ్రామికంగా పురోభివృద్ధి చెందాల్సి ఉంటుందని, అప్పుడు తమకిక మార్కెట్ ఉండదనే భయంతోనే బుద్ధి పూర్వకంగా ఈ పరిశ్రమ పురోగమనాన్ని కుంటుపరిచారు. ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో వాళ్ల అవసరాల కొద్దీ ఈ పరిశ్రమపై కొంత శ్రద్ధ వహించారు. కాని అది అంత చెప్పుకోతగ్గది కాదు.

భారతదేశం స్వేచ్ఛను పొందిన తరువాత ప్రణాళికాబద్ధమైన పురోగమనానికి పూనుకొన్నది. బొగ్గు పరిశ్రమ ప్రాధాన్యతను స్వేచ్ఛా భారతం పూర్తిగా గుర్తించింది. 1939లో 26 మిలియన్ టన్నులున్న ఈ బొగ్గు ఉత్పత్తి 1955 నాటికి 38.21 మిలియన్ టన్నులకు చేర్చబడింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాంతం నాటికి ఈ ఉత్పత్తి 60 మిలియను టన్నులకు చేరాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. అంటే అదనంగా 22 మిలియన్ టన్నులు ఉత్పత్తి కావాలి. దీనిలో 10

మిలియన్ టన్నులు ప్రైవేట్ రంగానికి, 12 మిలియన్ టన్నులు ప్రభుత్వ రంగానికి కేటాయించబడ్డాయి. ప్రభుత్వ రంగానికి కేటాయించబడ్డ బాధ్యతలలో కొంత సింగరేణి కాలరీలపై కూడా పడింది.

## సింగరేణి బొగ్గుగనులు

సింగరేణి బొగ్గుగనులు ఎక్కడ ఉన్నవి, ఇవి ఎప్పుడు పుట్టాయి, ఇవి ఎవరి ఆస్తిపాస్తులు? ఈ విషయాలు వాస్తవానికి చాలామంది ఆంధ్రులకు తెలవదు. ఒక ఆంధ్ర యాత్రీకుడు కొత్తగూడెం మీదుగానే భద్రాచలం పోతూ కూడా ఆంధ్రుల యీ జాతీయ సంపదను గూర్చి తెలుసుకోవాలనే ఆసక్తి చూపాడు. అందుకనే నేనీ వ్యాసంలో ఆంధ్రులకు గర్వకారణమైన సింగరేణి సంపదను గురించి విపులంగా వివరించడానికి ప్రయత్నిస్తాను.

వాస్తవానికి – ఇంత పెద్ద ఒకే ఒక పరిశ్రమ ఆంధ్రప్రదేశ్ కంతటికీ ఈ బొగ్గుగనులేనని చెప్పాలి. మొత్తం దక్షిణదేశానికంతటికీ ఉన్న ఒకే ఒక బొగ్గు పరిశ్రమ సంగరేణి కాలరీలే. ముందు వీటి పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకుందాం.

ఖమ్మం జిల్లాలో ఎల్లందు అనే ఒక గ్రామమున్నది. ఆ గ్రామానికి ఈశాన్యంగా దుంటుపల్లి అనే ఒక గ్రామంలో కొంతమంది గ్రామస్తులు 1841వ సంవత్సరంలో భూమిని తవ్వుచుండగా బొగ్గు బయటపడింది. ఈ వార్తను తెలుసుకున్న ఇండియా ప్రభుత్వ భూగర్భ పరిశోధక శాఖ వారు తమ సిబ్బందితో బయలుదేరి వచ్చి పరిశోధనలు సాగించారు. ఆ పరిశోధనల్లో దొరికిన బొగ్గు అంత శ్రేష్టమైనదిగా కనపడలేదు. అందువల్ల వారు ఆ ప్రయత్నాలను మానుకొన్నారు. ఈ ప్రయత్నాలను ఆధారం చేసుకొనే 1871వ సంవత్సరంలో డాక్టర్ కింగ్ అనే మరో భూగర్భ ఖనిజ పరిశోధకుడు ఎల్లందు గ్రామ పరిసరాలలోనే బోరింగులు వేసాడు. చక్కటి బొగ్గున్నదని రుజువయింది. ఇక్కడున్న ఆరు బొగ్గుపొరల్లోనూ, అడుగున్న బొగ్గుపొర – పై బొగ్గుపొర శ్రేష్టమైనవిగా కనబడ్డాయి. పైనున్న బొగ్గుపొరకంటే కిందనున్న బొగ్గుపొర మరింత శ్రేష్టమయినదని తేలింది.

1886వ సంవత్సరంలో హైదరాబాదు దక్కన్ కంపెనీ లిమిటెడ్ వారు ఎల్లందు వద్ద గని తవ్వకానికి పూనుకొన్నారు. కింద నున్న బొగ్గు పొరకు గనులు తవ్వి ఆ పొరకు కింగ్‌సీమ్ అని పేరు పెట్టారు. పై పొరకు క్వీన్‌సీమ్ అని పేరు పెట్టారు. 1889లో మొట్టమొదటి టన్ను బొగ్గు తవ్వబడింది. ఉత్పత్తి అవుతున్న ఈ బొగ్గును రవాణా చేయడానికి బెజవాడ – ఖాజీపేట రైల్వేలైను మీదనున్న డోర్నకల్లు నుండి బ్రాంచి రైల్వే లైను వేయబడింది. ఆ రైల్వేస్టేషనుకు సింగరేణి కాలరీస్ అని పేరు పెట్టబడింది.

1921 ఏప్రిల్ నెలలో కంపెనీ మేనేజ్‌మెంటు హైదరాబాదు దక్కన్ కంపెనీ నుండి సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ అనే ఒక కంపెనీగా మారి, అప్పటినుండి దీనికి మేనేజ్‌మెంట్‌లు మారినా పేరు మారలేదు. 1921 నుండి 1946 వరకు ఈ బొగ్గుగనులకు బెస్ట్ అండ్ కంపెనీ వారు మేనేజింగ్ ఏజెంట్లుగా ఉన్నారు. ఇందులో అధికభాగం షేర్లు బ్రిటిష్ పెట్టుబడిదారులవి. 1946 నుండి 1949వరకు ఈ బొగ్గుగనుల యాజయాన్యానికి హైదరాబాద్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ ఆధిపత్యం వహించింది. దీనిలో మాజీ హైదరాబాదు మంత్రి లాయికాలీకి ప్రాబల్యం ఉండేది. 1949లో పోలీసు యాక్షన్ తరువాత ఈ కంపెనీ యాజమాన్యం హైదరాబాదు ప్రభుత్వం ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండ్‌కు అప్పగించబడింది. ఈ కంపెనీ షేర్లలో నూటికి 88 షేర్లు ప్రభుత్వం కొనివేసింది. ఈ గనులను జాతీయం చేయడంలో ఇది ప్రధానమైన ఘట్టం. అప్పటినుండి సింగరేణి కాలరీస్ కంపెనీ అంచీలమీద పురోగమిస్తున్నది.

## మూడు కాలరీలు

సింగరేణి కాలరీస్ కంపెనీ ఆధ్వర్యాన తెలంగాణలోని మూడు ప్రదేశాలలో ఈ బొగ్గుగని తవ్వకం జరుగుతున్నది. ఈ మూడింటిలోనూ ప్రస్తుతం ప్రధానమైన ఉత్పత్తి కేంద్రం కొత్తగూడెం. రెండవస్థానాన్ని తాండూరు బొగ్గుగనులు, మూడవస్థానాన్ని ఎల్లందు బొగ్గుగనులు ఆక్రమించుకున్నాయి. ఈ మూడు ప్రదేశాలలోనూ మొత్తం 14 బొగ్గు గనులు ఉన్నాయి. అందులో కొన్నిటికి ఈ మధ్యనే ప్రారంభోత్సవాలు జరిగాయి. వాటిని గురించి వేరే తెలియజేస్తాను. కొత్తగూడెం కాలరీలను గురించి ముందు తెలుసుకుందాం.

**1. కొత్తగూడెం:** ఇది ఖమ్మం జిల్లాలో ఉన్న 75 వేల జనాభాగల పట్టణం. ఇది బెజవాడకు 95 మైళ్ల దూరంలో ఉంది. హైదరాబాదు పట్టణానికి 164 మైళ్ల దూరంలో ఉంది. ఇక్కడికి భద్రాచల పుణ్యక్షేత్రం 18 మైళ్ల దూరంలో ఉన్నది. ఇక్కడ మొదటి టన్ను బొగ్గు 1937వ సంవత్సరంలో బర్లీపిట్ అనే ఒక పెద్ద గని నుండి తవ్వితీయబడింది. ప్రస్తుతం ఇక్కడ తొమ్మిది గనులున్నాయి.

కొత్తగూడెంలో ఉన్న గనులలో రోజు 1కి దామాషాని 12 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు. 1955వ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఇక్కడి మొత్తం బొగ్గు ఉత్పత్తి (డెబ్బయి తొమ్మిదివేలు) 79,000 టన్నులు. ఇక్కడ ఉన్న బొగ్గుపొరలు 5 అడుగుల మందం నుండి 100 అడుగుల మందం వరకూ ఉన్నాయి. కొత్తగూడెం ప్రాంతంలో విస్తరించి ఉన్న బొగ్గు నిధులు కొన్ని వందల సంవత్సరాల వరకూ తవ్వుకోవచ్చునని భూగర్భ ఖనిజ పరిశోధకులు అంచనా వేస్తున్నారు.

**2. తాండూరు:** ఇది ఆదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్ తాలూకాలో ఉన్నది. కొత్తగూడెం నుండి – ఖాజీపేట – బలార్షా రైలు మార్గంపై 173 మైళ్లు ప్రయాణిస్తే తాండూరు బొగ్గు గనులు చేరవచ్చును. ఇక్కడ బొగ్గు తవ్వకం 1928 లో ప్రారంభమయింది. ఇక్కడ మోర్గన్స్ గని, 2వ ఇంక్లయిను, శాంతిఖని, కల్యాణఖని అనే నాలుగు గనులున్నాయి. ఇందులో పెద్దదైన గని మోర్గన్స్ గని. రోజు 1 కి దాదాపు 19 వందల మంది కార్మికులు ఇందులో పనిచేస్తుంటారు.

ఇక్కడి గనుల్లో గత సెప్టెంబరు నెలలో 5000 టన్నుల బొగ్గు ఉత్పత్తి చేయబడింది. దాదాపు ఈ గనుల్లో రోజు 1కి 5500 మంది కార్మికులు పనిచేస్తుంటారు. ఈ పట్నం జనాభా 20 వేలు. ఇక్కడ బొగ్గు ఉన్నదని తెలియచేసే రాళ్లు 75 చదరపు మైళ్ల విస్తీర్ణంలో వ్యాపించి ఉన్నవి. చాలా దశాబ్దాల పాటు ఇక్కడి బొగ్గును నిర్విరామంగా తవ్వుకోవచ్చునని పరిశోధకుల అంచనా.

**3. ఎల్లందు:** కొత్తగూడెంనకు 29 మైళ్ల దూరంలో ఈ బొగ్గు గనులు ఉన్నాయి. 52 ఏండ్లపాటు తవ్వి 27 మిలియన్ల టన్నుల బొగ్గును కింగుసీం నుండి తీయడంతో అది 1941లో ఆఖరయింది. తరువాత

క్వీనుసీం నుండి బొగ్గును తీయడానికి ఒక గనిని తవ్వారు. ఇప్పటికీ ఆ గనినుండే బొగ్గు తీయబడుతున్నది. ఇక్కడ దాదాపు రోజు 1 కి 1860 మంది కార్మికులు పనిచేస్తుంటారు. గత సెప్టెంబరు నెలలో ఈ గని నుండి 16,244 టన్నుల బొగ్గు తీయబడింది. ఇక్కడ ఇంకా బొగ్గు దొరుకుతుందని తెలియజేసే రాళ్లు చదరపు మైళ్ల విస్తీర్ణంలో వ్యాపించి ఉన్నాయి.

పై విధంగా పైన చెప్పిన మూడు కాలరీలలోనూ దాదాపు 20 వేల మంది కార్మికులు పనిచేస్తున్నారు. గత సెప్టెంబరు నెలలో ఈ కాలరీలలో ఎన్నడూ లేనంత ఉత్పత్తి – అంటే 1,45,312 టన్నుల బొగ్గు ఉత్పత్తి చేయబడింది. ఇక్కడ ఉత్పత్తి అయ్యే బొగ్గు ఉత్తమ రకం 'ఎ' గ్రేడు నాన్‌కోకింగ్ కోల్ తరగతిలోనిది. చిట్లంకట్టకుండా స్వచ్ఛంగా కాలుతుందనే ప్రసిద్ధి కూడా ఉన్నది. దక్షిణ భారతదేశంలోని పవరుహౌసులకు, రైలింజన్లకు, సిమెంటు ఫ్యాక్టరీలకు, ఇంకా తదితర పరిశ్రమలకు ప్రధానంగా బొగ్గును సరఫరా చేస్తున్నది ఈ సింగరేణి కాలరీలే. ఇన్ని వేల మంది కార్మికులు పనిచేస్తూ, ఒకే ఒక మేనేజిమెంటు కిందనున్న పరిశ్రమ మొత్తం ఆంధ్రప్రదేశ్ అంతటా యీ సింగరేణి కాలరీలేనని ప్రతి ఆంధ్రుడూ సగర్వంగా చెప్పుకోవచ్చును.

## కొత్తగనులు : ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

గనుల నుండి ఎప్పుడూ ఒకే స్థాయిలో ఉత్పత్తిరాదు. గనులు పాతబడిపోవడంతో పాటే వాటి నుండి ఉత్పత్తి కూడా తగ్గుతుంటుంది. సింగరేణి కాలరీలలో పాత గనుల నుంచి ఉత్పత్తులు పడిపోవడంతోనే ప్రణాళికా లక్ష్యాలను సాధించడానికి కొత్తగనులను తవ్వవలసి వచ్చింది. 1954 ఆగస్టు నుండి ఇప్పటివరకు అయిదు కొత్త గనులు తవ్వబడ్డాయి. ఆనందఖని, వెంకటేశ్‌ఖని, గౌతమఖని అనే మూడు గనులు కొత్తగూడెంలో తవ్వబడ్డాయి. శాంతిఖని, కళ్యాణఖని అనే రెండు గనులు తాండూరులో ప్రారంభించబడ్డాయి. ఇప్పటికప్పుడే ఆనందఖని, వెంకటేశ్‌ఖని, శాంతిఖనులు ఉత్పత్తిలో కూడా పడ్డాయి. మిగిలిన రెండు గనులనుండి త్వరలోనే ఉత్పత్తి ప్రారంభమవుతుంది.

ఆనందఖని, వెంకటేశ్‌ఖని, గౌతమఖనులు ప్రారంభించిన ప్రదేశానికి రాణి రుద్రమదేవి జ్ఞాపక చిహ్నంగా రుద్రంపూరు అనే పేరు పెట్టారు. ఆనందఖని పూర్తి ఉత్పత్తిలో పడినప్పుడు రోజు 1 కి వెయ్యి టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయగల్గుతుంది. ఈ గనిలో రెండు బొగ్గు పొరలున్నాయి. ఒకటి 34 అడుగులు, మరొకటి 22 అడుగులు మందం గలిగి ఉన్నాయి. మొత్తం ఈ గని నుండి 50 లక్షల టన్నుల బొగ్గును తవ్వుకోవచ్చును.

వెంకటేశ్‌ఖని పూర్తి ఉత్పత్తిలో పడినప్పుడు నెల 1 కి 30 వేల టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయగల్గుతుంది. ఇందులో 6 అడుగుల నుండి 40 అడుగుల మందంగల బొగ్గు పొరలు మూడు ఉన్నాయి. 600 లక్షల టన్నుల బొగ్గు నిధులు గనిలో ఉన్నాయని అంచనా.

శాంతిఖని ప్రారంభోత్సవం అప్పటి అంచనాల ప్రకారం ఈ గనిలో 100 లక్షల టన్నుల బొగ్గు నిధులున్నాయి. తరువాత ఇంకా బోర్‌హోల్స్ వేసి పరిశోధనలు సాగిస్తున్నారు. ఈ నిధుల మొత్తం ఇంకా పెరగవచ్చునని అంటున్నారు. ఇందులో వెయ్యిమందికి ఉద్యోగాలు దొరుకుతాయి.

కళ్యాణఖని పూర్తిగా ఉత్పత్తిలో పడినప్పుడు నెల 1 కి 50 వేల టన్నుల బొగ్గును ఈ గనినుండి పైకి తీయవచ్చును. ఇది పూర్తిగా అభివృద్ధి చేయబడిన తర్వాత ఇంత పెద్దగని మరొకటి దేశంలో ఉండదని గని ప్రవీణులు చెబుతున్నారు. ఇందులో 3 వేల మందికి ఉద్యోగాలు కల్పించబడుతాయని అంచనా. పోతే ఇక్కడి బొగ్గును ఎంత తవ్వినా 75 సంవత్సరాల కాలం వరకూ తరగదని కూడా చెబుతున్నారు.

మొన్నీమధ్యనే ఆగస్టులో ప్రారంభించబడిన గని గౌతమఖని. ఇక్కడి బొగ్గుపొరలు 50 అడుగుల మందం నుండి 100 అడుగుల మందం వరకూ ఉన్నాయి. ఇంత పెద్ద మందంగల బొగ్గు పొరలు ఇదివరలో ఇక్కడ తవ్వబడలేదు. ఇందులో అనేకమైన కష్టాలున్నాయి. ఆధునిక పద్ధతులతో (శాండ్ స్టాలింగ్) ఈ గనిలో ఉన్న 600 లక్షల టన్నుల బొగ్గును బయటకు తీయాలనే ఈ గనిని తెరిచారు. ఈ గనినుండి రోజు 1కి వెయ్యి టన్నుల బొగ్గును తవ్వి పైకి తీయవచ్చును. ఈ గని పూర్తిగా అభివృద్ధి చెందినప్పుడు రెండు వేల మందికి ఉద్యోగావకాశాలు కల్పించబడతాయి.

ఈ సందర్భంలో ప్రథమ ప్రణాళికలోని మూడవ ఎరువుల ఫ్యాక్టరీ స్థాపనకు సంబంధించిన ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది. ఎరువులకు ముడివస్తువు వట్టి నీరు, తక్కువరకం బొగ్గు. ఆంధ్రదేశం పచ్చటి పంటలకు మూలస్థానం. ఆ పంటలు సమృద్ధిగా పండిచాలంటే ఎరువులు చాలా అవసరం. ఆ ఎరువులను తయారు చేసే ఫ్యాక్టరీని బొగ్గుకు ఉత్పత్తి కేంద్రమైన కొత్తగూడెం ప్రాంతంలోనే స్థాపించాలని హైదరాబాదు ప్రభుత్వం, ప్రజలుకూడా ఎంతో ఆందోళన చేశారు. ఎంక్వయిరీ కమిటీవారు వచ్చి, కాలరీలను దర్శించి బొగ్గును పరిశీలించి కొత్తగూడెం పరిసరాలలోని బూర్గాలంపాడు వద్దనున్న నీటివనరులను కూడా పరిశీలించి ఫ్యాక్టరీ స్థాపనకు చక్కటి అవకాశాలున్నాయని చెప్పి వెళ్లిపోయారు. కాని ఎందువల్లనో ఆ ఫ్యాక్టరీ ఆఖరు నిముషంలో ఇటు కొత్తగూడెంలోనూ కాకుండా, అటు విజయవాడలోనూ కాకుండా ఆఖరికి మద్రాసులోని అవడి వద్ద నిర్మించడానికి నిర్ణయించబడినట్లు వార్తలు వచ్చాయి. ఎప్పుడో ముందు అవతరించనున్న నెవిల్లీ బొగ్గుగనులను దృష్టిలో పెట్టుకొనే ఇట్టి నిర్ణయాన్ని కేంద్ర ప్రభుత్వం చేసినట్లు కూడా పత్రికా వార్తలు చెప్పాయి.

## ఆర్థిక సౌష్ఠవం

ఉత్పత్తి నిరాటంకంగా సాగిపోతున్నంత కాలం బొగ్గు గనుల ఆర్థిక సౌష్ఠవానికి వచ్చిన లోపమేమి ఉండదు. 1953వ సంవత్సరంలో సమ్మె జరిగినప్పుడు మాత్రమే ఈ కంపెనీకి కొంత నష్టం వచ్చింది. 1954–55 ఆర్థిక సంవత్సరాల్లో లాభాలే వచ్చాయి. 1955లో 21 లక్షల రూపాయలు పైబడి నికర లాభం వచ్చినట్లు ప్రకటించింది. ఈ లాభంపై ఇంకా పన్ను విధించ బడలేదు. 1955 లో ఈ కంపెనీ 1 కోటి 11 లక్షల రూపాయలు ఉద్యోగులకు, కార్మికులకు వేతనాలుగా చెల్లించింది. ఈ మొత్తం 56వ సంవత్సరంలో ట్రిబ్యునల్ అవార్డును అమలు పర్చిన కారణంగా మరింత పెరగవచ్చును. 1955 లో ఈ కంపెనీ 3 కోట్ల 15 లక్షల రూపాయల బొగ్గును అమ్మింది.

ఈ కంపెనీకున్న భవనాలకు, గృహాలకు 1 కోటి 10 లక్షల రూపాయల విలువకట్టబడింది. యంత్రాలకు 2 కోట్ల 70 లక్షల

రూపాయల విలువకట్టబడింది. స్టోర్సులోని స్పేర్సు 76 లక్షల రూపాయల విలువ కట్టబడింది.

26, మే 1956వ తేదినుండి ఇండస్ట్రీయల్ ట్రిబ్యునల్ (కాలరీ డిస్ప్యూట్స్) వారు ఇచ్చిన తీర్పును మేనేజ్‌మెంటు అమలుపర్చిన ఫలితంగా కార్మికుల వేతనాలు 40 శాతం పెరిగాయి. గనిలోన పనిచేసే కార్మికుని కనీసవేతనం రు. 72-2-10. గనిపైన పనిచేసే పురుష కార్మికుని కనీస వేతనం. రు. 69-1-0లు. కార్మిక స్త్రీ కనీసవేతనం రు. 51-12-0 లు ఉండాలని ట్రిబ్యునల్ తీర్పు చెప్పింది. ఈ తీర్పుకు మేనేజ్‌మెంట్ ఏ విధమైన వక్రభాష్యాలివ్వకుండా తీర్పును ఉదారంగా అమలుపర్చిన కారణంగా పరిశ్రమలో చక్కటి శాంతి నెలకొని రికార్డు ఉత్పత్తులకు దారితీస్తోంది. ఈ అవార్డులను, కొత్త మైన్సు నిబంధనలను అమలుపర్చిన ఫలితంగా కంపెనీ అదనంగా సంవత్సరానికి 1 కి 70 లక్షల రూపాయలు ఖర్చు పెట్టవలసి ఉంటుందని మేనేజిమెంటు ప్రకటించింది. ఈ అదనపు ఖర్చును భరించేందుకు గాను కేంద్ర ప్రభుత్వం బొగ్గు ధరలను టన్ను 1 కి 3 రూపాయల చొప్పున పెంచింది. ఈ పెంపుదలకూడా ఈ అదనపు ఖర్చుకు సరిపోదనీ, కార్మికులు ఉత్పత్తిని అధికం చేయడం ద్వారానే ఈ లోటును కూడదీసుకోవలసి ఉంటుందనీ కంపెనీ చెబుతూన్నది.

ట్రిబ్యునల్ తీర్పును అమలుపర్చుచున్న సందర్భంలో ఉత్తర హిందూ దేశపు గనులలో కార్మికుల మధ్య - యజమానుల మధ్యా విపరీతమైన వైషమ్యాలు కలిగించాయి. భేదాభిప్రాయాలు పెరిగాయి. సమ్మెలు కట్టారు. పోలీసులు కాల్పులు జరిపారు. ఎంతో అశాంతి ప్రజ్వరిల్లింది. అట్టి పరిస్థితులలో సింగరేణి కాలరీలలో కార్మిక ప్రతినిధులూ, యజమానులూ అవలంబించిన వాస్తవిక దృకపథం మూలంగా ఏ విధమైన అలజడీ కలగలేదు. ఇది చాలా సంతోషించదగ్గ విషయం. తీర్పును అమలుపర్చేటప్పుడు వచ్చిన భేదాభిప్రాయాలను కార్మిక సంఘంవారు సహృద్భావ పూర్వకమైన వాతావరణంలో, శాంతియుతమైన సంప్రతింపుల ద్వారా పరిష్కరించుకొన్నారు. మేనేజిమెంటు కూడా ఎంతో సహనంతో వారు చెప్పిన ప్రతి విషయాన్నీ అర్థం చేసుకొని కార్మికుల కోర్కెలను చాలామట్టుకు ఈడేర్చడానికి ప్రయత్నించింది.

### కార్మికులకు సౌకర్యాలు

1. కార్మికులు ఉద్యోగులు నివసించేందుకు మేనేజిమెంటుచే మొన్నటివరకు గృహాలు ఉచితంగానే ఇవ్వబడ్డాయి. కానీ ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం (జీతాలు హెచ్చించిన కారణంగా) నామకః నెల 1కి రెండు రూపాయల అద్దె వసూలు చేయబడుతున్నది.
2. 300 వందల రూపాయల లోపు బేసిక్ వేతనమున్న వారందరికీ సంవత్సరం 1కి నాలుగు నెల్ల బేసిక్ వేతనం బోనస్సుగా చెల్లించబడుతున్నది.
3. కార్మికులకు ఉచిత వైద్య సహాయం కోసమని మూడు కాలరీలలోనూ మూడు ఆసుపత్రులు నిర్మించబడ్డాయి. ఇందులో కొత్తగూడెం హాస్పిటల్‌లో రెండువందల పరుపులున్నాయి. ఎయిర్ కండిషన్ ఆపరేషన్ థియేటరు ఉన్నది. ఆధునాతనమైన శస్త్ర పరికరాలు, పెద్ద ఎక్స్‌రే యంత్రం మొదలయినవి ఉన్నాయి.
4. గని ప్రమాదాలలో చనిపోయిన కార్మికులకు 72 రూపాయాల బేసిక్ వేతనముండి అతను చనిపోయినట్లయితే అతని కుటుంబానికి కనీసం 2400 రూపాయల నష్టపరిహారంగా ఇవ్వబడుతున్నది. నష్టపరిహారం ఒక్కోసారి 4500 రూపాయల వరకు కూడా ఉంటుంది.
5. కార్మికులందరూ తప్పని సరిగా ప్రావిడెంటుఫండు నిధి సభ్యులుగా చేరాలి.
6. కార్మికులకు, ఉద్యోగులకు కూడా జీతంపై సాంవత్సరిక శెలవులు ఇవ్వబడుతున్నాయి.
7. కార్మికులకు క్యాంటీన్ల ద్వారా అతి స్వల్ప ధరలకు తేనీరు, తినుబండారాలు సరఫరా చేయబడుతున్నాయి. తేనీరు ఖరీదు 0-0-6 లు. తీపిగాని, కారాగాని 0-1-0. శీతకాలంలో గని లోపల పనిచేసే కార్మికులకు ఉచితంగా కాఫీ సరఫరా చేయబడుతుంది.
8. కార్మిక బస్తీలకు, గృహాలకు ఉచితంగా మంచినీరు సరఫరా చేయబడుతున్నది. కొన్ని గృహాలకు అతి స్వల్ప రేట్లపై విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నది. మగ కార్మికులకు యూనిఫారాలు, కంబళ్ళు, స్త్రీ కార్మికులకు చీరలు కంపెనీ కొన్న రేటులో సగం ధరలకు సరఫరా చేయబడుతున్నాయి.
9. కార్మికులు గనిలోపల పనిచేసి బయటకు రాగానే స్నానం చేసేందుకని పిట్‌హెడ్ బాతులు కట్టబడ్డాయి. ఒక్కొక్కటి పూర్తయేటప్పటికి లక్ష రూపాయల ఖర్చుతేలింది.
10. కార్మిక స్త్రీలు పనులలోనికి పోయేముందు తమతమ బిడ్డలను విడిచి వెళ్లడానికి చక్కటి క్రెచీలు నిర్మించబడ్డాయి. ఈ క్రెచీలలో తర్ఫీదు పొందిన నర్సులు ఈ బిడ్డలను తల్లులొచ్చేలోగా ఒకసారి స్నానం చేయించి పాలు, బిస్కట్లు పెట్టి ఆడించి పడుకో బెడతారు. పనయ్యేలోగా తల్లి ఒకసారి వచ్చి పాలిచ్చి వెడుతుంది. స్త్రీ కార్మికులకు జీతంపై ప్రసూతి శెలవలు కూడా ఇవ్వబడుతున్నాయి.
11. మధ్య తరగతి ఉద్యోగులు, కార్మికులు తమ దినసరి పనుల తర్వాత విశ్రాంతి తీసుకునేందుకు మూడు కాలరీలలోనూ క్రీడా మందిరాలు, వివిధ బస్తీలలో సంక్షేమ కేంద్రాలు నిర్మించబడ్డాయి.
12. కార్మికుల్లో ఆరోగ్య జీవితాన్ని అలవరచేందుకు ప్రతి సంవత్సరం ఆరోగ్య వారోత్సవాలు జరుపబడి శుభ్రమైన ఇండ్లకు, పుష్టికరమైన బిడ్డలకు, నిర్మలంగా కనబడే కార్మిక పేటలకు బహుమతులు ఇవ్వబడుతున్నాయి.
13. కార్మికుల జీవితావసర వస్తువులను సరసమైన ధరలకు సరఫరా చేసేందుకు లక్షల పెట్టుబడితో ఒక చక్కటి సహకార సంఘం కూడా పనిచేస్తున్నది.
14. కార్మికులు తమతమ బాధ్యతలేమిటో హక్కులేమిటో తెలుసుకొనేందుకు వారిని విజ్ఞానవంతులుగా చేసేందుకు మేనేజిమెంటు 'సింగరేణి కబుర్లు' అనే ఒక వార పత్రికను తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా నడుపుతుంది. ఈ పత్రికను చాలా మంది కార్మికులు ఎంతో ఆప్యాయంగా రాత్రిపూట విశ్రాంతిగా చదువుకొంటున్నారు. ఈ పత్రిక ఉచితంగా కార్మికులకు అందజేయబడుతున్నది. వీ

*ప్రాంతేతరుల దోపిడీని నిలువరించి, వనరులు, ఉపాధి అవకాశాలు స్థానిక ప్రజలకే చెందేలా, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలో భాగంగా సింగరేణి పరిరక్షణ ఉద్యమం సాగాలంటున్నారు* **పిట్టల రవీందర్**

# సింగరేణి - పరిణామాలు, పర్యవసానాలు

నూట ఇరవై సంవత్సరాల సుదీర్ఘ చరిత్రను కలిగి ఉన్న సింగరేణి బొగ్గు గనుల సంస్థ ఇవ్వాళ ఒక చర్చాంశంగా మీడియాలో నానుతున్నది. అందువల్ల వర్తమానంలో జరుగుతున్న చర్చను ముందుకు తీసుకుపోవడానికి గతానుభవాలను జోడించుకుని, భవిష్యత్తును ఆవిష్కరించుకోవాల్సిన అవసరం ఉంది. ముఖ్యంగా గడచిన పది సంవత్సరాల వ్యవధిలో సింగరేణిలో చోటుచేసుకున్న పెనుమార్పులు తెలంగాణ ప్రాంత ప్రజలను తీవ్ర ఆందోళనకు గురిచేస్తున్నాయి. తెలంగాణ పల్లె ప్రజలకు ఆత్మగౌరవంతో కూడిన బతుకునిచ్చిన సింగరేణి ఇవ్వాళ వందలాది గ్రామాలను వల్లకాడుగా మారుస్తున్నది. వేలాది ఎకరాల పంటపొలాలను బొందలగడ్డలుగా మారుస్తున్నది. లక్షలాది ప్రజల ఉసురుపోసుకుంటున్నది. మొత్తంగా సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతాలలో తీవ్రస్థాయి విధ్వంసానికి హేతువుగా మారిపోతున్నది.

ఈ నేపథ్యంలోనే దాదాపు ముప్పయి సంవత్సరాలుగా సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతాల్లో ప్రజాసంఘాలు, ఉద్యమ సంస్థలు, గని కార్మికులు నిరంతరంగా కొనసాగిస్తున్న పోరాటాల ఫలితంగా 'సింగరేణి' బొగ్గుగనులకు సంబంధించిన అంశం ఇవాళ రాజకీయ ఎజెండామీదకు వచ్చింది. దీనిఫలితంగానే రాష్ట్రంలోని రాజకీయపార్టీలన్నీ ఓపెన్‌కాస్ట్ గనుల విధానాలకు ప్రత్యామ్నాయాలను పరిశీలించాల్సిందేననే అభిప్రాయాన్ని పదేపదే వ్యక్తం చేస్తున్నాయి. సింగరేణిలో బొగ్గుగనుల విస్తరణపై కూడా సర్వత్రా ఆందోళనలు వ్యక్తం అవుతున్నాయి.

బొగ్గు నిక్షేపాలను మొదటిసారిగా కనుగొన్న ఉదంతానికి చాలా ఆసక్తికరమైన కథనం ప్రచారంలో ఉన్నది. భద్రాచలం యాత్రకు కాలినడకన బయలుదేరిన ఆదివాసీలు మార్గమధ్యంలో భోజనాలకోసం ఆగారు. వంటకోసం ఉపయోగించిన మూడు పొయ్యిరాళ్లు అంటుకుని మండటంతో, ఆ బండరాళ్లపై ఆశ్చర్యం, ఆసక్తి ప్రారంభమయ్యింది. ఈ సంఘటన విశేషంగా ప్రాచుర్యం పొంది చివరకు నిజాం నవాబు దృష్టికి వెళ్లింది. భూగర్భ శాస్త్రవేత్తల పరిశీలనతో ఇల్లందు సమీపంలోని 'సింగరేణి' అనే మారుమూల ఆదివాసీ గ్రామ సమీప అడవుల్లో నేలబొగ్గు నిక్షేపాలు బయటపడ్డాయి. లండన్‌కు చెందిన డాక్టర్ విలియం కింగ్ అనే భూగర్భ శాస్త్రవేత్త గోదావరి నదీ పరీవాహక ప్రాంతంలో పర్యటించి విస్తృతంగా పరిశోధనలు, సర్వేలు నిర్వహించారు. ఉత్తర తెలంగాణ ప్రాంతంలో ప్రవహిస్తున్న గోదావరి నదీ పరీవాహక ప్రాంతంలో విస్తారమైన నేలబొగ్గు నిక్షేపాలు ఉన్నట్లు ఆయన ధృవీకరించారు.

ఈ సందర్భంగా డాక్టర్ విలియమ్ కింగ్ చేసిన వాఖ్యలు, ఇవ్వాళ తెలంగాణ అస్తిత్వ ఉద్యమ నేపథ్యంలో ప్రతిఒక్కరూ ఆలోచించదగినవి. 'విస్తారమైన అటవీ సంపద, అత్యంత విలువైన ఖనిజ సంపద, పుష్కలమైన నీటివసతి, సారవంతమైన నేల, మేధోసంపత్తి కలిగిన కష్టజీవులు కలగలిసి ఉన్న ఈ ప్రదేశంతో పోల్చదగిన ప్రాంతం ప్రపంచంలో మరెక్కడా ఉన్నట్లు నా దృష్టికి రాలేదు. భవిష్యత్తులో గోదావరి నదీ పరీవాహక ప్రాంతం (ముఖ్యంగా ఉత్తర తెలంగాణ ప్రాంతం) ప్రపంచ పారిశ్రామిక రంగానికి, ఆధునిక మానవ వికాసానికి దిక్సూచిగా మారుతుందనడానికి నాకు ఎలాంటి అనుమానాలు కనిపించడంలేదు.' 120 సంవత్సరాలకు పూర్వం ప్రపంచ ప్రఖ్యాత భూగర్భ శాస్త్రవేత్త డాక్టర్ విలియం కింగ్ చేసిన ఈ వ్యాఖ్యలను, ఇప్పుడు సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతంలో నెలకొని ఉన్న పరిస్థితులతో సరిపోల్చుకుంటే ఇంతకాలంగా తెలంగాణ వనరుల పట్ల పాలకులు అనుసరిస్తున్న వైఖరులను అర్థం చేసుకోవడం సులభ సాధ్యమవుతుంది.

దక్కన్ కంపెనీ పేరుతో 1887లో ఖమ్మం జిల్లా ఇల్లందు (దీనినే బొగ్గుట్ట అనికూడా పిలుస్తారు) ప్రాంతంలో బొగ్గు తవ్వకం ప్రారంభమయ్యింది. తరువాతి కాలంలో సింగరేణి కాలరీస్ కంపెనీగా నామాంతరం చెందింది. నిజాం పాలనాకాలంలో హైదరాబాద్ సంస్థానం పరిధిలోని పరిమిత ప్రాంతాలలో రైల్వేలు, థర్మల్ విద్యుత్‌ఉత్పత్తి కేంద్రాలు, పారిశ్రామిక అవసరాలకు మాత్రమే పరిమితమైన మోతాదులో నేలబొగ్గును వినియోగించారు. బొగ్గు నిక్షేపాలన్నీ దట్టమైన అటవీ ప్రాంతంలోనే ఉండటంవల్ల విచ్చలవిడి తవ్వకాలకు ఆ కాలంలో నిజాం నవాబు అనుమతించలేదని చెబుతారు. సింగరేణి బొగ్గుగనుల తవ్వకం ప్రారంభమైన తొలిరోజుల్లో ఆడ, మగ, పిల్లలు అనే భేదం లేకుండా అందరూ కలిసి పనిచేసేవారు. కాంట్రాక్టు పద్ధతిలో పని జరిగేది. వారాంతం రోజున కూలీ లెక్కగట్టి చెల్లించేవారు. సెలవు దినాన్ని కుటుంబమంతా సంతోషంతో గడిపేది. తెలంగాణ సాయుధ పోరాటం విస్తరిస్తున్న క్రమంలో ధేవూరి శేషగిరిరావు నాయకత్వంలో బొగ్గుగని కార్మికులు సైతం నిజాం వ్యతిరేక సాయుధ పోరాటంలో పాల్గొన్నారు. ఇల్లందు, కొత్తగూడెం ప్రాంతాలలో గని కార్మికులుగా పనిచేస్తున్న మహిళలు, పురుషులు, పిల్లలు సైతం తెలంగాణ సాయుధ పోరాటంలో పాలుపంచుకుని ఎందరో అమరులయ్యారు. తెలంగాణ సాయుధ పోరాట క్రమంలోనే సింగరేణిలో గనికార్మికోద్యమానికి శేషగిరి నాయకత్వంలో అంకురార్పణ జరిగింది. పనిగంటలు తగ్గించాలని, గనుల్లో రక్షణ, కనీస భద్రత కల్పించాలని, కూలీ రేట్లు పెంచాలని,

కాంట్రాక్టర్ల ఆగడాలను అరికట్టాలని గని కార్మికులు ఎన్నో పోరాటాలు చేసి అనేక హక్కులను సాధించుకున్నారు.

ఇదే క్రమంలో తెలంగాణ పల్లె ప్రాంతాలలో దొరల, భూస్వాముల దోపిడీ, పీడనలనుండి విముక్తి పొందేందుకు వేలాదిమంది దళిత, బహుజనులు సింగరేణిని ఆశ్రయించారు. అండర్‌గ్రౌండ్ బొగ్గుగనుల్లో దుర్భరమైన పని పరిస్థితులమధ్య తమ రక్తాన్ని చెమటగా మార్చి, నేలబొగ్గును తవ్వితీసి ప్రపంచానికి వెలుగులు పంచిపెట్టారు. కాలరీ ప్రాంతాలలో స్వయంగా ఏర్పాటు చేసుకున్న చిన్నచిన్న గడ్డి గుడిసెల్లో కుల, మతాలకు అతీతమైన రీతిలో సహజీవనం సాగించారు. తెలంగాణ పల్లె సంస్కృతిని ప్రతిష్టించుకున్నారు. వైయక్తిక వ్యక్తీకరణ నుండి సమిష్టి వ్యక్తీకరణకు పరిణతి చెందారు. సింగరేణిలో అందుబాటులోకి వచ్చిన ఆర్థిక వెసులుబాటును పేగుబంధాన్ని పెనవేసుకున్న వ్యవసాయానికి అందించి తరతరాలుగా కొనసాగిస్తున్న భూమి బంధాన్ని నిలబెట్టు కున్నారు. మొత్తంగా సింగరేణి బొగ్గుగనుల ప్రాంతాలలో 80వ దశకం నాటికి ఒక ప్రత్యేకమైన 'కార్మిక వర్గం' స్వయంగా రూపుదిద్దుకున్నది.

పల్లెల్లో జరుగుతున్న ప్రజాపోరాటాలనుండి సింగరేణి గని కార్మికులు ప్రేరణ పొందారు. సంఘాలుగా ఏకమయ్యారు. తమ సమస్యలపై తామే పోరాడటానికి నడుంకట్టారు. రోజువారీ సమస్యలపై రాజీలేని రీతిలో బ్రిటిష్ వారసత్వాన్ని కొనసాగిస్తున్న బాయిదొరల దాష్టికాలను ఎదిరించారు. సమ్మెలు చేశారు. హక్కులు సాధించుకున్నారు. సింగరేణి బొగ్గుగనుల్లో తాము పొందిన చైతన్యాన్ని తిరిగి తెలంగాణ పల్లెలకు ప్రసరింపజేసారు. ఈ విధంగా తెలంగాణ పల్లెలకు, సింగరేణి బొగ్గుగనుల ప్రాంతాలతో విడదీయరాని బంధం ఏర్పాటయ్యింది.

పోలీస్ యాక్షన్‌తో నిజాం సంస్థానం భారతదేశంలో విలీనం కావడం, ఆ తరువాతి క్రమంలో తెలంగాణ ప్రత్యేక అస్తిత్వాన్ని కుటిల బుద్ధితో రద్దు చేసి ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పాటు చేయడంలాంటి పరిణామాలు సింగరేణిపై తీవ్రమైన ప్రభావాన్ని చూపించాయి. ఉమ్మడి రాష్ట్రంలో ప్రాంతేతరుల రాజకీయ ఆధిపత్యం ప్రారంభమయ్యింది. తెలంగాణ వనరులపై వలసపాలకుల కన్నుపడింది. దక్షిణ భారతదేశం మొత్తంలో కేవలం తెలంగాణ ప్రాంతంలో మాత్రమే లభ్యమయ్యే నేలబొగ్గు వారిని ఆకర్షించింది. వనరుల దోపిడీకి దారులు వెతికారు. ఉభయ గోదావరి జిల్లాలతో పాటుగా కృష్ణా, గుంటూరు జిల్లాల నుండి కొత్తగూడెం ప్రాంతానికి వలసలు ప్రారంభమయ్యాయి. విధివిధానాలను రూపొందించే అధికారంతో పాటు, ఆ విధానాలను అమలు జరిపే అధికార యంత్రాగం కూడా ప్రాంతేతరులదే కావడంతో సింగరేణి బొగ్గుగనుల ప్రాంతాన్ని ఒక అంతర్గత వలస దోపిడీ కేంద్రంగా మార్చడం వారికి మరింత సుళువయ్యింది. సింగరేణిలో క్లర్కులుగా ఉద్యోగంలో చేరిన ప్రాంతేతరులు తమకున్న ఆంగ్లభాషా పరిజ్ఞానంతో పాలనాధికారులుగా ఎదిగారు. తమవారికి ఆశ్రయం ఇచ్చి శ్రమతో సంబంధంలేని ఉద్యోగాల్లో చోటు కల్పించారు. అంతవరకూ బెంగాల్, బీహార్ ప్రాంతాలకు చెందిన గని అధికారుల స్థానంలో నెల్లూరు, గూడూరు ప్రాంతాలలో నెలకొల్పిన మైనింగ్ ఇంజనీరింగ్ కాలేజీలలో పట్టాలు పుచ్చుకున్న రాయలసీమ, ఆంధ్రా ప్రాంతాలకు చెందిన వారు నిండిపోయారు. తెలంగాణ ప్రాంతంలోని ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో 120 సంవత్సరాలుగా బొగ్గును వెలికితీస్తున్నప్పటికీ ఇటీవలి కాలందాకా కనీసం ఒక్క మైనింగ్ ఇంజనీరింగ్ కళాశాలను సైతం నెలకొల్పలేదు. సింగరేణిలో పనిచేస్తున్న కార్మిక సంఘాలకు సైతం ఆంధ్రా ప్రాంతానికి చెందిన వారే ఎక్కువ సంఖ్యలో నాయకత్వం వహిస్తూ రావడం యాధృచ్ఛికం ఎంతమాత్రమూ కాదని గ్రహించాలి.

సంస్కరణల పేరుతో అనుభవంలోకి వచ్చిన మార్పులను తట్టుకునేందుకుగానీ, పూర్తిగా ఎదురునిలిచేందుకుగానీ ఈ నయాకార్మికవర్గానికి సాధ్యంకాని పరిస్థితుల్లోకి నెట్టివేయబడినారు. ఉత్తర తెలంగాణ జిల్లాలకు చెందిన కనీసం యాభయిలక్షల కుటుంబాలు ఈ సంక్షోభాన్ని ప్రస్తుతం ఎదుర్కొంటున్నాయి. వామపక్ష కార్మికోద్యమాల వైఫల్యాలు కూడా ఇందుకు దోహదం చేసాయి. ముఖ్యంగా సింగరేణి గని కార్మికవర్గానికి కరదీపికగా నిలిచిన సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస)లాంటి విప్లవ కార్మిక సంఘాలను నిలువరించడంలో గడచిన పది సంవత్సరాలుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేక దృష్టితో పనిచేసాయి. ఇందులో భాగంగా యాజమాన్యాలు అనేకరకాలైన ఆధునిక పద్ధతులను అమలులోకి తీసుకువచ్చాయి. ఉత్పత్తి లక్ష్యాలను చేరుకునే పేరుతో అండర్‌గ్రౌండ్ బొగ్గుగనుల్లో కార్మికులమీద పనిభారం అంతకంతకూ పెంచివేసారు. దిగువశ్రేణి అధికారవర్గానికి ప్రోత్సాహకాలను ఎరగా వేసి కిందిస్థాయి కార్మికులపై ఒత్తిడిని తీవ్రతరం చేసారు. సింగరేణిలో ఇప్పటికే పదమూడుసార్లు ఇట్లాంటి స్వచ్ఛంద పదవీ విరమణ పథకాన్ని అమలుజరిపి, దాదాపు 25వేలమంది కార్మికులను నిర్బంధంగా తొలగించివేసారు. గనికార్మికుల జీవితాలను ఒక నిర్వేదం ఆవరించుకుపోయింది. ఈ పరిణామాలు కుటుంబ జీవనంపై తీవ్రమైన ప్రభావాన్ని చూపాయి. సింగరేణి గని కార్మికులు సామూహిక వ్యక్తీకరణకు దూరమయ్యారు. ఒంటరితనంతో లోలోపల కుమిలిపోతున్నారు. ఇట్లా సింగరేణిలో గడచిన పదిసంవత్సరాలుగా అమలులోకి వచ్చిన సంస్కరణల పర్యవసానంగా గని కార్మికులు తీవ్రమైన మానసిక ఒత్తిడులకులోనై, యాంత్రికమైన జీవనవిధానంలోకి నెట్టివేయబడి, చివరకు తామే ఒక యంత్రపరికరంగా మారిపోయారు. ఇవ్వాళ సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతాలలో ప్రతినిత్యం వెలుగులోకి వస్తున్న ఆత్మహత్యల పరంపర ఇందుకు ఒక సూచిక మాత్రమే!

ఈ నేపథ్యంలోనే సింగరేణి బొగ్గుగనులనుండి తెలంగాణ ప్రజలను శాశ్వతంగా తొలగించే కుట్రపూరిత వైఖరి ప్రారంభమయ్యింది. ఎన్టీ రామారావు నాయకత్వంలోని తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత సింగరేణి కోల్‌బెల్ట్‌ను ఒక పూర్తి స్థాయి 'అంతర్గత వలస దోపిడీ కేంద్రం'గా మార్చివేసేందుకు శ్రీకారం చుట్టారు. స్వల్ప వ్యవధిలో ఎక్కువ మోతాదులో బొగ్గు ఉత్పత్తిని సాధించే 'ఓపెన్‌కాస్ట్' గనులు ప్రారంభించారు. శ్రమశక్తి ప్రధాన ఆధారంగా నడిచే అండర్‌గ్రౌండ్ గనులను ఒక్కొక్కటిగా మూసివేసారు. కార్మికులు ఎన్నో పోరాటాలతో సాధించుకున్న హక్కులను కూడా ఒక్కొక్కటిగా హరించివేశారు. సంఘాలను కుదించారు. సమ్మెలను నిషేధించారు. ప్రశ్నించిన కార్మికులను వేధింపులకు గురిచేసారు. కార్మిక సంఘాలు బలహీనం కావడంతో సింగరేణిగని కార్మికవర్గం దిక్కుతోచని స్థితిలో కొట్టుమిట్టాడింది. తమ కోసం ప్రాణాలను త్యాగం చేసిన 'సికాస' నాయకత్వాన్ని వెంటాడి, వేటాడి మట్టుబెట్టారు. విప్లవ కార్మికోద్యమంపై ఉక్కుపాదం మోపారు. మొత్తంగా సింగరేణి గని కార్మికులకు నాయకత్వం

లేకుండా అణచివేశారు.

ఇదే క్రమంలో బొగ్గు ఉత్పత్తి ప్రక్రియలో పెనుమార్పులకు శ్రీకారం చుట్టారు. అండర్‌గ్రౌండ్ గనుల్లో పెద్ద ఎత్తున భారీ యంత్రాలను ప్రవేశపెట్టారు. ఓపెన్‌కాస్ట్ గనులను చేపట్టారు. తెలంగాణ పల్లె ప్రజలకు బొగ్గుగనులతో పెనవేసుకున్న పేగుబంధాన్ని తెంచివేసారు. మరోవైపున ఓపెన్‌కాస్ట్ గనులకోసం కోల్‌బెల్ట్‌లోని పచ్చని పంటపొలాలను ఆక్రమించుకున్నారు. పునరావాసం, నష్టపరిహారం చెల్లించడంలో ఎలాంటి విధానాలను అమలుపరచకుండా ప్రజలను బిచ్చగాళ్లుగా మార్చివేశారు. పర్యావరణాన్ని దెబ్బతీసి కోల్‌బెల్ట్ ప్రాంతంలోని పల్లెలను ఓపెన్‌కాస్ట్ బొందలగడ్డలుగా మార్చివేశారు. ఇక్కడ ఉత్పత్తి చేస్తున్న బొగ్గును ఇతర ప్రాంతాలకు నిరాటంకంగా తరలించుకుపోతున్నారు. బొగ్గుమీద ఆధారపడిన స్థానిక పరిశ్రమలను ఒకొక్కటిగా బలహీనం పరచి మూసివేశారు. ఉపాధి, ఉద్యోగ అవకాశాలను పూర్తిగా కొల్లగొట్టారు. సింగరేణి బొగ్గును అమ్మడం ద్వారా వస్తున్న లాభాలను ఈ ప్రాంత ప్రజల సంక్షేమానికిగానీ, ఈ ప్రాంత అభివృద్ధికిగానీ ఏ మాత్రం వినియోగించలేదు. లాభాలను ఇతర ప్రాంతాల అభివృద్ధికి తరలించారు.

ఇంకోవైపున కోల్‌బెల్ట్ ప్రాంతాలకు కార్పొరేట్ విద్యాసంస్థలు పెద్దసంఖ్యలో ప్రవేశించాయి. స్థానికంగా గని కార్మికుల పిల్లలు నిర్వహిస్తున్న ప్రైవేట్ పాఠశాలలు మూసివేసే స్థితికి నెట్టివేసారు. వేలాదిమంది విద్యావంతులైన ప్రైవేట్ ఉపాధ్యాయులు తాము రూపొందించుకున్న స్వయం ఉపాధికి సైతం దూరమయ్యారు. బొగ్గు గనులపై కార్మికులు నెలకొల్పుకున్న తెలంగాణ సంస్కృతిని విధ్వంసం చేశారు. కార్మికుల పిల్లలకు ఉన్నత విద్యావకాశాలు అందకుండా కుట్రపూరితంగా కోల్‌బెల్ట్ ప్రాంతాలలో ఉన్నత విద్యావకాశాలు లేకుండా చేశారు. కార్మికులు కష్టపడి, చెమటోడ్చి సంపాదించుకున్న వేతనాలను సైతం కార్పొరేట్ వైద్యం, విద్య పేరిట ప్రాంతేతరులే తన్నుకుపోయారు. ఓపెన్‌కాస్ట్ గనుల్లో ఓవర్‌బర్డెన్ తీసే పనిలో కొద్దిమంది ఆంధ్రా కాంట్రాక్టర్లే రింగుగా ఏర్పడి ఏకఛత్రాధిపత్యాన్ని చెలాయిస్తున్నారు. డెబ్బై వేలమంది గనికార్మికుల మొత్తం జీతభత్యాలకంటే, ఆరుగురు ఆంధ్రా కాంట్రాక్టర్లే ఎక్కువ బిల్లులు పొందుతున్నారు.

ఒక వైపున సింగరేణిలో ఉత్పత్తి అవుతున్న బొగ్గును తరలించుకుపోతూ, పరోక్షపద్ధతుల్లో విద్యా, వైద్యం పేరుతో కార్మికుల వేతనాలను ఎగరేసుకుపోతూ, మరోవైపున బొగ్గును వెలికితీసే క్రమంలోనూ స్థానిక ప్రజల ప్రమేయం లేకుండా చేసి ఉద్యోగ, ఉపాధి అవకాశాలకు గండికొట్టి ఆంధ్రాకాంట్రాక్టర్లకు ధారాదత్తం చేసి, మొత్తంగా సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతాన్ని పూర్తిస్థాయి అంతర్గత వలస దోపిడీ కేంద్రంగా వలసపాలకులు మార్చివేసారు. ఈ పరిణామాలన్నింటినీ తెలంగాణ ప్రాంతానికి చెందిన రాజకీయ నాయకులు, పార్టీలు మౌనంగా ప్రేక్షకపాత్రకు పరిమితమయ్యాయి. వెన్నెముకలేని తెలంగాణ రాజకీయ నాయకత్వం వలసపాలకుల మోచేతినీళ్లకు అలవాటు పడటం ఈ ప్రాంత ప్రజలకు శాపంగా మారిపోయింది. దక్షిణ భారతదేశంలో కేవలం తెలంగాణ ప్రాంతంలో మాత్రమే లభ్యమయ్యే నేలబొగ్గును వేగవంతంగా తరలించుకుపోయే కుట్ర ప్రస్తుతం అమలు జరుగుతున్నది.

ఓపెన్‌కాస్ట్ భూనిర్వాసితులు ప్రస్తుతం చేస్తున్న ఆందోళనకు ఈ నేపథ్యాలన్నీ పునాదిగా పనిచేస్తున్నాయనే వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించవలసి ఉన్నది. స్థానిక వనరులపై స్థానిక ప్రజల ఆధిపత్యం కోసం జరుగుతున్న పోరాటంగా ఈ ఉద్యమాన్ని గుర్తించవలసి ఉన్నది. నిర్వాసితులు నిర్వహిస్తున్న ఉద్యమాన్ని కేవలం ఓపెన్‌కాస్ట్ గనుల వ్యతిరేక ఉద్యమంగా చిత్రీకరిస్తూ కొందరు స్వార్థపర శక్తులు, తమ రాజకీయ లబ్ధికోసం నాటకీయంగా నిర్వహిస్తున్న 'ఉత్తుత్తి ఉద్యమాల' పట్ల అప్రమత్తంగా ఉండవలసిన అవసరం ఉన్నది. సింగరేణి పరిరక్షణ కోసం జరుగుతున్న వర్తమాన ఉద్యమాలు తెలంగాణ వనరుల దోపిడీకి వ్యతిరేకంగానూ, ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సాధనకోసమూ జరుగుతున్న ఉద్యమంలో అంతర్భాగమనే సోయితో మెదలవలసిన బాధ్యత తెలంగాణ వాదులందరిపైనా ఉన్నది.

## అసిత్ కుమార్ సేన్‌గుప్తను, ఇతర రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి!

'ఎ వరల్డ్ టు విన్' (ఇంగ్లిష్), 'జీత్ నే కే లియే హై పూరీ దునియా' (హిందీ) పత్రికల సంపాదకుడు, ఇంగ్లిష్, హిందీ, మలయాళంలలో ఇరవైకి పైగా పుస్తకాలు ప్రచురించిన 'పూర్వయా ప్రకాశన్' అధినేత, స్ట్రగుల్ ఇండియా సంస్థ ప్రధాన కార్యదర్శి అసిత్ కుమార్ సేన్‌గుప్త 2008 జనవరి 22 నుంచి ఛత్తీస్‌ఘడ్ పోలీసుల అక్రమ నిర్బంధంలో ఉన్నారు. ఆరోజున ఆయన ఇంటిపై దాడి చేసి పత్రిక ప్రతులు, ఇతర పుస్తకాలు, ఆయన సొంత గ్రంథాలయంలోని పుస్తకాలు, కంప్యూటర్ ఎత్తుకు పోయిన పోలీసులు రెండు రోజుల పాటు ఆయనను అక్రమ నిర్బంధంలో ఉంచి ఆ తరువాత నిషిద్ధ భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు)తో ఆయనకు సంబంధాలు ఉన్నాయని నేరం ఆరోపించి జైలులో పెట్టారు. అరవయో పడిలో ఉన్న అసిత్ కుమార్ సేన్‌గుప్త 1967లో నక్సల్బరీ రాజకీయాలతో ప్రభావితమయి అప్పటినుంచీ సాంస్కృతిక రంగంలో కృషి చేస్తున్నారు. సాహిత్యం, నాటకం, ప్రచురణ, పత్రికా రచన రంగాలలో ఆయన కృషి అందరికీ తెలిసిందే. ఆయన రాసిన కథలూ, నాటికలూ, వ్యాసాలూ బెంగాలీ, హిందీ, ఇంగ్లిష్‌లలో ఎన్నో పత్రికలలో అచ్చయ్యాయి. ఆయన నాటికలను ఢిల్లీలోని నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా ప్రదర్శిస్తోంది. ఆయన అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి ఏర్పాటులో కీలకమైన పాత్ర వహించి ఎన్నో సంవత్సరాలు ఆ సంస్థకు కార్యవర్గ సభ్యులుగా ఉన్నారు. సిఆర్‌సి, సిపిఐ (ఎంఎల్) ప్రచురించిన హిందీ పత్రిక 'రాష్ట్రీయ ముక్తి' కి, ఇంగ్లిష్ పత్రిక 'మాస్‌లైన్'కు సంపాదకులుగా పనిచేశారు. ఛత్తీస్‌ఘడ్‌లో సాల్వాజుడుం నాయకత్వంలో ప్రభుత్వం ప్రశ్నించేవారందరి మీద ప్రారంభించిన దాడిలో భాగంగానే, డాక్టర్ బినాయక్ సేన్‌ను నిర్బంధించినట్టు గానే అసిత్ కుమార్ సేన్‌గుప్తాను కూడా తప్పుడు ఆరోపణలతో జైలు పాలుచేసి రెండు సంవత్సరాలుగా బెయిల్ నిరాకరిస్తోంది. ఆయనను తక్షణమే బేషరతుగా విడుదల చేయాలని, అలాగే దేశవ్యాప్తంగా జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీలందరిని విడుదల చేయాలని పోరాడవలసిందిగా స్ట్రగుల్ ఇండియా ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తోంది. ఈ పోరాటానికి ఆర్థికంగా, హార్దికంగా సహకరించవలసిందిగా విజ్ఞప్తి.

- ఎం.ఎన్. రావున్ని,
తాత్కాలిక ప్రధాన కార్యదర్శి, స్ట్రగుల్ ఇండియా,
ముండూర్, పాలక్కాడ్ జిల్లా, కేరళ. ఫోన్: 9249713184

శ్రమ చేసే వారికి పనిలేకుండా చేసి, ప్రశ్నించేవారిని లేకుండా చేసి, కాంట్రాక్టర్ల లాభాలే ధ్యేయంగా సాగుతున్న ఓపెన్ కాస్ట్ విధ్వంసాన్ని వివరిస్తున్నారు **పి. చంద్**

# సింగరేణి - స్థానికుల అస్తిత్వ పోరాటం

సింగరేణిలో ప్రస్తుతం పెల్లుబుకుతున్న ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటం గత కొద్ది సంవత్సరాలుగా సింగరేణిలో చోటుచేసుకుంటున్న దుష్పరిణామాల నేపథ్యంలో అనివార్యంగా చోటుచేసుకున్న పరిణామం.

దేశంలో నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు ప్రభుత్వ ఎజెండాగా మారిన తరువాత ప్రభుత్వరంగ పరిశ్రమలకు గడ్డుకాలం వచ్చింది. క్రమంగా ప్రభుత్వరంగ పరిశ్రమలు తమ అస్తిత్వాన్ని కోల్పోతూ ప్రైవేట్ రంగ సంస్థల చేతుల్లోకి పోతున్నాయి. ఇందుకు ప్రభుత్వరంగ బొగ్గు సంస్థలు కూడా మినహాయింపుకాదు.

దేశ వ్యాపిత మిగతా ప్రభుత్వరంగ బొగ్గు సంస్థలకు సింగరేణికి కొన్ని తేడాలున్నాయి. ముఖ్యంగా కార్మికవర్గ పోరాటాల విషయంలో సింగరేణికి ఒక ప్రత్యేకత ఉంది. సింగరేణిలో కార్మికోద్యమం మహత్తర తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట నేపథ్యంలోనే ఆవిర్భవించి ఆ పోరాటంతో ముడివడింది. సింగరేణిలో మొట్టమొదటగా సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్ స్థాపించిన ధేవూరి శేషగిరిరావు యూనియన్ స్థాపించిన కొద్ది సంవత్సరాలకే తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో పాల్గొంటూ నిజాం పోలీసులకు చిక్కి అమరుడైనాడు. సాయుధ పోరాట విరమణానంతరం చాలకాలం పాటు వామపక్ష కార్మిక సంఘాలదే ప్రధాన పాత్రగా కొనసాగింది. అయితే అటు తరువాత కాలంలో వామపక్ష కార్మిక సంఘాలు అవకాశవాద, అవినీతి, మితవాద వైఖరుల్లో కూరుకపోయి, కార్మికరంగంలో తాము సాధించాల్సిన లక్ష్యాలకు దూరమైనవి.

ట్రేడ్ యూనియన్ రంగంలో 'ట్రేడ్' తప్ప యూనియన్ కార్యకలాపాలు అంతరించి పోవటం, ఎమర్జెన్సీనాటికి మరింత దిగజారి కార్మికుల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోయాయి. ఆ నేపథ్యంలోనే కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు పెల్లుబుకడం ఆ పోరాటాల ప్రభావంతో సింగరేణిలో మరో విప్లవ వెల్లువ ఏర్పడింది. ఎమర్జెన్సీ తరువాత ఈ వెల్లువ నిర్మాణ రూపం సంతరించుకొని సింగరేణి కార్మిక సమాఖ్య వంటి విప్లవకర ట్రేడ్ యూనియన్‌గా అవతరించింది. కార్మికుల్లో నూతన చైతన్యాన్ని, పోరాట సంప్రదాయాన్ని నెలకొల్పింది. సికాస నాయకత్వంలో సింగరేణిలో మస్టర్ల కోత చట్టం వంటి నల్ల చట్టాలకు వ్యతిరేకంగానూ, వేజుబోర్డుల సాధనల విషయంలోనూ, కార్మికుల రోజువారి సమస్యలపైకాని అనేక పోరాటాలు వెల్లువెత్తాయి. ఈ పోరాట ఉధృతి దాదాపు తొంబై ఐదు వరకు సాగింది. అందుకే సింగరేణిలో నూతన ఆర్థిక విధానాలు 1997 నుండి కాని తీవ్రరూపం దాల్చలేదు.

సంస్కరణలు అమలు జరిపేందుకు సింగరేణి కార్మికుల్లో అపార పలుకుబడికలిగిన సికాసను నిషేధించారు. సికాస కార్యకర్తల మీద తీవ్ర నిర్బంధం అమలు జరిపి దాని కార్యకర్తలను దాదాపు నలబై మందిని బూటకపు ఎన్‌కౌంటర్లో కాల్చి చంపారు. సికాస ఉద్యమాన్ని అణిచివేశారు. మరోవైపు అంతకుముందు కార్మికుల ఆగ్రహానికి గురైన జాతీయ కార్మిక సంఘాలను 'గుర్తింపుసంఘం' గా ఎన్నికల పేరు మీద అధికారంలో కూచుండబెట్టి, సంస్కరణల అమలును తీవ్రతరం చేశారు. ఇవ్వాళ సింగరేణి సంస్థ పేరుకు ప్రభుత్వరంగ సంస్థగా మిగిలిపోయింది. ఉత్పత్తిలో 70 శాతం వాటా ప్రైవేట్ సంస్థలు, కాంట్రాక్టర్లే నిర్వహించే స్థాయికి చేరుకుంది. ఫలితంగా ఇవ్వాళ సింగరేణిలో కార్మికులు సమ్మెచేస్తే ఉత్పత్తులు ఆగిపోయ్యే పరిస్థితి లేదు. కాంట్రాక్టర్లు సమ్మెచేస్తే బొగ్గు ఉత్పత్తులు నిలిచిపోయే పరిస్థితి ఏర్పడింది. సంస్థలో అంతర్గత ప్రైవేటీకరణ తీవ్రరూపం దాల్చటమేకాకుండా గోదావరి పరీవాహక ప్రాంతంలో కాపిటివ్ మైన్స్ కింద బొగ్గు బ్లాకులను ప్రైవేట్‌పరం చేయటం కూడా ఎక్కువైంది. సింగరేణి సంస్థ నూతనంగా ఆరంభించిన గనుల్లో ఉత్పత్తి ప్రక్రియ మొత్తంగా జాతీయ, అంతర్జాతీయ బడాసంస్థలకు ఔట్ సోర్సింగ్ చేయటంద్వారా, భవిష్యత్‌లో సింగరేణిలో ఉపాధి అవకాశాలు కూడా లేకుండాపోయాయి.

దేశంలో మిగతా ప్రాంతంలో ప్రైవేట్ బొగ్గు సంస్థలు ఆరంభమైనట్టుగా సింగరేణిలో ఆరంభం కాకపోవడానికి కారణం సింగరేణి కార్మికుల పోరాట సంప్రదాయమే. ఇంతవరకు జరిగిన ప్రైవేటీకరణ ప్రక్రియ మొత్తం కూడా 'సింగరేణి సంస్థ' పేరు మీద అంతర్గత ప్రైవేటీకరణ కొనసాగింది తప్ప, ప్రైవేట్ సంస్థలు నేరుగా ఉత్పత్తులు ఆరంభించలేదు. వై.ఎస్. నాయకత్వంలో ప్రభుత్వం ప్రైవేట్ సంస్థలచే బొగ్గు ఉత్పత్తి చేసే ప్రక్రియ కొనసాగించేందుకు కంకణబద్ధమైంది.

వై.ఎస్. అధికారంలోకి వచ్చిన తరువాత అంతర్గత ప్రైవేటీకరణ వేగవంతమైంది. అంతకు ముందు ఓపెన్ కాస్ట్ గనుల్లో ఓవర్ బర్డెన్, మట్టితీసే పనులకే పరిమితమైన ప్రైవేటీకరణ – ఓపెన్‌కాస్ట్ గనుల్లో మొత్తం పనులన్నీ ఔట్‌సోర్సింగ్ చేసింది. అంతో ఇంతో ఉపాధి కల్పించి నూతన అండర్‌గ్రౌండ్ గనులను కూడా ప్రైవేట్ సంస్థలకు ఔట్ సోర్సింగ్ చేశారు. వీటికి తోడుగా సంస్థ చేతిలో ఉన్న అండర్ గ్రౌండ్ గనుల్లో ప్రైవేట్ ఆధునిక యంత్రాలు ప్రవేశపెట్టి సంప్రదాయక తట్టా, చమ్మాస్

పని విధానానికి స్వస్తిచెప్పి కార్మికులకు పనులు లేకుండా చేశారు. ఇట్లా మిగులుబాటు అయిన కార్మికులను రకరకాలుగా వేధించి, వి.ఆర్.ఎస్‌ల పేరుమీద రిట్రించ్‌మెంట్ చేయడం పెద్ద ఎత్తున సాగుతున్నది. సంస్థల్లో ప్రైవేటీకరణ పెరిగిపోయిన కొలది పర్మినెంట్ కార్మికుల స్థానంలో కాంట్రాక్ట్ కూలీలు వచ్చి చేరటం ఎక్కువైంది.

సింగరేణికి, తెలంగాణ ప్రాంతానికి మొదటి నుండి అవినాభావ సంబంధం ఉంది. సింగరేణి సంస్థ నిజాం ఏలుబడిలో ఉన్నంతకాలం ఇక్కడ తవ్వి తీసిన బొగ్గు ఈ ప్రాంత ప్రజల అభివృద్ధికి ఖర్చుచేయటానికి జరిగింది. పరిమిత స్థాయిలో బొగ్గు ఉత్పత్తి జరగటం వల్ల పర్యావరణ విధ్వంసం కూడా పరిమితంగానే ఉండేది. దానికితోడు అప్పటికి బొగ్గు ఉత్పత్తిలో మానవ శ్రమదే ప్రధాన పాత్రగా ఉండటంవల్ల బొగ్గు గనుల కింద నిర్వాసితులైన వారికి సింగరేణిలో ప్రత్యామ్నాయంగా ఉపాధి దొరికి ఆ విధంగా ఒక సమతుల్యం ఏర్పడింది.

ఎప్పుడైతే ఆంధ్రరాష్ట్రం ఏర్పడిందో అప్పుడిక రాష్ట్రపరిధి పెరిగింది. పెరిగిన రాష్ట్ర అవసరాలకు అనుగుణంగా బొగ్గు ఉత్పత్తులు పెంచాల్సివచ్చింది. ఫలితంగా కొత్త ప్రాంతాలకు బొగ్గు గనులు విస్తరించాయి. ఉత్పత్తులు అధికమయ్యాయి. ఇట్లా ఉత్పత్తి చేసిన బొగ్గును ఉమ్మడి రాష్ట్రం పేరుమీద తరలించుకపోయి ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలో విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు చేశారు. దానికి తోడు బొగ్గు వ్యాపార సరుకైపోయి ఇతర రాష్ట్రాలకు అమ్మిన బొగ్గు సంపద రాష్ట్ర ఖజానాకు చేరుకోగా ఆ నిధులను ఉమ్మడి రాష్ట్రం పేరుమీద బొగ్గుగని ప్రభావిత గ్రామాల అభివృద్ధిని ఎండగట్టి ఆంధ్ర, రాయలసీమ అభివృద్ధికి వెచ్చించడం ఆంధ్ర పాలకుల సంప్రదాయంగా మారింది. ఈ విధంగా ప్రతి సంవత్సరం దాదాపు పదివేల కోట్ల బొగ్గు సంపద ఈ ప్రాంతం నుండి తరలిస్తున్నారు. ఆ లెక్కన ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఎన్ని లక్షల కోట్ల విలువచేసే బొగ్గుసంపద ఈ ప్రాంతం నుండి తరలించారో అర్థం చేసుకోవచ్చు. ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు జరుగుతున్న అనేకానేక అన్యాయాల్లో తెలంగాణ బొగ్గు సంపద తరలింపు కూడా ఒకటి.

వై.ఎస్ అధికారంలోకి వచ్చిన మరు సంవత్సరమే కోల్ గ్యాస్‌ఫికేషన్, మిథేన్ గ్యాస్ ఉత్పత్తి పేరుమీద జాతీయ, అంతర్జాతీయ బహుళ జాతి సంస్థలకు అటు తూర్పున 750 కి.మీ. పరిధిలో, ఇటు దక్షిణాన 350 కి.మీ. పరిధిలోని బొగ్గు నిల్వలను ప్రైవేట్ సంస్థలకు ధారాదత్తం చేస్తూ ఒప్పందాలు చేసుకున్నారు. ఇట్లా పై రెండు ఒప్పందాల్లోనే ఈ ప్రాంతంలోని నాల్గవ వంతు బొగ్గునిల్వలను ప్రైవేట్ సంస్థలకు అప్పగించారు. అంతర్గత ప్రైవేటీకరణను తీవ్రతరం చేయడమే కాకుండా నూతనంగా వచ్చే ఇరవై రెండు ఓపెన్‌కాస్ట్ గనులను, పన్నెండు అండర్ గ్రౌండ్ గనులను ఔట్ సోర్సింగ్ చేయడం ద్వారా, ఈ ప్రాంతంలోని బొగ్గు నిల్వలను వీలైనంత తక్కువ కాలంలో కాజేయటం లేదా ప్రైవేట్ రంగానికి అమ్మివేయటం అనే రెండు రకాల కుట్రలను ఏకకాలంలో అమలు జరిపారు. రాష్ట్రంలోని ప్రజావ్యతిరేక విధానాలకు కేంద్ర ప్రభుత్వ ఆర్థిక విధానాలు తోడైనవి. దాంతో ఈ ప్రాంత ప్రజల్లో కల్లోలం రేగింది. ప్రస్తుతం కొనసాగుతున్న ఓపెన్‌కాస్ట్‌ల వల్ల భూములు పోయి బతుకుపోయి, ఊళ్లకు ఊళ్లు మట్టిదిబ్బలుగామారటం ఓపెన్‌కాస్ట్ గనుల కింద భూమి సెకరించే క్రమంలో అనేక అన్యాయాలు, అవినీతి, వివక్షలు చోటు చేనసుకోవడం, భూసేకరణ సమయంలో కంపెనీ ఇచ్చిన వాగ్దానాలు ఏమీ ఆచరణకు నోచుకోకపోవడం, నిర్వాసితులకు ఇచ్చే ఉద్యోగాలు బందుకావడం వంటి పరిణామాలను గ్రహించిన ఈ ప్రాంత ప్రజలు రేపు తమ భవిష్యత్ కూడా అలాగే మారుతుందని గ్రహించి వ్యతిరేకించటం మొదలైంది. ఇట్లా చిన్నగా మొదలైన వ్యతిరేకత ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో ఓపెన్‌కాస్ట్ గనులు నూతనంగా ఆరంభించిన చోటికల్లా పాకిపోయి మహోద్యమంగా మారింది.

అయితే ఈ పోరాటాన్ని నయానా భయానా అణిచివేసి ఎట్లాగైన ఓపెన్‌కాస్ట్‌లు ఆరంభించాలని వై. ఎస్ ప్రభుత్వం సంకల్పించి పావులు కదుపుతున్నది. ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమకారులు అయా ప్రాంతాల్లోకి పోకుండా అడ్డంకులు సృష్టించడడం, స్థానిక ప్రజలను నయాన భయాన లొంగదీసుకోవటం ప్రజల్లో ఉండే బలహీనతలను ఆసరగా తీసుకొని విభేదాలు సృష్టించటం వంటి చర్యలనే కాకుండా నిర్బంధం తీవ్రతరం చేయటంద్వారా ఉద్యమాన్ని అణిచి వేసేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. ఇప్పుడు ఉద్యమాన్ని అణిచివేయకుంటే రాబోయే కాలంలో మరో 70 ఓపెన్‌కాస్ట్‌లు ప్రైవేట్ రంగంలో రావాల్సినవి రాకుండా పోతాయి. అందుకే ఉద్యమం మొగ్గలోనే తుంచి వేయాలనే ప్రయత్నాలను ఆరంభించింది. పోలీసు బలగాలను పెద్దఎత్తున మోహరిస్తూనే మరోవైపు కాంగ్రెస్ నాయకులను, మంత్రులను రంగంలోకి దింపింది. దేశ అభివృద్ధికోసం బొగ్గు తవ్వకాలు అనివార్యం అంటూనే, మరోవైపు నష్టపరిహారం విషయంలో న్యాయం జరిగేలాచూస్తాం అంటూ సన్నాయి నొక్కులు నొక్కుతుంది. పాతికేండ్లుగా సింగరేణిలో ఓపెన్‌కాస్ట్‌లు ఆరంభమై కూడా అప్పటి నుండి ఇప్పటి వరకు నిర్వాసితులకు నష్టపరిహారం రాక కోర్టులచుట్టూ తిరుగుతూ ఉంటే చీమకుట్టినట్టయినా స్పందనలేని నాయకమాన్యులు ప్రజలు వాస్తవాలు తెలుసుకొని, తమ మనుగడ కోసం చావో, రేవో తేల్చుకోదలుచుకుంటే వాళ్ల ఉద్యమాన్ని నీరుకార్చడానికి సిద్ధపడ్డారు. ఇటువంటి మోసాలకు బలైతున్న నిర్వాసితులకు తీరని అన్యాయం జరుగుతోంది. భవిష్యత్‌లో ఈ బీభత్సకాండ మరింత పెద్ద ఎత్తున కొనసాగుతోంది.

అందుకే ఇవ్వాళ సింగరేణిలో జరుగుతున్న ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటం అంటే, దేశ సహజ సంపదలు స్థానికులకు చెందకుండా చేసి జాతీయ అంతర్జాతీయ దోపిడి దొంగలకు కట్టబెట్టే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడటం. వారితో అంటకాగుతూ, తెలంగాణ బొగ్గు సంపదను వీలైనంత తక్కువ కాలంలో కాజెయ్యాలని, లేదా అమ్మివేయాలని చూస్తున్న ఆంధ్ర, వలస పాలకుల కుట్రలకు వ్యతిరేక పోరాటం. ఇవ్వాళ ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక పోరాటమంటే పర్యావరణ పరిరక్షణకోసం. ఈ భూమి మీద భవిష్యత్ తరాలు బతకాలనే భరోసా ఇవ్వాలనే న్యాయ బద్ధమైన పోరాటం. ఇది మనిషి మనుగడ కోసం, అస్తిత్వంకోసం మూలవాసులు జరుపుతున్న పోరాటం. అంతిమసారం ప్రపంచీకరణకు వ్యతిరేక పోరాటం. అందుకే ఈ పోరాటంలో మనుష్యులను ప్రేమించేవాళ్లు, ప్రకృతిని, పర్యావరణాన్ని, భూమిని ప్రేమించేవాళ్లు, దోపిడి పీడనలను వ్యతిరేకించేవాళ్లు, ప్రజాస్వామిక వాదులు, ప్రజల పక్షం వహించే మేధావులు, కవులు, కళాకారులు ఓపెన్‌కాస్ట్ వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు మద్దతుగా ఉద్యమించాల్సిన సమయమిది. వీ

**ఓపెన్‌కాస్ట్ బొగ్గు గనులకు వ్యతిరేకంగా సాగుతున్న ఆందోళన కేవలం నిర్వాసితుల ఉద్యమం మాత్రమే కాదనీ, కొద్దిమంది లాభాలే ధ్యేయంగా వస్తున్న అభివృద్ధి నమూనాకు, స్థానిక ఆకాంక్షలకు సంబంధించిన విషయమనీ అంటున్నారు ఎం. కోదండరాం**

# ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమ కీలకాంశాలు

ఓపెన్‌కాస్ట్ బొగ్గుగనులకు వ్యతిరేకంగా సాగుతున్న ఆందోళనను ఒకొక్కక్కరు ఒక్కొక్క కోణం నుండి చూస్తున్నారు. కొందరి దృష్టిలో ఇది కేవలం నిర్వాసితుల ఉద్యమం. సింగరేణి కంపెనీ నష్టపరిహారం సరిగ్గా ఇవ్వడం లేదుకనుక, ఓపెన్‌కాస్ట్ గనుల వలన పర్యావరణ సమస్యలు తలెత్తుతున్నాయి కనుక నిర్వాసితులు ఆందోళన చేస్తున్నారు. సింగరేణి కంపెనీ యాజమాన్యం కూడా ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఆందోళనను నిర్వాసితుల ఉద్యమంగానే చూడదలుచుకున్నది. ఉద్యమం బలంగా నడిస్తే నిర్వాసితులకు నష్టపరిహారం, పర్యావరణ సమస్యలకు పరిష్కారం చూపడానికి కొంతమేరకు కంపెనీ సిద్ధపడవచ్చు. కానీ ఎట్టి పరిస్థితిలోనూ ఓపెన్‌కాస్ట్ పద్ధతులను మాత్రం వదులుకోక పోవచ్చును. ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమాన్ని కేవలం నిర్వాసితుల ఆందోళనగా చూస్తే కొన్ని విషయాలు అర్థం కావు.

1970 నుండి సింగరేణి చాలా వేగంగా బొగ్గుగనులను విస్తరించింది. ఆ క్రమంలో ఎన్నో గ్రామాలు తుడిచిపెట్టుకుపోయినాయి. ఒక్క గోదావరిఖని ప్రాంతంలోనే దాదాపు ఇరవై సింగరేణి ప్రభావిత గ్రామాలున్నాయి. కానీ గతంలో ఎన్నడూ ఇప్పటి వలె సింగరేణికి వ్యతిరేకంగా బలమైన ఉద్యమాలు రాలేదు. కారణాలను వెతుకవలసి ఉన్నది. 1990కి పూర్వం నిర్వాసితులకు కొంతమేరకు ఉద్యోగావకాశాలను కలుగజేసింది. అప్పటికి భూములకు కూడా పెద్దగా విలువలేదు. 1990 నాటికి ఈ భూములలో సాంప్రదాయకంగా పండిస్తున్న ఖుష్కి పంటల విలువకూడా బాగా పడిపోయింది. కనుక సింగరేణి వలన ప్రజలకు మెరుగైన అవకాశాలు కనిపించాయి. 1990లకు వచ్చే సరికి సింగరేణి ప్రాంతాలలో వ్యవసాయమే మారిపోయింది. గోదావరి నుండి మోటార్ల ద్వారా నీళ్లు తోడుకుని సంవత్సరానికి రెండు పంటలు వరి పండిస్తున్నారు. మామిడితోటలు వేసుకున్నారు. వ్యవసాయం నుండి ఆదాయాలు పెరిగాయి. దానితో భూముల విలువలు కూడా పెరిగాయి. సింగరేణి ఇచ్చే నామమాత్రపు నష్టపరిహారానికి భూములు ఇవ్వడానికి ఎవ్వరూ సిద్ధంగా లేరు.

దీనితోపాటుగా మరో రెండు మార్పులు కూడా వచ్చాయి. సింగరేణి కంపెనీ 1992 తరువాత యాజమాన్య పద్ధతులను మార్చుకున్నది. అంతవరకు అండర్‌గ్రౌండ్ గనులకే పరిమితమైన కంపెనీ ఓపెన్‌కాస్ట్‌గనులను ప్రారంభించింది. ఇది యాధృచ్ఛికంగా వచ్చిన మార్పుకాదు. మొదట్లో ఈ పద్ధతులు కార్మికోద్యమానికి జవాబుగా వచ్చినాయి. సింగరేణి కార్మికులు సంఘటితంగా గనిలో ప్రజాస్వామ్య వాతావరణాన్ని పెంపొందించడానికి ప్రయత్నించారు. యాంత్రీకరణ ద్వారా యాజమాన్యం గనులపై గుత్తాధిపత్యాన్ని సాధించడానికి ఉత్పత్తిని పెంచడానికి ప్రయత్నించింది. మెషిన్‌లు వచ్చిన తరువాత, సింగరేణి కార్మికులు సమ్మె చేసినా కొద్దిమంది కార్మికులను బెదిరించి కనీస అవసరాలను తీర్చడానికి కావాల్సిన బొగ్గును ఉత్పత్తి చేయగలిగింది. వనరుల తరలింపు వేగవంతం చేయడానికి,ఉత్పత్తిపై కార్మికుల నియంత్రణను తొలగించడానికే పెట్టుబడిదారీ వర్గం యాజమాన్య పద్ధతులను, సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి పరుస్తుంది. ఓపెన్‌కాస్ట్ గనులతోపాటు అండర్‌గ్రౌండ్ గనులలో యంత్రాల వాడకం పెంచింది. సింగరేణికి గుర్తుగా, కార్మికుల శ్రమకు ప్రతీకగా నిలిచిన తట్టా, చెమ్మాస్ వాడకం తగ్గుతూ వచ్చింది. అందువలన బొగ్గు తవ్వకం వేగంగా పెరిగిపోయింది. ఫలితంగా ప్రభావిత గ్రామాలలో పర్యావరణ సమస్యలు పెరిగిపోయినాయి.

ఇక రెండవ విషయం ఏమిటంటే, సింగరేణిలో 1990 తరువాత నుండి సంస్కరణలు మొదలయ్యాయి. సంస్కరణలను ఆమోదించకపోతే కంపెనీని మూసివేస్తామని బెదిరించడంతో కార్మికులు వ్యతిరేకించ లేకపోయారు. 1990లలో నక్సలైట్ల ఏరివేతపేర ప్రభుత్వం అనుసరించిన నిర్బంధ విధానాల కారణంగా కార్మికులు కూడా సంస్కరణలను ఎదిరించడానికి ధైర్యం చేయలేకపోయారు. సంస్కరణల్లో భాగంగా చాలాపనులను – ఓపెన్‌కాస్ట్‌లో పైమట్టి తొలగించడం, బొగ్గు ట్రాన్స్‌పోర్టు, బొగ్గు సార్టింగ్‌వంటి పనులు కాంట్రాక్టర్లకు దక్కినాయి. అట్లా సింగరేణి విధానాలను ప్రభావితం చేయగల కాంట్రాక్టరు వర్గం ఎదిగింది. యూనియన్ ఎన్నికల నుండి మొదలుకొని చాలా విషయాలలో ఈ వర్గం బలమైన పాత్రను పోషిస్తున్నది. కాంట్రాక్టర్లు స్థానికులెవ్వరినీ ఉద్యోగాలలో పెట్టుకోలేదు. దాదాపు 40వేల మంది బయటివాళ్లే పనిచేస్తున్నారు. దానికి తోడు సింగరేణికి లాభాపేక్ష పెరిగింది. కొత్తగా బొగ్గుగనులకు అనుమతిలివ్వడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు లాభాన్నే ప్రధానమైన ప్రమాణంగా గుర్తిస్తున్నాయి. అందువల్ల సింగరేణి లాభాపేక్షకు చట్టబద్ధత వచ్చింది. ఓపెన్‌కాస్ట్ గనుల వల్లనే లాభం వస్తున్నదని, అందువలన ఆ పద్ధతులనే ఎంచుకుంటున్నామని సింగరేణి అంటున్నది. అట్లా ఓపెన్‌కాస్ట్ గనుల సంఖ్య ఈ పదేళ్లలో బాగా పెరిగిపోయింది. ఓపెన్‌కాస్ట్ గనులతో కాంట్రాక్టర్లకు లాభాలున్నాయి. మెషిన్‌ల కొనుగోళ్లలో అధికారులకు కమిషన్‌లు వస్తాయి. ఈ వర్గాలకు సింగరేణి యాజమాన్యంతో పెరిగిన పరపతి వలన బొగ్గు తవ్వకానికి

ఓపెన్‌కాస్ట్ పద్ధతులే నయమన్న అభిప్రాయం స్థిరపడిపోయింది. అట్లా ఓపెన్‌కాస్ట్‌గనులు, మెషిన్‌ల వాడకం కార్మికులపై నియంత్రణను పెంచడానికి వచ్చినాయి. కాంట్రాక్టర్లు, అధికారుల అవసరాల కొరకు కొనసాగుతున్నాయి. లాభాన్ని పెంచుకునే పేరుతో సింగరేణి ఉద్యోగస్తుల సంఖ్యను కూడా కుదించాలని నిర్ణయించుకున్నది. ఈ పరిస్థితుల వలన బొగ్గు తవ్వకం వేగవంతమైంది. అయితే ఉద్యోగావకాశాలు మాత్రం పెరుగక పోగా తగ్గిపోతూ వచ్చినాయి.

సంస్కరణల కారణంగా సింగరేణి పట్ల ప్రజలలో అంతవరకు ఉన్న అభిప్రాయం మారిపోయింది. కల్పతరువుగా చూసిన సింగరేణిని భూమి మీద పుట్టిన రాచపుండుగా, బతుకును మింగే బకాసురునిగా చూడటం మొదలుపెట్టారు. సింగరేణి ప్రభావిత గ్రామాల ప్రజలు, ఊరూరు తిరిగి సింగరేణికి భూమి ఇవ్వవద్దని దప్పుకొట్టి ప్రచారం చేస్తామంటున్నారు. దీనినిబట్టి సింగరేణి పట్ల నిర్వాసితులలో, ప్రభావిత గ్రామాలలో ఎటువంటి అభిప్రాయం ఉన్నదో గ్రహించవచ్చు. ఈ నేపథ్యంలో ఓపెన్‌కాస్ట్ గనులపట్ల ఇటు నిర్వాసితులలోనూ, అటు కార్మికులలోనూ వ్యతిరేకత బాగా పెరిగిపోయింది.

కార్మికులలో యాంత్రీకరణకు, ఓపెన్‌కాస్ట్‌లకు వ్యతిరేకత ఏర్పడటానికి కారణాలు అర్థమయ్యేఉంటాయి. తట్టా, చెమ్మాస్‌తో పనిచేసినప్పుడు పనిపై కార్మికులకు నియంత్రణఉంటది. కానీ మెషిన్ వచ్చిన తరువాత కార్మికుడు తన అస్తిత్వాన్ని కోల్పోతాడు. మిషన్‌లో భాగమైపోతాడు. అది నడిచినంత సేపు కార్మికుడు పనిచేయాలి. పని ఎట్లా చేయాలో కూడా మెషిన్ నిర్ణయిస్తది. కనుక కార్మికుల ఆరోగ్యం బాగా దెబ్బతింటది. స్వేచ్ఛను కోల్పోతారు. క్రమంగా అధికారుల ఆధిపత్యం వ్యవస్థితమైపోతుంది.

అయితే భౌతిక పరిస్థితులు మారినంత మాత్రాన ఉద్యమం దానంతట అదే పుట్టుకుని రాదు. ఈసారి సింగరేణిలో ఉద్యమం తలెత్తడానికి తెలంగాణ ఉద్యమం బాగా ఊతమిచ్చింది. 1980, 90 దశకాలలో నక్సలైట్ల ఏరివేత పేరుతో ప్రభుత్వం అనుసరించిన విధానాల ఫలితంగా ప్రజాస్వామిక వాతావరణం లేకుండా పోయింది. ఏది మాట్లాడినా భయమే. ఏ రూపాల్లో నిరసన వ్యక్తం చేసినా పోలీసులు వేధించేవారు. ఈ పరిస్థితిలో వచ్చిన తెలంగాణ ఉద్యమం ప్రజాస్వామిక వాతావరణాన్ని విస్తృతపరిచింది. క్రమంగా అనేక సమస్యలపై ఆందోళనలకు అవకాశం ఏర్పడింది. స్థానికులకు వనరులపై అధికారం ఉండాలన్నది తెలంగాణ వాదం మూలసూత్రం. బొగ్గుగని కార్మికుల సమస్యలను, నిర్వాసితుల సమస్యలను తెలంగాణ ఉద్యమం జనబాహుళ్యం సమస్యలుగా మార్చింది. కార్మికులు బొగ్గుతవ్వి సృష్టించిన సంపదలో తెలంగాణకు న్యాయసమ్మతమైన వాటా దక్కాలన్న డిమాండును లేవనెత్తింది తెలంగాణ ఉద్యమమే. సింగరేణి ఓపెన్‌కాస్ట్ పద్ధతులు ఆంధ్ర కాంట్రాక్టర్లకే మేలు చేస్తున్నాయని, స్థానికులకు నీరు, గాలి, నేలవంటి వనరులతో ఉండే సంబంధాన్ని కూడా తెంచివేస్తున్నాయని తెలంగాణ ఉద్యమం స్పష్టం చేసింది. అంతకు మునుపు సేవ్ సింగరేణి కమిటీ ఈ విషయాలను కొంతమేరకు ముందుకు తీసుకువచ్చినా తెలంగాణ ఉద్యమం తలెత్తే వరకు వాటికి విస్తృత ఆమోదం లభించలేదు. సింగరేణి ఓపెన్‌కాస్ట్ గనులను నిలిపివేయాలని, సింగరేణి లాభాలను స్థానిక ప్రజల ఉపాధి అవకాశాలను పెంచడానికి, విద్య, వైద్యం వంటి మౌలిక సదుపాయాలను కల్పించడానికి వాడాలని తెలంగాణ వాదులు విస్తృతంగా ప్రచారం చేశారు. అట్లా తెలంగాణ అంతటా సింగరేణి చర్చనీయాంశ మయింది. సింగరేణి కార్మికులకు, నిర్వాసితులకు బంధువులు పెరిగారు. కార్మికులకు, నిర్వాసితులకు మధ్య ఐక్యతకు తెలంగాణ ఉద్యమం ప్రాతిపదికను తయారుచేసింది.

ఇదీ నేపథ్యం. ఈ పరిస్థితిలో సింగరేణి ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమం బలపడింది. నిర్వాసితులు చేస్తున్న ఆందోళన పత్రికల్లో వస్తున్నది. వాళ్ల సమస్యలు విస్తృతంగా ప్రచారంలోకి వచ్చాయి. కానీ దీనిలో మరొక పాయ కార్మికోద్యమం. కార్మికోద్యమం బలంగా లేదు. స్థానికంగా అనేక రూపాలలో కార్మికుల నిరసన వ్యక్తమౌతున్నది. సరళీకరణ యుగంలో అధికారుల జులుం పెరిగింది. చీటికి మాటికీ నోటీసులు ఇస్తున్నారు. గట్టిగా సమాధానం చెప్పితే ట్రాన్స్‌ఫర్ చేస్తున్నారు. ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా స్థానికంగా నిరసనలు ఉన్నాయి. అవకాశం దొరికినప్పుడల్లా ప్రభుత్వానికి వ్యతిరేకంగా అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. కార్మికులను ఇంకా సంఘటితం చేసే అవకాశం ఉన్నది. అది జరుగక పోవడానికి కార్మిక సంఘాలు నాయకత్వలోపమే కారణం.

మొత్తంగా విషయాలను పరిశీలించినప్పుడు సరళీకరణ నిర్వాసితుల, కార్మికుల సమస్యలకు మూలకారణమైనా, ఆ వర్గాల ఉద్యమాలకు దిశానిర్దేశన చేసింది, బలాన్ని ఇచ్చింది తెలంగాణ ఉద్యమమే. ఈ విషయాలను గమనించినప్పుడు ఓపెన్‌కాస్ట్ పద్ధతులకు వ్యతిరేకంగా విస్తృతమైన, సంఘటితమైన ఉద్యమాన్ని నిర్మించటానికున్న అవకాశాలను చూడగలుగుతాం. ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమం నిర్వాసితుల ఉద్యమం మాత్రమే కాదు. ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమంలో అది ఒక భాగం. ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమం వనరులపైన అధికారాన్ని పొందడానికి జరుగుతున్న విస్తృత ఉద్యమం. ఈ ఉద్యమం విచ్చలవిడి బొగ్గు తవ్వకాలను, ప్రైవేటీకరణ ద్వారా ప్రజా సంపదను ప్రైవేటు వ్యక్తులకు అప్పజెప్పడాన్ని వ్యతిరేకిస్తున్నా, స్థానిక వనరులు స్థానిక ప్రజల వికాసానికి ఉపయోగపడాలని డిమాండ్ చేస్తున్నది. విస్తృతమైన ఉద్యమం మాత్రమే కార్మికుల హక్కులను కాపాడుతూనే, నిర్వాసితుల సమస్యలకు పరిష్కారం, స్థానిక ప్రజల వికాసానికి తోడ్పడగలుగుతుంది. సింగరేణిలో మానవీయమైన పద్ధతులు పెంపొందుతాయి. సింగరేణి ప్రాంతాలలో ఈ దృక్పథంతోనే ఓపెన్‌కాస్ట్ వ్యతిరేక ఉద్యమాన్ని చూస్తున్నారు. కానీ బయట ఇది ప్రచారం కాలేదు. చేయవలసిన అవసరం ఉన్నది. వీ

**ఓపెన్ కాస్ట్ మైనింగ్‌కు బలైన అనేక గ్రామాల లాగే వకీల్‌పల్లి, సింగిరెడ్డిపల్లి గ్రామ బాధిత ప్రజల విషాద పరిస్థితిని, మొత్తంగా అక్కడ జరుగుతున్న దుర్మార్గాన్ని వివరిస్తున్నారు సి. వనజ**

# 'కాల్మొక్త, మా ఊరును తీపియ్యండి!'

అభివృద్ధి పథకాల నిర్వాసితుల దగ్గరకు - అవి పరిశ్రమలు కావచ్చు, ఎస్ఇజెడ్‌లు కావచ్చు, ఆనకట్టలు కావచ్చు వీటిలో ఏ కారణంతోనైనా నిరాశ్రయులవుతున్న ప్రజల దగ్గరకు ఎప్పుడు వెళ్లినా ప్రజల్లో కనిపించే తండ్లాట ఒకటే. తాము పుట్టి పెరిగి, తమకు ఆశ్రయంగా ఆదరువుగా ఉన్న ఊరును ఎలాగోలా కాపాడుకోవాలని. 'ఏమైనా సరే ఈ ఊరు వదలం, మా ఊరు నుంచి మమ్మల్ని కదిలించ వద్దు' అని పట్టుపడతారు. ప్రాధేయపడతారు. పోరాడతారు. అది సహజం.

కాని సింగరేణి ఓపెన్‌కాస్ట్‌ల వల్ల నిర్వాసితులుగా మారిన గ్రామాల ప్రజల కోరిక అందుకు భిన్నం. 'ఎలాగైనా ఈ ఊరును తీపియ్యండి. ఈ ఊరి నుంచి మమ్మల్ని విముక్తి చెయ్యండి' అంటారు వాళ్లు. ఊరికి వచ్చిన వాళ్లు రాజకీయ ప్రతినిధులో, మీడియా ప్రతినిధులో మరెవరో కావచ్చు. రెండు చేతులూ ఎత్తి, ఇంకా నిస్సహాయంగా అనిపించిన వాళ్లు రెండుకాళ్ల మీద పడి ప్రాధేయపడతారు 'ఈ ఊరిని తీపియ్యండి' అని. ఎందుకంటే తాము ఉన్న ఊళ్లే తమకు జైలుగా ప్రజలు భావించే స్థితిలోకి నెట్టడం కోసం ప్రభుత్వ యంత్రాంగం, ప్రభుత్వరంగసంస్థ పన్నిన ఉచ్చు, నెరపిన చాణక్యం సామాన్యమైనవి కాదు. ప్రభుత్వాలు ప్రజాస్వామ్యం పేరుతో ఎంత నిరంకుశంగా పనిచేస్తాయో అవసరం వస్తే వంచన తప్ప మరో మార్గం ఎలా ఎంచుకోవో చెప్పడానికి ఈ తీపియ్యమని ప్రాధేయపడుతున్న గ్రామాలు ఒక ఉదాహరణ.

రామగుండంలో ఒసి-1 కింద నిర్వాసితులయిన వకీలుపల్లి, ఒసి-3 కింద నిర్వాసితులయిన సింగిరెడ్డిపల్లి, దాని మూడు శివారు గ్రామాలైన పెద్దంపేట్, మంగళపల్లి, చందనాపూర్ గ్రామాలు గత 15-20 ఏళ్లుగా సింగరేణిలో సమరోత్సాహంతో తలపెట్టిన ఓపెన్‌కాస్ట్ మైనింగ్‌లో సమిధలైన, అవుతున్న వందల కొద్ది గ్రామాల్లో మచ్చుకు కొన్ని.

సింగిరెడ్డిపల్లి గ్రామ పంచాయితీలోకొచ్చే పదివేల ఎకరాల పంట భూములతో పాటే పంట పొలాలను పోగొట్టుకున్న మరికొన్ని గ్రామాల్లో వకీలుపల్లి ఒకటి. ఈ గ్రామాలకు చెందిన పొలాలను 15 ఏళ్ల కింద అండర్ గ్రౌండ్ గనుల కోసమే సింగరేణి సేకరించింది. ఈ సేకరించడం అన్న మాట ఉన్నంత సరళంగా ఏ సేకరణ ప్రక్రియ ఉండదన్న సంగతి భూసేకరణ గురించి తెలిసిన వాళ్లందరికీ తెలిసిందే. నయానా భయానా అన్నమాట దీనికి సరిగ్గా సరిపోతుంది. అబద్ధాలు, బెదిరింపులు వాడని భూసేకరణ భారతదేశమంతా వెతికినా కనిపించదు. అప్పుడు అంటే 15 ఏళ్ల క్రితం తొంభైల మధ్యలో ఆ భూములకు కట్టించి ఇచ్చిన విలువ ఎకరాకు 5 నుంచి 15 వేల రూపాయలు. అంత భూమి ఒక పనికి గుత్తగా తీసుకుని ఒకే పనికి ఉపయోగించినప్పుడు ధరలు కట్టడంలో ఈ తేడాలు ఎందుకుండాలో నాకు ఎప్పటికీ అర్థంకాని విషయం. పోనీ అది పక్కన పెట్టినా చిన్న చిన్న కమతాలు రెండు నుంచి ఏడు ఎనిమిది ఎకరాల లోపు భూమిని కలిగి ఉండే రైతులే ఎక్కువగా ఉండే ఈ గ్రామాల్లో ప్రభుత్వం, సింగరేణి వారు కట్టి ఇచ్చిన ఈ నష్టపరిహారం ఎంత ఉంటుందో చెప్పాల్సిన పనిలేదు. 15 ఏళ్ల కింద తెలంగాణలో భూముల విలువ ఎంత అని వితండవాదాలకు దిగేవాళ్లను పక్కనపెడితే 'మా మాట ఎక్కడ నెగ్గ నిచ్చిండ్రు దొరసానీ? మేం ఒప్పుకున్నమా? అడ్డికి పావుసేరు లెక్కన తీసుకున్నరు. కాదంటే అదికూడా ఇయ్యమని బెదిరిచ్చిండ్రు' అన్న వకీలుపల్లి గ్రామస్తురాలు అడ్డచర్ల వెంకటమ్మ మాటలు యాసలో భాషలో తేడా ఉండొచ్చుగానీ దేశమంతా వినిపించడం ఆశ్చర్యం కాదు.

అవును నష్టపరిహారం అంటేనే అడ్డికి పావుసేరు. అందులో దొంగ లెక్కలు. మొండికేసిన వారికి అదీ అందదు. అందిన వాటిలో అవినీతి, కమిషన్‌లు అందుకే దేశాభివృద్ధి కోసం ఎకరం, రెండెకరాల వ్యవసాయదారుడు చేసిన త్యాగం ఎం.ఆర్.ఒ. ఆఫీస్ నుంచి ఇంటికి వచ్చే సరికి ఒక మూట తిండిగింజలతో, ఒక నెల గ్రాసంతో చెల్లు కావడం వింతకాదు.

భూసేకరణ అంటేనే నీకు నచ్చినా, నచ్చకున్నా నీ భూమి ఇచ్చెయ్యాలి. వాళ్లిచ్చిన బిచ్చం తీసుకోవాలి. ఇది నిజమా కాదా అని తెలుసుకోవడానికి యాభై ఏళ్ల భూసేకరణ చరిత్ర అంతా సాక్ష్యమే. అది ఒక అంకం.

మళ్లీ వకీల్‌పల్లి, సింగిరెడ్డిపల్లి గ్రామాలకు వస్తే 15 ఏళ్ల కింద వీళ్ల పొలాలు బహిర్భూములతో సహా సింగరేణి అండర్ గ్రౌండ్ మైన్ల కోసం సేకరించిందని చెప్పుకున్నాం కదా. భూ సేకరణలో రెండో అంకం ఊరును సేకరించడం. ఊరికి ఆదరువు అయిన భూమి పోయాక ఊరు ఎలా బతుకుతుంది? కాబట్టి ఊరును కూడా సేకరిస్తామని సింగరేణి యాజమాన్యం ఎంతో దయగా ఈ గ్రామాలను కూడా సేకరిస్తామని గ్రామస్తులకు మాట ఇచ్చింది. అసలే పొలాలు పోయి బెంబేలెత్తి ఉన్న గ్రామస్తులకు ఊరును కూడా పోగొట్టుకోవడం గుండెలు పగిలే విషయం. ఇంటికో ఉద్యోగం, అందరికీ కొత్త కాలనీలు ఇచ్చి, అక్కడ ఎన్నో

సౌకర్యాలు... ఆశలెన్నో. వాటికి పడిపోయేవారు కొందరు. పడలేని వారు కొందరు. దాంతో ఊరు ఉంటుందా, పోతుందా? ఉంటే ఎంతకాలం ఉంటుంది. కొత్త ఊరు ఎలా ఉంటుంది? అక్కడ బతకగలమా? సింగరేణిలో ఉద్యోగాలు వస్తాయా? ఆశ నిరాశల మధ్య సుదీర్ఘమైన అనిశ్చితత!

భూ సేకరణలో పొలాలు అడ్డికి పావుసేరుకు అప్పగించిన రైతులెవరూ ఆ ఒక్క రోజుతో పొలం మీద అనుబంధం వదులుకోలేరు. అందులోనూ నిన్నటి వరకు తిండి గింజలు ఇచ్చిన భూమి ఇవ్వాళ సర్కారు తుమ్మలకు నిలయం అవుతుంటే చూస్తూ ఊరుకోవడం సాధ్యంకాదు. ఏ నిర్వాసితులదైనా ఇదే కథ. ప్రాజెక్టు వచ్చినపుడు చూద్దాం అని పొలంలో నాగలి కట్టే తీరుతారు. వకీల్‌పల్లిలో, సింగిరెడ్డిపల్లిలో అలా నాగళ్లు కట్టి పంటలు విత్తిన రైతులను ఆ పని చేయవద్దు అని చెప్పడానికి వాడిన ఆయుధం ఏమిటో తెలుసా? బుల్ డోజర్. పొట్ట విప్పడానికి సిద్ధంగా ఉన్న పొలాల మీద బుల్ డోజర్లు నడిపి మరోసారి పొలాల్లోకి వస్తే బావుండదని హెచ్చరించింది సింగరేణి యాజమాన్యం. ఊరి చుట్టూ పొలాలకు ఫెన్సింగ్‌లు పడ్డాయి. ఇప్పుడా పంట పొలాల్లో పిచ్చి తుమ్మలూ, అడివి పందులూ.

ఆ తుమ్మల్లోకి బహిర్భూమికి వచ్చిన స్త్రీలమీద అడవి పందుల దాడి. రాత్రయితే పొదల్లోంచి వచ్చి ఏకంగా పక్కల్లోనే చేరే పాముల కథలు వినే ఓపిక ఉండాలే కాని కొల్లలు కొల్లలు. ఈకథ ఇలా ఉండగా...

## వెయ్యడుగుల గొయ్యి, వక్కలవుతున్న ఇళ్లు

తొలుత ఈ గ్రామాలనూ భూములనూ అండర్ గ్రౌండ్ మైనింగ్ కోసం సేకరించిన సింగరేణి ఆతర్వాత కాలంలో మరింత ఉత్పత్తి, మరిన్ని లాభాల కోసం ఓపెన్ కాస్ట్ దారిపట్టింది. కింద నేల తొలచి బొగ్గు తియ్యటం కన్నా పై నుంచి బద్దలు కొట్టి బొగ్గు తియ్యటం ఎంత లాభమో అని మురిసిన సింగరేణి కొత్త ఓపెన్‌కాస్ట్ గనులు ప్రారంభించడంతో పాటు పాత అండర్‌గ్రౌండ్ గనులను కూడా ఓపెన్‌కాస్ట్‌లుగా మార్చటం మొదలుపెట్టింది.

ఓపెన్‌కాస్ట్ అంటే మరేం లేదు. ఒక వెయ్యేకరాల గొయ్యి. భారీ భారీ యంత్రాలతో భూమి మీద ఉన్న సమస్త జీవ జాలాన్ని చదును చేసి భూమిని బద్దలు కొట్టి చేసే గొయ్యి. ఇందులో మనుషులకు పని తక్కువ. యంత్రాలకు, కాంట్రాక్టర్లకు పని ఎక్కువ. అండర్‌గ్రౌండ్‌తో పోలిస్తే మనుషుల 'న్యూసెన్స్' తక్కువ. లాభాలు ఎక్కువ. కంపెనీ ఫిలాసఫీలోనే కార్పొరేషన్ అనేదాని పుట్టుకలోనే దేనికి ప్రాధాన్యం ఉందన్నది ఇక్కడ మళ్లీ చర్చించాల్సిన అవసరం లేదు. ప్రపంచమంతటా కళ్ల ముందు కనిపించే చరిత్రే సాక్ష్యం.

కనీసం వెయ్యి ఎకరాల వెడల్పూ, వందల అడుగుల లోతులో శక్తివంతమైన డిటోనేటర్‌లు పెట్టి భూమిని బద్దలుచేసే గోతితో ముందు నాశనం అయ్యేది ఆ మేరకున్న జీవ సంపద. చెట్లూ, చేమా, పొలాలు, పుట్ర, ఆవాసాలు, ఆదరువులు. ఆ తర్వాత జరిగేది భూగర్భ జలాల నాశనం. గోతిలో బయటపడిన నీరు బొగ్గుతో కలిసి బయటకు వస్తుంది. దీన్ని పంపులతో తోడి బయటకు పోసేస్తారు. పక్క పొలంలో మనకంటే లోతైన బోరు వేస్తే మన పొలంలో బోరు ఎండిపోవటం అందరికి తెలిసిన సంగతే కదా. ఈ వందల అడుగుల భారీ గోతితో చుట్టుపక్కల ఐదు కిలోమీటర్ల దూరంలో 40,50 అడుగుల మోట బావులు నిట్టనిలువుగా ఎండిపోతాయి. మంచి నీళ్ల కోసం వేసిన బోరు బావులు వట్టి పోతాయి. భూమిపై మనిషి అత్యాచారం చెయ్యగలడా అని ఎవరికైనా సందేహం వస్తే ఒకసారి వెళ్ళి ఒక ఓపెన్‌కాస్ట్ బావిని చూడండి. ఆ వెయ్యడుగుల వెడల్పున భారీగా నోరు తెరిచిన గోతిని ఒకసారి చూశాక అది చెయ్యగల విధ్వంసం అర్థమయ్యాక ఆ బొమ్మను మనసులోంచి చెరిపెయ్యటం చాలా కష్టం.

ఇప్పుడు వకీల్‌పల్లెకు, సింగిరెడ్డిపల్లెకు మళ్లీ వద్దాం. ఇవి రెండూ ఇలాంటి ఓపెన్‌కాస్ట్‌లే. ఒకటి అర కిలోమీటరు, ఇంకోటి కిలోమీటరు దూరంలో ఉన్నాయి. ఆ ఊర్లో ఒకప్పుడు 10, 15 ఎకరాలకు కూడా నీళ్లు పారించిన మోటబావులు ఇప్పుడు నిలువునా ఎండిపోయి ఒట్టిపోయి కనిపిస్తాయి. బోర్లు పనిచెయ్యవు. సింగిరెడ్డిపల్లిలో కాంతమ్మ అన్నట్లు "గొంతు తడుపుకుందామన్నా, గుడ్డ పేగు ఉతుక్కుందామన్నా నీళ్లు కరువే".

భూమి పొరల్లోంచి బొగ్గు బయటకు తీయటం కోసం ప్రతిరోజు ఠంచనుగా మధ్యాహ్నం మూడు నుంచి మూడున్నర మధ్య ఓపెన్ కాస్ట్‌లు జరిపే బాంబు పేలుళ్లకు ఆ గ్రామాల్లో ఇళ్లన్నీ అల్లల్లాడుతాయి. ఊరు ఊరంతా ఇళ్లలోంచి బయటకు వచ్చి చెట్ల కింద చేరాల్సిందే. రోగం ఉన్నా, రొప్పు వచ్చినా తప్పదు ఆ అరగంట చెట్ల కింద జాగారం. ఆ ఊళ్లలో ఓడుల్లేని, నిలువునా చీలిపోని గోడల్లేని ఇంటిని ఒక్కదాన్ని కనిపెట్టినా దాన్ని గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కించవచ్చు. నీడగా ఉన్న ఇల్లు ఏ క్షణం కూలుతుందో తెలియక, పందులతో, పాములతో సావాసం చెయ్యలేక, తాగడానికో గుక్కెడు నీళ్లు దొరకక ఈ గ్రామాలు 'కాల్మొక్త! మా గ్రామాలు తీపియ్యండి దొరా!' అని కాళ్ల బేరానికి వచ్చాయంటే ఆశ్చర్యం ఏముంది?

అవును అసలు ఈ గ్రామాలకు కూడా నష్టపరిహారం ఇస్తానని, కొత్త కాలనీలు కట్టిస్తానని సింగరేణి మాట ఇచ్చింది కదా అదేమయింది? మొదట్లో కొన్ని రోజులు మేము ఖాళీ చెయ్యం అని మొండికేసినా నాలుగు రోజులకు పరిస్థితి అర్థమయిన గ్రామాలు రాజీకి రానే వచ్చాయి. అప్పటికే భూములు ఆక్రమించుకున్న సింగరేణి యాజమాన్యం గ్రామాలతో ఇక పాము ముంగిస ఆట మొదలు పెట్టింది. వాటి ప్రకారం వకీలుపల్లి గ్రామానికి 2006 నాటికే ఇళ్ల స్థలాలు కేటాయించి, ఇంటికి 50 వేలు చొప్పున పరిహారం చెల్లించవలసి ఉంది. ఈ పాటికి ఆ ఊరు తరలిపోయి కొత్త స్థలంలో, కొత్త జీవితంలో, కొత్త తండ్లాట పడుతూ ఉండాల్సింది. ఇక సింగిరెడ్డిపల్లిని నోటిపై చేసి, పదిసార్లు సర్వేలు చేసి, పరిహారాల లెక్కలు కట్టి ఇదిగో అదిగో అంటూ తిప్పిన సింగరేణి ఏడాది కింద హఠాత్తుగా ప్లేటు మార్చేసింది. నిజానికి మాకు మీ ఊరు అవసరం లేదు. కాబట్టి మాకు ఊరును తీసుకోవాలనిపించటం లేదు అని.

హతాశులయిన గ్రామస్తులు గనుల ముట్టడికి, నీళ్ల టాంకు మీద నుంచి సామూహిక ఆత్మహత్యా ప్రయత్నాలకు దిగారు. సరే చూస్తాం అని, ఎన్నికల ముందర మూడు నెలల్లో సెటిల్ చేస్తాం అని కూడా చెప్పిన సంగరేణి యాజమాన్యం, రాష్ట్ర ప్రభుత్వం ఎన్నికలు కాగానే బోడి మల్లన్న అనేశాయి. ఇప్పుడా గ్రామస్తులు ఊరికి వచ్చిన వాళ్లందరి కాళ్ల మీదపడి అయ్యా, అమ్మా, దొరా, దొరసానీ, ఎట్లన్న చేసి మాఊరుని

తీపియ్యింద్రి అంటే, అబ్బా ఈ తెలంగాణ వాళ్లు ఇంత ఆత్మగౌరవం లేకుండా ఎట్లా ఉంటారు అని విసుక్కుందామా?

ఇంత కథకు కారణమయిన ఈ ఓపెన్‌కాస్ట్ గనులు జాతి ప్రయోజనాలను ఉద్ధరించే విధానాన్ని తెలుసుకోకపోతే ఈ కథ అసంపూర్ణం. మొత్తం దక్షిణ భారతదేశంలోనే బొగ్గు దొరికే ప్రాంతం తెలంగాణ. ఖమ్మం, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల బొగ్గును వంద ఏళ్లకు పైగా తవ్వి తీస్తున్నారు. ఆ తవ్వి తీసే యంత్రాంగమే సింగరేణి.

ఎంతోకాలంగా భూగర్భంలోకి ప్రయాణించి బొగ్గు తీసి జాతి ప్రయోజనాల కోసం, ప్రధానంగా థర్మల్ విద్యుత్ కేంద్రాల్లో విద్యుదుత్పత్తి కోసం వాడుతున్నారు. అయితే ఇందులో 60 శాతం మాత్రమే బొగ్గు బయటకు వస్తుందని, ఓపెన్‌కాస్ట్ విధానంలో 99 శాతం బొగ్గు తీయొచ్చని 20 ఏళ్ల క్రితం సింగరేణి తెలుసుకుంది. ముందే చెప్పినట్లు ఇందులో మనుషులు ప్రమాదకరమైన పరిస్థితుల్లో కష్టపడి బొగ్గు తీయాల్సిన పనిలేదు. బాంబులతో భూమిని పేల్చి భారీ యంత్రాలతో (పృథ్వీ భంజన్‌లు అంటారట వాటిని) చులాగ్గా బొగ్గు తీసేసుకోవచ్చు. ఇరవయి ఒకటో శతాబ్దంలో వెళ్తూ కూడా చేతులతో తట్టలతో బొగ్గుల మోసే బార్బారిక్ స్థితి నుంచి మోడర్నైజ్ అయి దాంతో పాటు బోలెడన్ని లాభాలు గడించేందుకు ఇది బ్రహ్మాండమైన మార్గం. ప్రజల కోసం ప్రజలు వనరులుగా, ప్రజల వనరుల పెట్టుబడిగా ఏర్పడిన ప్రభుత్వరంగ సంస్థలకూ, పాలకులకూ ఇందులో ఏ అన్యాయం కనపడలేదు. దాంతో 20 ఏళ్ల కింద సింగరేణిలో ఓపెన్‌కాస్ట్ విధానం మొదలయింది.

మరి వీటి వల్ల నశించే జీవసంపద, పర్యావరణ విధ్వంసం మాటేమిటి? ఈ ఓపెన్‌కాస్ట్ గనులకు అనుమతి తీసుకున్నప్పుడు ఈ గనుల్లో బొగ్గు తవ్విన తర్వాత మళ్లీ వాటిని మట్టితో నింపి తిరిగి వ్యవసాయ యోగ్యమైన భూములుగా మార్చి ఇస్తామని సింగరేణి హామీ ఇస్తుంది. లెక్క ప్రకారం ఒక వైపు తవ్వుతూ అయిపోయిన వైపు మట్టి నింపుతూ రావాలి. ఇప్పటికి సింగరేణి అలా బొగ్గు తవ్వుకుని మూసేసిన అండర్ గ్రౌండ్ గనులు 47, ఓపెన్‌కాస్ట్ గనులు ఆరు. ఇందులో ఏ ఒక్క దాంట్లో కూడా పూర్వస్థితి నెలకొల్పిన దాఖలాలు లేవు. మూయకుండా వదిలేసిన నోరు తెరిచి ఉన్న ఈ గోతుల్లో పశువులు పడి చనిపోవటం స్థానికులకు పరిపాటయింది.

ఒక తట్ట తియ్యటానికి ఎంత ఖర్చో ఆ తట్ట తిరిగి పొయ్యాలన్నా అంతే ఖర్చు కదా. అందుకే ఆ తట్ట తిరిగి పోసే పనికి మంగళం పాడితే కాని ఓపెన్‌కాస్ట్‌లో భారీ లాభాలు కనిపించవు. కంపెనీకి లాభాలు ముఖ్యమా? పర్యావరణం ముఖ్యమా? జవాబు చెప్తే బహుమతులు లేవు.

ఎక్కడ ఏ ప్రాజెక్టు ప్రారంభం అయినా, అందుకోసం భూములు సేకరించినా నష్టపరిహారంలో భాగంగా తప్పకుండా ఆశ పెట్టేది స్థానికులకు ఉద్యోగాలు. ఏ ప్రాజెక్టులోనూ అది అమలు జరిగిన ఉదంతాలు లేవంటారు. కానీ వకీలుపల్లి, సింగిరెడ్డిపల్లెలో మాత్రం నష్టపరిహారం ప్యాకేజీలో, వచ్చిన ఉద్యోగం ఒకటి కూడా లేదు. ఆ గ్రామాల్లో ఎవరన్నా గనుల్లో తట్ట మోస్తున్నారంటే దానికీ ప్యాకేజీలకు సంబంధం ఏమీ లేదు.

గ్రామాల పరిస్థితి ఇలా ఉంటే బొగ్గు దొరుకుతున్న మొత్తం తెలంగాణ ప్రాంతం సంగతి ఏమిటి? బొగ్గు ఉత్పత్తిలో ఒక టన్ను ఉత్పత్తి చేసే క్రమంలో ఇద్దరికి, దానిని వినియోగించే క్రమంలో నలుగురికి ఉపాధి దొరకుతుందన్నది ఒక లెక్క. తవ్వే ప్రాంతాల్లో తవ్వే వాళ్లు ఎప్పుడూ స్థానికులే. కాని వాళ్ల మీద పెత్తనం చేసే మిగిలిన యంత్రాంగంలో స్థానికుల సంఖ్య బహు స్వల్పం అన్న విషయం తెలియడానికి సింగరేణిలో లెక్కలు తియ్యాల్సిన పనిలేదు. ఏ కార్యాలయంలో ఐదు నిమిషాలు గడిపినా తెలుస్తుంది.

ఇహపోతే తీసిన బొగ్గులో 70 శాతం దాకా బయట ప్రాంతాలకు ముఖ్యంగా తెలంగాణ బయట ఉన్న థర్మల్ విద్యుత్ కేంద్రాలకు పోతుంది. ఇక అక్కడ ప్రతి టన్ను బొగ్గు వ్యయంతో వచ్చే నాలుగు ఉద్యోగాలు ఎవరికి పోతాయో చెప్పాల్సిన అవసరం ఉందా? ఒక ప్రాంతంలో లభ్యమయ్యే వనరులు ముందు ఆ ప్రాంత అభివృద్ధికి తోడ్పడాలని, స్థానికులకే ఉపాధి అవకాశాలు ఉండాలని రాజ్యాంగం చేసిన నిర్దేశం ఏ ఓపెన్‌కాస్ట్ బ్లాస్ట్ ధూళిలో కప్పుకుని పోయిందో ఎవరు బయటికి తీయాలి? కూతవేటు దూరంలో రెండు ఓపెన్ కాస్ట్‌లు, నాలుగు అండర్ గ్రౌండ్ మైన్‌లు ఉండీ, దేశంలోనే బొగ్గుతో యూరియా తయారు చేయ గలిగిన ఏకైక సంస్థ భారత ఎరువుల కర్మాగారం బొగ్గు కొరత కారణంగా ఎలా మూతపడిందన్న భేతాళ ప్రశ్నకు ఎవరు జవాబు చెప్పాలి. వీ

---

(...7వ పేజీ తరువాయి)

ఎదుర్కోనున్నాం. విలువైన గనులను ప్రైవేట్ కంపెనీలకిచ్చి గిరిజనులను తరిమివేసే పని మరింత వేగంగా సాగుతోంది.

వీటితోపాటు భారీపెట్టుబడులతో వచ్చే రిటైల్ రంగాన్ని ముందుకు నడిపించవచ్చు. ఇప్పటికీ ఈ రంగంలో ఉన్న బడా కంపెనీలైన సుభిక్షా, మాగ్నాలు మూతపడే పరిస్థితి నెలకొంది. వీటి ప్రోత్సాహకాలను కల్పించమని ఎఫ్ఎంసిజి కంపెనీలు కోరుతున్నాయి. గ్రమాల్లో ప్రభుత్వ పెట్టుబడులు పెట్టి కొనుగోలు శక్తిని పెంచాలని, రోడ్డు, విద్యుత్, కమ్యునికేషన్స్ అభివృద్ధి చేయాలని అవి డిమాండ్ చేస్తున్నాయి. తద్వారా అవి భారీ రిటైల్ షాపులు గ్రామస్థాయి నుంచి స్థాపించాలనేది వాటి వ్యూహం. దీనివల్ల ఇకముందు రోడ్డు పక్కనుండి బడ్డీ కొటూ మూతపడవచ్చు.

రాష్ట్రంలోనూ ప్రాజెక్ట్‌ల పేరుతో జరిగే అవినీతి ప్రహసనాలు మరింత పెరిగే అవకాశాలున్నాయి. ఇప్పటికే శాస్త్రవేత్తలు, మేధావులు ఇచ్చే సలహాలను తుంగలో తొక్కిన ప్రభుత్వం నిర్వాసితుల గోడు పట్టించుకుందనేది సందేహమే. విద్య, వైద్య రంగాలలోనూ ప్రభుత్వం వెనక్కి తగ్గే అవకాశాలున్నాయి. మరో ముఖ్య విషయం ఏమిటంటే, ఇప్పటికే రియల్ ఎస్టేట్ పాత్రలో ముందున్న ప్రభుత్వం మరింతగా కారుచౌకగా ప్రభుత్వ భూములను అమ్మి వేయనుందనడంలో సందేహం లేదు. దేశోద్ధారకులుగా ఫోజులు పెట్టే లెఫ్ట్‌పార్టీలు తమ సొంత రాష్ట్రంలోనే సంస్కరణలు ప్రవేశపెట్టాయి. ఫలితాలను నేడు చవిచూశాయి. బెంగాల్, కేరళలతో పాటు కేంద్రంలోనూ విశ్వాసాన్ని కోల్పోయాయి. తమ స్థానాలను పూర్తిగా కోల్పోయాయి.

సంస్కరణల ఆద్యుడు మన్మోహన్ సింగ్ మళ్లీ ప్రధాని అయ్యారు. ఈసారి పూర్తిస్థాయి మెజార్టీతో, పూర్తిస్థాయి సంస్కరణలు ప్రవేశపెట్టాలని తహతహలాడే ఈయనకు నేడు అవకాశం దొరికింది. ఇక రానున్నది సంస్కరణల కాలం. ప్రజలకు ఇక మిగిలేది కష్టాలే. పరిష్కారం ఉద్యమాలే. అందుకే రానున్నది సంస్కరణల యుగమేకాదు, పోరాటాల యుగమనీ చెప్పాలి.

***– వలేటి రాజశేఖర్***

విజయవాడ

*అభివృద్ధి గురించి కొత్త నిర్వచనాలతో, కొత్త సూచనలతో తయారయిన ప్రపంచ బ్యాంక్ నివేదికను సమీక్షిస్తున్నారు* **ముదునూరి భారతి**

# ప్రపంచబ్యాంక్ నివేదిక - విమర్శనాత్మక సమీక్ష

మురికివాడల గురించి మనం అర్థం చేసుకోవాలంటే – 19వ శతాబ్దంలో లండన్‌లో చాలా పెద్ద మురికివాడలుండేవనీ, లండన్ మాత్రమే కాదు న్యూయార్క్, పారిస్, టోక్యోలలో చాలా మురికివాడలుండేవనీ, వీటి పెరుగుదల కారణంగానే ఇవి ప్రపంచ ఖ్యాతి చెందిన పట్టణాలుగా రూపు తీసుకున్నాయనీ నివేదిక చెప్పింది. మురికివాడలలో పెరుగుతున్న పట్టణాలకు తరలివచ్చే శ్రామికవర్గం అక్కడ లభ్యమయ్యే ఆర్థిక అవకాశాలను అంది పుచ్చుకుంటాయనీ చెప్పి, ఉదాహరణగా ముంబయి మహానగరం దగ్గర ఉన్న మురికివాడలో 15,000 మంది తమ ఇళ్లలోనే బట్టలు, కుండలు, బొమ్మలు మొదలయినవి తయారు చేసి వాటి అమ్మకాల ద్వారా ఒక సంవత్సరంలో కొన్నివేల రూపాయలు సంపాదిస్తారనే సమాచారాన్ని పొందుపరిచింది. ఈ మురికివాడలే క్రమంగా ప్రభుత్వ పాలసీలను ఉపయోగించుకొని వృద్ధి పొందుతాయనీ, ఇంకా నిన్నటి మురికివాడలే నేటి ప్రపంచ ఖ్యాతి పొందిన పట్టణాలనీ కూడా సూచించింది. ఇదే అవగాహనని ఈ మధ్యనే ఆస్కార్ బహుమతి వచ్చిన సినిమాలో మన ధరావిని, అక్కడి పేదరికాన్ని ప్రపంచానికి చూపిస్తూ 'స్లమ్ డాగ్ మిలియనీర్' అనే సినిమా ప్రపంచ ప్రసిద్ధిచెందింది.

కాని వాస్తవంలో మురికివాడలంటే జీవించడానికి కనీస అవసరాలైన తినడానికి కొంచెం తిండి, కట్టుకోవడానికి కొన్ని బట్టలు, ఉండడానికి ఒక రక్షణ కూడా లేని స్థలాలు. జనసాంద్రతే కాకుండా మురికికాలువలు, దోమలు దానితో వచ్చే అనారోగ్యం, చదువు లేకపోవడం, పట్టణానికి అవసరమైన పనులలో నైపుణ్యత లేని కారణంగా పనులు దొరకక దుర్భరమైన జీవితం గడిపే మురికివాడల ప్రజల నుండి కూడా కొన్నివేల రూపాయల విలువచేసే ఉత్పత్తి జరుగుతోంది. ఈ ఊబినుంచే మహానగరాలు వెలుస్తాయి అని అనుకోవడం బాగానే ఉంటుంది. ఆ సినిమాలో హీరోకి జ్ఞానం లేకపోయినా కూడా అనుకోకుండా లాటరీ తగిలినట్లుగా అకస్మాత్తుగా లక్షాధికారి అయిపోతాడు, కోరుకున్నవన్నీ అందిపుచ్చుకున్నాడు అనటం వెనక మురికివాడలలోని ప్రజలు కూడా తమ శక్తి సామర్థ్యాలతో సంబంధం లేకుండా ధనవంతులయ్యే అవకాశం ఉంది అని వారికి ఒక స్వప్నలోకం చూపించడం హాస్యాస్పదంగా ఉంటుంది. మురికివాడలలోని ప్రజలు సమాజానికి తమవంతు బాధ్యతను నెరవేరుస్తున్నారని గుర్తించి, సమాజం ఇప్పటి వరకూ ఏం చేసింది? దాని ప్రభావం ఎలా ఉంది? ఇంకా ఏం చేయవలసి ఉంటుంది అని సూచిస్తే బాగుంటుంది. అభివృద్ధి అనే నాణానికి పెరుగుతున్న పట్టణాలు ఒక వైపు వెలుగు చూపిస్తూ ఉంటే, దాని వెన్నంటి రెండో వైపు ఉండే మురికివాడలు సరియైన సామాజిక ఆర్థిక సదుపాయాలు లేక చీకటిలో ఉండిపోయి క్షీణదశకు వస్తూ ఉంటే, సహజంగానే వీటిని అంటిపెట్టుకుని ఉండే పట్టణాలు కూడా క్షీణ దశకు వచ్చే అవకాశం ఉంది.

ఇంక ఇండియాలో వలసల గురించి ప్రత్యేకంగా వివరిస్తూ, వలసల మీద ఇక్కడ ఉండే ప్రతిబంధకాల కారణంగా ఇక్కడ చిన్నవిగా, అసమర్థవంతంగా ఉండే పట్టణాలు వెలుస్తాయని ఒక బాక్సుకట్టి మరీ వివరించారు. 30 మిలియన్ల మంది నిర్ణీత సమయంలో వలస పోతుంటారనీ, కాని ప్రభుత్వం అమలు చేస్తున్న రెండు పథకాలు, జాతీయ గ్రామీణ ఉపాధి హామి పథకం, స్థానికులకే సబ్సిడీలు, ఇంటికి, రేషన్‌లో బియ్యం ఇంకా దారిద్ర్య రేఖనకు దిగువన ఉన్న (బి.పి.ఎల్.) కుటుంబాలకు ఇచ్చే ఇతర పథకాలలో హక్కుదారులవడం లాంటివి – ఇవి రెండూ వలసలను ఆపివేసే పథకాలుగా నివేదిక పేర్కొంటూ, ఇలాంటి పథకాలు తయారు చేయడం, అమలు చేయడం వెనుక ఆర్థిక అభివృద్ధికి మూలం వలసలేనని గుర్తించకపోవడంగా పేర్కొంది. పెద్ద పెద్ద పట్టణాలు రావడం దీని వెనుక ఉన్న ఆర్థిక శక్తి, ఒక రకంగా చూస్తే సమాజపు పురోగతికి మూలం అది వ్యవసాయం నుండి పరిశ్రమల ఆధారంగా మారిపోవడమనీ, ఇదొక్కటే అభివృద్ధికి మార్గమని చేసే సూత్రీకరణ. ఇది పెట్టుబడిదారీ మొదటి దశలో అభివృద్ధి అయిన ఇంగ్లండ్ లాంటి దేశాలలో జరిగి ఉండవచ్చును. కాని ప్రస్తుతం అభివృద్ధి చెందుతున్న దేశాలకు కూడా ఇదే మార్గం వర్తిస్తుందని నివేదిక సూత్రీకరించటం గుడ్డినమ్మకంగా కన్పిస్తుంది. సబ్సిడీ పథకాల ద్వారా గ్రామీణ ప్రజలకు తాత్కాలిక ఉపశమనం కలిగితే, గ్రామీణ ఉపాధి పథకంలో చేపట్టే పనుల ద్వారా వ్యవసాయోత్పత్తులు పెరిగితే, పరిశ్రమల అభివృద్ధితో సంబంధం లేకుండానే, వ్యవసాయంలో జరిగే మార్పుల ద్వారా కూడా అభివృద్ధి సాధించవచ్చుననీ, సమాజ అభివృద్ధికి ఒక ప్రత్యామ్నాయ మార్గం దొరుకవచ్చుననే ఆలోచన రాదు. అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ అవసరాలకనుగుణంగా, ఒక ప్రత్యామ్నాయ మార్గం వెతికే ప్రయత్నాలున్నా, బయటి శక్తుల ద్వారా వెనుకకు నెట్టివేయడమే కాక ఈ మార్గాలు అభివృద్ధి నిరోధకాలని చెప్పి నిరుత్సాహపరుస్తాయి. ప్రత్యామ్నాయ మార్గాలు ఒకవేళ ఉంటే అవి కూడా కన్పించవు.

## విమర్శ

మనం ప్రస్తుతం ప్రచారంలో ఉన్న ప్రపంచ బ్యాంక్ నివేదికని విశ్లేషిస్తున్నప్పుడు రెండు ప్రధానాంశాల గురించి చర్చించవలసిన అవసరం ఉంది. అందులో ఒకటి చరిత్ర, రెండవది అది ఉపయోగించిన విశ్లేషణా పద్ధతి. మొదటగా చరిత్ర గురించి చూద్దాం.

మానవ సమాజ చరిత్రలో ఒక ముఖ్యమైన భాగం మనిషికి - ప్రకృతికి, మనిషికి - మనిషికి ఉండే సంబంధాలలో వచ్చిన మార్పులు. ఇది సమాజ పునర్నిర్మాణ క్రమంలో జరిగిన ఒక ప్రక్రియ. ముఖ్యంగా గత మూడు వందల సంవత్సరాలలో మన సమకాలీన సమాజంలో జరిగిన పెనుమార్పులు గమనించదగినవి. దీనిని కొంతమంది ఆధునికతగా చిత్రించిన వాళ్లు ఉంటారు. పారిశ్రామిక విప్లవంగా చూసిన వాళ్లు కొంతమంది ఉంటారు. ఇంకొంతమంది పెట్టుబడిదారీ విప్లవంగా చూసినవాళ్లూ ఉంటారు. ఆర్థికపరంగా చూసినపుడు సమాజ పునర్నిర్మాణం గురించి మౌలికంగా జరిగిన మార్పులు చూసినవాడు, ఆర్థికశాస్త్రానికి మూలపురుషుడుగా అందరూ ఒప్పుకునే శాస్త్రవేత్త ఆడమ్‌స్మిత్. ఈ మధ్యకాలంలో పెట్టుబడి ప్రపంచ వ్యాప్తంగా సమాజాలను తన అదుపులోకి తీసుకుంటున్న సమయంలో తరచుగా విశ్లేషకులు ఆడమ్‌స్మిత్‌ని ఆధారంగా తీసుకొని, అక్కడి నుండి వ్యాఖ్యానించటం పరిపాటి అయింది. ఇది ఒక భావజాలం అయిపోయింది. ఆడమ్‌స్మిత్ భూస్వామ్య సమాజం నుండి అప్పుడే ఆవిర్భవిస్తున్న పెట్టుబడిదారీ సమాజం ఉద్భవిస్తున్న క్రమాన్ని విశ్లేషించాడు. ఆ క్రమంలో వ్యక్తి స్వేచ్ఛ గురించి, మార్కెట్ల ప్రాముఖ్యత గురించి, శ్రమవిలువ గురించి కొనియాడుతూ, ప్రశంసిస్తూ స్మిత్ రాసిన వ్యాఖ్యలు ఇవి. అక్కడి నేపథ్యంలో ఉండే వ్యక్తిస్వేచ్ఛ, మార్కెట్ల భావజాలంలో ప్రచార సాధనాలుగా మారి, ప్రస్తుత సమాజంలో కూడా పెట్టుబడిదారీ వ్యవస్థకు చాలా ఉపయోగకరంగా ఉంటాయి. ఆయన చెప్పిన శ్రమ విలువ సిద్ధాంతాన్ని గుర్తు చేసుకోకుండా, వ్యక్తి స్వేచ్ఛ అంటే పెట్టుబడిదారీ స్వేచ్ఛగానే ప్రచారం సాగుతోంది.

చరిత్ర గురించి ప్రపంచ బ్యాంక్ తన నివేదికలో విశ్లేషించలేదు అనడంలో ఒక తప్పు ఉంది. నిజం పాక్షికమే. ఆ నివేదిక చరిత్రని ఆడమ్‌స్మిత్ తోటే మొదలయినట్లుగా చిత్రిస్తుంది. ఆడమ్‌స్మిత్‌ని చరిత్రలో భాగంగా చూస్తామా లేక చరిత్ర వ్యవస్థాపకుడుగా, నిర్మాతగా చూస్తామా అనేది ఒక ప్రధాన సమస్య. నిజానికి ఆడమ్‌స్మిత్ వ్యాసాలు చరిత్రలో ఒక భాగం. భూస్వామ్య సమాజం నుండి మరో కొత్త సమాజం ఉద్భవించే క్రమాన్ని చూసి వ్యాఖ్యానించిన ఆడమ్‌స్మిత్ పూర్వీకులు చాలామంది ఉన్నారు. అందులో ఫిజియోక్రాట్స్, మర్కెంటైల్స్ మొదలయిన వాళ్లు ముఖ్యులు. వాళ్ల వ్యాఖ్యానాలను ఉపయోగించుకుని ముందుకు సాగిన సిద్ధాంతమే స్మిత్ రాసిన వ్యాసాలు. ఇందులో ఫిజియోక్రాట్స్ చేసిన వ్యాఖ్యానంలో ఉత్పత్తులను రక్తప్రసరణతో పోల్చి, ఉత్పత్తులు ఒకదాని మీద మరొకటి ఆధారపడే చలనంలా ఉంటాయనీ, దీనికంతటికీ మూల కారణమయిన ఒక మిగులు ఉత్పత్తి ఉంటుందనీ, ఆ మిగులుకి వ్యవసాయమే కేంద్రమనీ సిద్ధాంతీకరించారు.

స్థిరంగా ఉండే భూస్వామ్య సమాజం నుండి ఉద్భవించిన చలన కేంద్రంగా ఉండే కొత్త సమాజాన్ని విశ్లేషించిన రీతి ఈ ఫిజియోక్రాట్స్‌ది. వ్యాపారం, సరుకుల వ్యాపారం కేంద్రంగా కొత్త సమాజాన్ని వివరించేది మర్కెంటైల్స్. ఆడమ్‌స్మిత్ ఈ రెండు వివరణలను సిద్ధాంతీకరించి రాసిన వ్యాసాలే 'వెల్త్ ఆఫ్ నేషన్స్' అనే పుస్తకం. ఆడమ్‌స్మిత్ సిద్ధాంతాలను, ముఖ్యంగా విలువ సిద్ధాంతాన్ని కేంద్రంగా తీసుకుని సామాజిక విశ్లేషణ చేసిన మేధావులు ఎంతోమంది ఉన్నారు. అందులో ముఖ్యులు ఒక రకంగా రికార్డో, మరొక రకంగా మార్క్స్. మార్క్స్ ఈ కొత్త సమాజాన్ని విశ్లేషిస్తూ దాని అస్థిరత్వాన్ని, అందులోంచి ఉద్భవించే మరొక కొత్త సమాజాన్ని విశ్లేషించాడు.

ప్రపంచబ్యాంక్ నివేదిక-2009 కి ఈ చరిత్రతో ఏ సంబంధమూ లేదు. ఇది స్మిత్ ముందు కాని తరువాత కాని ఉండే చారిత్రక సంబంధాలను చూడదు. ఒకరకంగా దీనిని అవసరార్థపు మతిమరుపు (సెలెక్టివ్ అమ్నేసియా) గా చూడవచ్చు. పైన చెప్పిన మేధావులే కాకుండా పెట్టుబడిదారీ పూర్వ సమాజానికి మరొక పూర్వదశ ఉంది. అదే రీపీరియడ్. అప్పటి చర్చిని, భూస్వామ్య వ్యవస్థని నిర్దేశించిన సూత్రాలను వ్యతిరేకించిన ఒక వ్యవస్థ ఇది. ఇంగ్లిష్ చర్చి, ప్రొటెస్టెంట్ ఉద్యమాలు పుట్టిన దశ. భూమి సమతలంగా ఉంది, సూర్యుడు భూమి చుట్టు తిరుగుతాడు అనే భావాల నుండి మనిషి ఆలోచనలకు అవధులు చర్చి కాని, భూస్వామ్య వ్యవస్థ కాని పెట్టలేవని చెప్పిన ప్రయోగ దశ ఇది. ఈ కాలంలోనే డావిన్సీ లాంటి వాళ్లు ఎందరో పుట్టిన కాలమది. ఈ చరిత్ర కూడా సమాజ పునర్నిర్మాణానికి ఎంతో దోహదపడుతుంది. ఈ విషయాలను విస్మరించటం కూడా అవసరార్థపు మతిమరుపులో భాగమే. పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భావానికి అవసరమైన చరిత్రలో జరిగిన మరో ముఖ్య ఘట్టం ప్రజాఉద్యమాలు, ప్రజా రాజకీయాలు. చరిత్రలో విశిష్టమైన పాత్ర ఫ్రెంచ్ ప్రజలది. దానిని సూత్రీకరించిన ఫ్రెంచ్ విప్లవానిది. ప్రస్తుతం మనం అనుకుంటున్న ప్రజాస్వామ్యం, దీనికి కావలసిన కీలక అంశాలు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలను రూపొందించి ఒక ఉద్వేగపరమైన రూపాన్ని దాల్చింది కూడా ఈ ఫ్రెంచ్ విప్లవమే. ఇంగ్లండ్‌లో జరిగిన విప్లవం కూడా, కొన్ని రూపాలలో మార్పులున్నా, సారాంశంలో ఫ్రెంచ్ విప్లవానికి తీసిపోదు. ప్రజా ఉద్యమాలూ, ప్రజా రాజకీయాలు పెట్టుబడిదారీ వ్యవస్థ ఉద్భవానికి ఒక కీలకమైన పూర్వదశ. ఇవన్నీ కూడా నివేదికలో ఒక అవసరాత్మకమైన మతిమరుపులో భాగమైపోయాయి. సామాజిక చరిత్ర ఏమీ చదవకపోయినా కొన్ని నవలలు చదివినా, ముఖ్యంగా చార్లెస్ డికెన్స్ నవలలు చదివినా, ఈ మతిమరుపు కొంత తగ్గేదేమో. పట్టణాలనూ, పెద్ద పట్టణాలనూ ప్రోత్సహించే ప్రపంచబ్యాంక్ నివేదిక ఒక్కసారైనా డికెన్స్ రాసిన 'రెండు మహా నగరాలు' చదివి ఉంటే బాగుండేది. ఇంత మతిమరుపు ఉన్న నివేదిక సమకాలీన చారిత్రక సంఘటనలు గుర్తించలేకపోవడం - అది పారిస్ కమ్యూన్ అవవచ్చును, రష్యన్ విప్లవమవవచ్చును, చైనా వారి నూతన ప్రజాస్వామిక విప్లవం అవవచ్చును. ఒక చిన్న క్యూబా స్వాతంత్ర్యోద్యమం అవవచ్చును - సహజంగానే జరిగిపోతుంది. వీటిని ఒక ప్రత్యామ్నాయంగా ఊహించతగ్గ విషయాలుగా కనబడవు. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా, తలెత్తిన ఆర్థిక సంక్షోభం గురించి వస్తున్న ఆలోచనలలో అప్పుడప్పుడు మార్క్స్ తలెత్తుతూ ఉంటాడు. అది ఒక భయంవలనే కాని, ఆయన

దగ్గర నేర్చుకోనవలసిన విషయాలు ఉన్నాయని గుర్తించటం వలనకాదు. చరిత్రని ఒక భావజాలంగా, ఒక సరుకుగా, ఒక మారకపు విలువగా అమ్మడానికి ఉపయోగించుకున్నపుడు అవసరార్థపు మతిమరుపులు అనివార్యం. చరిత్రని ఒక చోదకశక్తిగా, ఉపయోగపు విలువగా చూసినపుడు చరిత్ర ఒక స్ఫూర్తిని ఇస్తుంది. ఉత్తేజాన్ని ఇస్తుంది. ప్రజాస్వామ్య ఆలోచనలను సరళతరం చేస్తుంది. ఇవి అక్కరలేనప్పుడు ఆడమ్‌స్మిత్ రాసినవి కూడా మనకి మరో రామాయణంలా ఉండిపోతాయి.

ఇంక నివేదికలో రెండవ అంశం విశ్లేషణ. మనం ముందు చెప్పుకున్నట్లు ఏ విషయాన్నైనా / వస్తువునైనా విశ్లేషిస్తున్నామంటే ఆ వస్తువు / విషయంలో ఉన్న అంతర్భాగాలను గుర్తించడం, వాటి మధ్య సంబంధాలను విశదీకరించడం. ద్వారా ఆ వస్తువుకో రూపం ఇవ్వడం అనేది సర్వ సాధారణం. సైన్స్ పాటించే పద్ధతి కూడా ఇదే. మార్క్సిజం పాటించే పద్ధతి కూడా ఇదే. పెట్టుబడిదారీ అభివృద్ధిని విశ్లేషించే ఈ నివేదిక కూడా కొంతవరకూ తెలిసీ తెలియకుండా ఆ పద్ధతినే పాటిస్తోంది. ఉదాహరణకి అభివృద్ధి చెందిన దేశాలు – అభివృద్ధి చెందని దేశాలు, సంపన్న దేశాలు – పేదదేశాలు, వ్యవసాయం – పరిశ్రమలు, పట్టణాలు – గ్రామాలు ఇలా ద్వంద్వాలే కాకుండా ఇంకొక కీలకమైన అంశాన్ని ప్రస్తావించింది. అభివృద్ధికి కీలకం పారిశ్రామిక వేత్తలు, ప్రజలు అనీ. పెద్ద పెద్ద పట్టణాలే అభివృద్ధికి సూచికలుగా ప్రతిపాదించే ఈ నివేదిక స్వాభావికంగానే పారిశ్రామికవేత్తల మీద, వాళ్ళు పెట్టే పరిశ్రమల మీద, ఆ పరిశ్రమలకు కావలసిన ప్రజల మీద, ఆ ప్రజల, పారిశ్రామికవేత్తల వలసల మీద కేంద్రీకరించింది. పట్టణం అంటే పారిశ్రామికవేత్తలు, ప్రజలు అని ప్రతిపాదించే నివేదిక వారిరువురి మధ్య ఉండే సంబంధాన్ని గుర్తించదు. వారిరువురి మధ్య ఉండే సంబంధమే పట్టణమనే రూపంలాగా కనిపిస్తుందనీ, ఆ సంబంధాలలో మార్పే పట్టణ రూపాన్ని, రాశిని నిర్ణయిస్తుందనీ గ్రహించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఉదాహరణకి కలకత్తా నగరం గురించి మనం చిన్నప్పటినుంచి తెలుసుకున్న విషయమేమిటంటే అక్కడి ప్రాకృతిక పరిస్థితులను బట్టి ఆ చుట్టు పక్కల జనుము పండుతుందని, ఆ జనుము నార కింద తయారు చెయ్యవచ్చుననీ, ఈ నారతో గోనెసంచులు తయారు చెయ్యవచ్చుననే పారిశ్రామికవేత్తలు ఊహించిన క్రమంలో శ్రామికులు కూడా వలసవస్తారనీ, అదే ఆ నగరానికి ఒక రూపం ఇవ్వడం జరుగుతుందని అనుకోవచ్చును. అంతే కాకుండా ఈ గోనె సంచుల గిరాకీకి అనుగుణంగా పట్టణం పెరురిగి, అంతమేరకు పరిశ్రమలు పెగడంతో పాటు వలసలు కూడా పెరుగుతాయి. అప్పుడు అక్కడ ఒక శ్రామికవర్గం పెరుగుతుంది. ఆ శ్రామికవర్గం బతుకు తీరుతెన్నులు, వేతనాలు, ఇళ్లు లాంటి ఇతర కనీస సదుపాయాల గురించి కొన్ని పోరాటాలు చెయ్యవలసిన అవసరమూ వస్తుంది. దాంతో శ్రామికుల సంఘటిత శక్తి ఒక కార్మిక సంఘంగా రూపం దాల్చుకునే శక్తి, దానిని రాజకీయంగా మార్చుకునే శక్తి కలకత్తా నగరానికి ఉండే ఒక చారిత్రక విశిష్టత. ఆ విశిష్టతలోనే గోనెసంచుల గిరాకీ ఏ కారణం చేతనైనా తగ్గిపోతే, లేక శ్రామికవర్గం సంఘటిత శక్తి పెరిగి శ్రామికుల స్థితిగతులు మెరుగుపడిన క్రమంలో పెట్టుబడిదారుకి లాభాలు తగ్గిపోవడం వల్ల కాని, లేక శ్రామికుల రాజకీయ అవగాహన పెగడం వల్ల కాని, పెట్టుబడికి భయాందోళనలు కలగటం వల్ల కాని జనపనార పరిశ్రమ తగ్గుముఖం పట్టడంతో ఆ మహానగరం ఒక క్షీణ దశకు చేరుకుంటుంది. శ్రామికులు, పెట్టుబడిదారుల మధ్య సంబంధాలు గ్రహించకపోతే ఏ పట్టణం ఎప్పుడు ఎలా పెరుగుతుంది, ఎందుకు క్షీణిస్తుంది అనే ప్రశ్నకు సమాధానం దొరకదు. భారతదేశంలో కాని ప్రపంచంలో కాని ఏ నగరమైనా ఒక సామాజిక సంబంధాల కూడలిగా చూడకపోతే నగరమే అభివృద్ధి అనీ, నగరాల పెరుగుదల ద్వారానే అభివృద్ధి జరుగుతుందనీ, అంటే కేంద్రీకరణ ద్వారానే అభివృద్ధి వస్తుందనే, మరే అభివృద్ధి క్రమమూ లేదనే ఒక భయాందోళన ప్రచారం చెయ్యబడుతుంది. వికేంద్రీకరణ ద్వారా అభివృద్ధి రావచ్చుననీ, గ్రామాల అభివృద్ధి ద్వారా కూడా అభివృద్ధి సాధించవచ్చుననీ ఊహామాత్రంగానైనా అనుకోవడానికి ఈ వ్యూహంలో అవకాశం లేదు. మనం ముంబయి నగరం చూసినా కూడా ఇలాంటి చరిత్రే ఉంటుంది.

పట్టణాన్ని ఒక సామాజిక సంబంధాల కూడలిగా చూడకపోవడం ఈ నివేదికలో ప్రధాన లోపమైతే, దాని మూలాలు పారిశ్రామికవేత్తలు, ప్రజల మీద మెథడోలాజికల్‌గా అవగాహనలో స్పష్టత లేకపోవడం మరొక లోపం. ఎవరీ పారిశ్రామివేత్త? ఎవరీ ప్రజలు? అనే ప్రశ్న వేసుకోకపోవడం వల్ల నివేదికలో ఒక స్పష్టత కనిపించదు. అది మన ఊహకే వదిలివేయబడింది. పరిశ్రమలు పెట్టేవాడే పారిశ్రామికుడు, శ్రమ చేసేవాడే శ్రామికుడు అనే ఊహ మీద నివేదిక నడుస్తుంది. పరిశ్రమ అంటే ఏమిటి అనే ప్రశ్నని వేసుకుంటే అది ఒక వస్తూత్పత్తి జరిగే కేంద్రంగా, దాని ద్వారా మిగులు ఉత్పత్తి, మిగులు విలువలు తయారు చేసే స్థలంగా మనం ఒక అర్థం చెప్పుకుంటే, టాటాగారు జంషెడ్‌పూర్‌లో పెట్టిన ఉక్కు కర్మాగారం ఒక పరిశ్రమ అవుతుంది. ఆయన ఒక పారిశ్రామికవేత్త అవుతాడు. ఈ కర్మాగారంలో మానవశ్రమ చేయబడుతుంది. మళ్లీ మళ్లీ అదే శ్రమ జరిగి వస్తూత్పత్తి జరుగుతుంది. దీనినే ఒక పరిశ్రమ అంటాం. అది పెట్టిన టాటాగారిని పారిశ్రామికుడు అంటాం. ఈ టాటా కంపెనీ ఉక్కు ఉత్పత్తితో సరిపెట్టుకోకుండా, మిగిలిన వస్తువుల ఉత్పత్తిలో గణనీయమైన పాత్ర పోషించి ఒక కొత్త తరహా సేవా ఉత్పత్తి రంగంలో కూడా చేరారు. అది ఆకాశంలో ఉన్న విద్యుదయస్కాంత తరంగాలను క్రోడీకరించి ప్రజల వినోదార్థం టెలివిజన్‌కు అందించే వ్యవస్థ టాటా స్కై. వినోదం కోసం పుట్టిన ఈ ప్రక్రియ కూడా ఈ మధ్యకాలంలో పారిశ్రామికవేత్తల కార్యక్రమంగా చోటు చేసుకుంది. ఈ మధ్యకాలంలో సినిమాలు, టూరిజం, హోటళ్లు, కార్పొరేట్ ఆస్పత్రులు, కార్పొరేట్ కాలేజీలు లాంటి లాభాలు తెచ్చే అన్నింటినీ పరిశ్రమలుగా గుర్తించడంతో, పరిశ్రమ అనే దానికి ఒక విపరీతార్థం ఇవ్వడం జరుగుతోంది. ఎక్కడో అమెరికాలో ఉండే బ్యాంక్ ఖాతాదారునికి సలహాలు ఇవ్వడం కూడా ఒక ఐటి పరిశ్రమ కిందే చూస్తున్నారు. మన హైదరాబాద్ ఒక వస్తూత్పత్తి కేంద్రంగా ఉండే కాలం నుండి గత పది సంవత్సరాలుగా ఐటి పారిశ్రామిక కేంద్రంగా చూడడం జరుగుతోంది. పరిశ్రమల నిర్వచనం, రూపం మారినట్లే పారిశ్రామికుడు అనే దానికి కూడా అర్థం, రూపం కూడా మారిపోతోంది. వస్తూత్పత్తి ద్వారా మిగులు విలువలను సృష్టించే క్రమం నుంచి, లాభాలు ఎక్కడ ఉంటే అక్కడ పెట్టుబడి పెట్టే సంస్థలు, వ్యక్తులు పారిశ్రామికులుగా

మారారు. అందులో రహదారిలో కాపుకాసే బందిపోట్ల దగ్గర నుండి, స్మగ్లర్లు, వ్యాపరస్తులు, వడ్డీ వ్యాపారులు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు వీళ్లందరూ కూడా పారిశ్రామికవేత్తలుగా చలామణీ అవుతున్నారు. వస్తూత్పత్తి, అధిక వస్తూత్పత్తి దగ్గర మొదలు పెట్టిన పారిశ్రామికవేత్త, మారకపు విలువల ద్వారా లాభాలు ఎక్కువగా ఎక్కడ ఉంటాయో అక్కడికి వెళ్లేవారంతా పారిశ్రామికవేత్తలుగా చలామణీ అయిపోతున్నారు. పారిశ్రామికవేత్తలు, నగరాలు పెరుగుదల ద్వారా వచ్చిన అభివృద్ధినే ఒక అభివృద్ధిగా ప్రశంసించే ప్రపంచబ్యాంక్ నివేదిక ఈ పారిశ్రామికవేత్తల స్వభావాన్ని గుర్తించలేకపోవడం గమనార్హం. ఈ విపరీత స్థితిని అర్థం చేసుకోవాలంటే ఈ మధ్యనే క్రికెట్ క్రీడలో పుట్టిన ఐపిఎల్ అనే ఒక కొత్త పరిశ్రమని చూస్తే తెలుస్తుంది. ఇందులో శిల్పాశెట్టి, షారుఖ్‌ఖాన్ లాంటి సినిమాకి చెందిన నటులు, నటీమణులు డెక్కన్ క్రానికల్ అనే వార్తాపత్రిక, సారా ఉత్పత్తులు, కింగ్‌ఫిషర్ విమాన సంస్థ అధినేత విజయ్‌మాల్యా ఇలాంటి వాళ్లెందరో ఐపిఎల్ కారణంగా పారిశ్రామికవేత్తల కిందే చలామణీ అవుతున్నారు.

పట్టణాభివృద్ధికి పారిశ్రామికవేత్తలు ఒక పార్శ్వంగా ఉంటే ప్రజలు మరొక పార్శ్వంగా ఉండే ఒక రూపం. ఎవరీ ప్రజలు? వారు శ్రామికులా? లేక ఏ ప్రజలైనానా? బ్రిటిష్ కాలం నుంచీ ఇప్పటి వరకూ రాజ్యాధికారం, దానికి కావలసిన వ్యవస్థలు ఎక్కడ ఉంటే అది పట్టణంగా పెరగడం మనకి తెలిసిందే. అటువంటి పట్టణాలకు గ్రామాల నుండి వ్యవసాయం మీద ఆధారపడే రెంటియర్ క్లాస్ ప్రభుత్వ ఉద్యోగులుగా ఆకర్షించబడ్డారు. ఉదాహరణకు పట్టణంలో చాలా వరకూ ఒక కలెక్టరాఫీసు ఉందనీ, ఒక పోలీస్ స్టేషన్ ఉందనీ, ఒక వాణిజ్య పన్నుల శాఖ కార్యాలయం ఉందనీ, ఒక స్కూల్ ఉందనీ, ఒక సినిమా హాల్ ఉందనీ, చుట్టుపక్కల గ్రామాల నుండి పెత్తందారులు (రెంటీయర్స్) వచ్చి స్థిరపడడం, గుమస్తాల కింద స్థిరపడడం మనకు తెలిసిందే. మన పట్టణీకరణ చాలా వరకూ ఈ పెత్తందారులు, ప్రభుత్వ ఉద్యోగుల కేంద్రంగా జరుగుతుంది. అక్కడికి వలస వచ్చిన ప్రజలు చాలా వరకూ ఈ సేవారంగానికి చెందిన వాళ్లే. దీనికి భిన్నంగా వస్తూత్పత్తి కేంద్రంగా ఉన్న కలకత్తా కాని, ఒకానొక కాలంలో ముంబయి కాని జంషెడ్‌పూర్‌కి కాని వెళ్లిన వలసలు చాలా వరకూ శ్రామికులవే. మహబూబ్‌నగర్ నుండి దేశంలో వివిధ ప్రాంతాలకు పనులకోసం వలస వెళ్లే పాలమూరు లేబర్ అవవచ్చును, శ్రీకాకుళం నుండి కృష్ణా, గుంటూరు జిల్లాలకు కూలీ పనులకు వెళ్లే శ్రామికులవవచ్చును, లేక ఒరిస్సాలోని కలహండి జిల్లా నుండి సంబల్‌పూర్, రూర్కెలా పట్టణాలకు వెళ్లే శ్రామికులవ వచ్చును, ఒరిస్సా నుండి అహమ్మాదాబాద్ మిల్లులలో పనికి, ఢిల్లీ లాంటి పెద్ద పట్టణాలలో భవన నిర్మాణ పనులకు వలస వెళ్లే ప్రజలంతా శ్రామికులే. వీరంతా జీవనోపాధి నిమిత్తం వేరే ప్రాంతాలకు వలస వెళ్లినా కూడా, ఆ వలస ప్రాంతంలో అనిశ్చిత పరిస్థితులను ఎదుర్కొవడంలో అభద్రతా భావానికిలోనై, తమకు తెలిసిన భద్రతను కోరుకుంటూ స్వస్థలానికి తిరిగి చేరుకుంటారు. ఇలా చూసినప్పుడు ప్రజలు అని ఒక మూసలో చెప్పడం, విశ్లేషణ క్రమానికి దూరంగా నిరుపయోగకరంగా ఉంటుంది. ఏ ప్రజలు వలస వెళుతున్నారు? ఆ వలసలో స్థిరత్వముందా? వలసల ద్వారా పట్టణాభివృద్ధి జరిగి ఇది దేశాభివృద్ధికి దోహదపడుతుందా? అనే ప్రశ్నలు నివేదిక వేసుకోదు. అందువలన సమాధానాలు కూడా చూడదు.

నివేదికలో పట్టణాభివృద్ధికి మనుషులు, అంటే పారిశ్రామిక వేత్తలు, శ్రామికులు, వారి వలసలు కావాలని చెప్పింది కాని దీని విశ్లేషణ అసంపూర్ణంగా ఉండిపోయింది. పారిశ్రామికవేత్తలు ఎవరు? ఎక్కడి నుండి వచ్చారు? ఏ ఉద్దేశంతో వచ్చారు అనే చరిత్ర ఎంత అవసరమో, శ్రామికులు ఎక్కడ నుండి వచ్చారు? ఈ శ్రామికులు ఎవరు? ఏ ఉద్దేశంతో వచ్చారు అనే చరిత్ర కూడా అభివృద్ధిని అవగాహన చేసుకునే క్రమానికి ముఖ్యమౌతుంది. నివేదిక పట్టణాభివృద్ధికి అవసరమైన రెండు భాగాలు ఉంటాయని గుర్తించినా వాటి మధ్యన ఎటువంటి సంబంధాలు ఉంటాయనే ప్రశ్న వేసుకోదు. పైగా నిన్నటి మురికివాడలే ఇవాళ్టి మహాపట్టణాలనీ, ఈ మార్పే అభివృద్ధికి ఒక సూచిక అని చెప్పింది. ఈ రెండు భాగాల మధ్యన (పారిశ్రామికులు, శ్రామికులు) ఒక గతితార్కిక సంబంధమా, సరళీకృత సంబంధమా అనేది కూడా తెలియదు. ఇలా చూడటంలో పారిశ్రామికవేత్తనే సమాజపు నేతృత్వపాత్రలో చూడటమవుతుంది. ఆ పారిశ్రామికవేత్త ఎక్కడ పుట్టినా, ఎక్కడ ఉన్నా ప్రపంచవ్యాప్తంగా వలస వెళ్లగలిగే పరిస్థితులే గ్లోబలైజేషన్‌గా ప్రసిద్ధి చెందింది. పారిశ్రామికవేత్త ఒక్కడే ఏం చెయ్యలేదు. శ్రామికుడు కూడా కావాలి కాబట్టి వీరి వలసల గురించి కూడా నివేదికలో ప్రస్తావించింది. నివేదికలో పట్టణాభివృద్ధిని రెండు భాగాల కింద చూసినా వాటి మధ్య సంబంధాలు చూడకపోతే నివేదిక విశ్లేషణా రాహిత్యమై, వర్ణనకే పరిమితమైపోయి నియంతృత్వ పద్ధతిలో ఈ నివేదిక సాగుతుంది. అందువలన పారిశ్రామికవేత్తలు లేకుండా అభివృద్ధి సాధించగలమా అనే ప్రశ్న రాదు. అందువలన దానికి ఒక సమాధానం కూడా ఉండదు. అందుకేనేమో సోషలిస్టు దేశాల ప్రయోగాలను అవసరాత్మక మతిమరుపు లో భాగం కిందే మరిచిపోతారు.

చివరగా నివేదికలో అభివృద్ధిని ఒక నీటి ప్రవాహంతో పోలుస్తూ, అభివృద్ధి చెందిన దేశాలు నీటి ప్రవాహంలో తాము ప్రయాణం చేయడం ద్వారా ఒక రహదారి తయారు చేసాయనీ, ప్రస్తుతం అభివృద్ధి చెందుతున్న దేశాలు అదే మార్గంలో ప్రయాణిస్తున్నాయనీ, అటువంటి వేగమే, అదే మార్గమే కాని ఈ దేశాలు ప్రయాణిస్తున్న నావ పరిమాణంలో తేడాలుంటాయనీ ఒక ఉపమానం ద్వారా తెలిపింది. నీటి ప్రవాహపు వేగానికి, నావ పరిమాణానికి, నావ ప్రయాణించే వేగానికి సంబంధం ఉంటుందన్న విషయాన్ని పక్కన పెట్టినట్లయింది. ఇలా సూత్రీకరించడం లో అభివృద్ధి అంటే వ్యవసాయం మీద ఆధారపడే సమాజాలు పరిశ్రమలకు మారిపోవటమేననీ, దానికి ఏకైక మార్గం ఉందనీ, అది తమకు తెలుసుననీ, మిగతా దేశాలు తమ సహాయంతో ఈ దారినే ఎంచుకుని అభివృద్ధి చెందవచ్చనీ నివేదికలో ప్రతిపాదనలు కనిపిస్తాయి. అభివృద్ధి అంటే పెట్టుబడిదారీ సమాజంగా మారడమేననీ, దానికి ఇతర ఏ మార్గాలు లేవనే భావన నివేదికలో అంతర్లీనంగా కన్పిస్తుంది. ఇటువంటి దృష్టికోణంలో ప్రపంచ బ్యాంక్ ఇతర దేశాల అభివృద్ధిని పరిశీలించిన కారణంగా అభివృద్ధికి ప్రత్యామ్నాయ మార్గాలేవి కనిపించలేకుండా పోయాయి.

(ముగిసింది)

*సిద్ధాంతం, ఆచరణ ఒక దానిని మరొకటి ప్రభావితం చేసుకుంటాయనీ, క్షేత్రపరిశోధనతోనే సైద్ధాంతిక అవగాహన రాటుదేలుతుందనీ చెబుతూ తన క్షేత్రపరిశోధనా అనుభవాలను వివరిస్తున్నారు* **పి.సి. జోషి** *(ప్రొఫెసర్ పి.సి. జోషి, ఢిల్లీలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనమిక్ గ్రోత్ పూర్వ సంచాలకులు. 1979 లో అచ్చయిన 'ది ఫీల్డ్ వర్కర్ అండ్ ది ఫీల్డ్ : ప్రాబ్లమ్స్ అండ్ చాలెంజెస్ ఇన్ సోషియోలాజికల్ ఇన్వెస్టిగేషన్' పుస్తకం నుంచి)*

# క్షేత్రపరిశోధన అనుభవం - పునస్సమీక్ష

నేను లక్నో విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర శాఖలో పిఎచ్.డి. పరిశోధన కోసం ఏ విషయం అధ్యయనం చేయాలని ఆలోచించిన సందర్భంలో, అంటే ఇరవై ఐదు సంవత్సరాల కింద, సామాజిక శాస్త్రజ్ఞులలో క్షేత్రపరిశోధన పట్ల పెద్ద గౌరవం ఉండేది కాదు. సాధారణంగా మొదటిశ్రేణిలో పాసైన విద్యార్థులు సైద్ధాంతిక అంశాల మీద పరిశోధన చేస్తారనీ, రెండోశ్రేణి విద్యార్థులు సులభంగా ఉంటుందనే ఉద్దేశంతో క్షేత్ర పరిశోధన చేస్తారనీ అభిప్రాయం ఉండేది. విద్యావేత్తలలో అటువంటి చిన్నచూపు ఉన్నప్పటికీ నేను క్షేత్ర పరిశోధననే ఎంచుకున్నాను. ఎందుకంటే అప్పటికే నాకు ఉండిన రాజకీయ సంబంధాలు క్షేత్ర పరిశోధనను చాలా గౌరవంగా చూసేవి.

అప్పటికి నాకు అధ్యాపకులుగా ఉన్న సుప్రసిద్ధ మేధావులు డి.పి. ముఖర్జీ, రాధాకమల్ ముఖర్జీ, డి.ఎన్. మజుందార్‌ల మధ్య క్షేత్ర పరిశోధన విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఉండేవి. క్షేత్ర పరిశోధకుడు క్షేత్రపరిశోధన ద్వారా తెలుసుకునేది ఏమీ ఉండదనీ, తన అభిప్రాయాలనే క్షేత్ర పరిశోధనలో కనిపెట్టినట్టు చెపుతాడనీ, పరిశీలకుడికి ఒక సిద్ధాంతమో, దృక్పథమో లేనట్లయితే పరిశోధించడానికి ఏమీ ఉండదనీ డి.పి. ముఖర్జీ అనేవారు. ఉత్తరప్రదేశ్ గ్రామాలలో క్షేత్రపరిశోధన కోసం వెళుతున్నాననీ, నాకేమైనా సలహాలిస్తారా అనీ ఆయనను 1952లో నేను అడిగినప్పుడు ఆయన ఈ మాటలు చెప్పారు. భారతదేశంలో అప్పటివరకూ క్షేత్ర పరిశోధన అంటూ సాగినదంతా కేవలం కొన్ని వాస్తవాలను గుదిగుచ్చడమేననీ, ఆ వాస్తవాలను అర్థం చేసుకోవడం గానీ, లోతుగా పరిశీలించడం గానీ జరగలేదనీ ఆయన గట్టిగా చెప్పారు. క్షేత్రపరిశోధన చేయడం కన్న సైద్ధాంతిక విషయాల పట్ల అవగాహన పెంచుకోవడం, ప్రామాణిక గ్రంథాలు చదవడం ముఖ్యమని ఆయన అన్నారు. ఒక పరిశోధక విద్యార్థి ప్రామాణిక గ్రంథాలు చదివే అలవాటు చేసుకోకుండా, వాటినుంచి సైద్ధాంతిక వివరణ పొందకుండా ఉన్నట్లయితే జీవితాంతమూ తలా తోకా లేకుండా ఆలోచిస్తూ ఉంటాడని ఆయన అన్నారు.

రాధాకమల్ ముఖర్జీ అభిప్రాయాలు సరిగ్గా ఇందుకు భిన్నంగా ఉండేవి. భారతదేశంలో పరిశోధకులు సైద్ధాంతిక కృషి అనే పేరు మీద క్షేత్ర పరిశోధనను తప్పించుకునే అలవాటు చేసుకున్నారని ఆయన అనేవారు. అందువల్ల అట్టడుగు స్థాయికి వెళ్లి వాస్తవాలు కనిపెట్టడం కాకుండా, పడక్కుర్చీలో పడుకుని తాత్విక ఆలోచనలు అల్లుతూ ఉంటారని ఆయన అన్నారు. పరిశోధక విద్యార్థి తన వ్యక్తిత్వం రూపొందే తొలి రోజుల్లో క్షేత్ర పరిశోధన చేసే అలవాటును గనుక పెంపొందించు కోనట్టయితే తరువాతి రోజుల్లో అది సాధ్యమే కాదని ఆయన అన్నారు. క్షేత్రపరిశోధన అనుభవం లేకుండా ఒక పరిశోధకుడు ఎప్పటికీ భూమ్మీద కాలు ఉంచి మాట్లాడలేడని ఆయన అన్నారు.

ఈ రెండు దృక్పథాలూ ఒకదానికొకటి పరస్పర వ్యతిరేకమైనవని నాకు అనిపించింది. నేను గందరగోళపడ్డాను. విరుద్ధ దిశలలోని రెండు శక్తులు నన్ను అటూ ఇటూ లాగుతున్నట్టూ, నేను చీలికలౌతున్నట్టూ అనిపించింది. ఎన్నో రాత్రులు నిద్రకు వెలి అయి గడిపాను. కాని, ఇప్పుడు ఇరవై ఐదేళ్లు గడిచిన తరువాత వెనక్కి తిరిగి ఆలోచిస్తే అలా రెండు దృక్పథాలూ నామీద ప్రభావం చూపడం నా అదృష్టమని భావిస్తాను. ఇప్పుడు నాకు సంపూర్ణంగా అర్థమైన విషయమేమంటే, సిద్ధాంతం లేకుండా వాస్తవ సేకరణ అనే దానికి దిశ లేదు. వాస్తవ సేకరణ లేకుండా సిద్ధాంతం అనే దానికి దృఢత్వం లేదు. అందువల్ల ఈ రెండూ ఒకదానికొకటి జతపడవలసినవే. ఈ రెండూ ఒకదానికొకటి వ్యతిరేకమైనవి కావు. రాధాకమల్ ముఖర్జీ చెప్పినట్టు క్షేత్రపరిశోధన పరిశోధకుడికి మానవజీవితం గురించీ, ఆ జీవితంలోని సమస్యల గురించీ అందులో ఇమిడి ఉన్న సంక్లిష్టత గురించీ ప్రత్యక్ష అనుభవం కలగజేస్తుంది. మరోవంక డి.పి. ముఖర్జీ చెప్పినట్టుగా సైద్ధాంతిక విషయాలలో అభిరుచి ఆ సంక్లిష్టతలో ఉన్న క్రమాల గురించి, క్రమబద్ధత గురించి అవగాహన ఇస్తుంది. ఒక శాస్త్రీయ పరిశోధకుడికి ఉండే పనిముట్లలో ఈ రెండూ అతిముఖ్యమైనవి.

ఉత్తరప్రదేశ్‌లోని వ్యవసాయ సమాజాన్ని అధ్యయనం చేయడంలో నేను పొందిన అనుభవాలలో కొన్నింటిని ఇక్కడ వివరించడానికి ప్రయత్నిస్తున్నాను. ఇక్కడ ప్రధానంగా నా క్షేత్రపరిశోధన అనుభవం గురించే వివరిస్తున్నప్పటికీ నా అధ్యయనంలో సిద్ధాంతమూ, క్షేత్ర పరిశోధనా పరస్పరం ఎట్లా సంబంధంలోకొచ్చాయో చూపడానికి కూడా ప్రయత్నిస్తాను. అప్పటికే నాకు సైద్ధాంతిక పరిజ్ఞానం ఏమీ లేనట్టయితే నా క్షేత్రపరిశోధన అనుభవం తక్కువ సారవంతంగా, తక్కువ ఆసక్తికరంగా ఉండేది. నా సైద్ధాంతిక దృక్పథం వల్ల వ్యవసాయ సమాజంలో వర్గ విశ్లేషణ చేయాలని నేను అనుకున్నాను. కాని, క్షేత్ర పరిశోధన అనుభవం వల్ల ఈ సైద్ధాంతిక వైఖరిలో కొన్ని ఖాళీలున్నాయనీ, వాటిని పూరించాలనీ అర్థం చేసుకున్నాను. వర్గ సిద్ధాంతంలో నేను

నేర్చుకున్న దానికీ, ప్రత్యక్ష పరిశీలనలో నేను గ్రహించిన దానికీ మధ్య అంతరం ఉన్నదని నాకు అర్థమైంది. వ్యవసాయ సమాజాన్ని వర్గసమాజంగా చూడడంలో, రైతాంగాన్ని ప్రామాణికార్థంలో వర్గంగా పరిగణించడంలో ఉన్న ఇబ్బందులేమిటో నాకు క్షేత్ర పరిశోధనలో అర్థమయ్యాయి. అలాగే ఉత్తరప్రదేశ్‌లోని విభిన్న ప్రాంతాలలో వేరు వేరు వాస్తవాలు ఉన్నాయనీ, కొన్ని చోట్ల భూస్వాముల ప్రాధాన్యత ఉండే వ్యవసాయ విధానం ఉండగా, మరికొన్ని చోట్ల రైతుల ప్రాధాన్యత ఉండే వ్యవసాయ విధానం ఉన్నదనీ నాకు క్షేత్రపరిశోధన తెలియజేసింది. భూస్వాముల ఆలోచనా విధానానికి, రైతుల ఆలోచనా విధానానికి మధ్య తేడా ఉన్నదని, భూస్వాములు ఎక్కువగా యథాస్థితి వాదాన్ని నమ్ముతారని నాకు క్షేత్ర పరిశోధన ద్వారానే అర్థమైంది. క్షేత్రపరిశోధనలో తెలిసిన ఈ విషయాల వల్ల ఆర్థికాభివృద్ధికి అవసరమైన వ్యవస్థాగత నిర్మాణాలు ఏమిటనే విషయంలో నా సైద్ధాంతిక అవగాహనను సవరించుకోవలసి వచ్చింది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పరివర్తన జరగడానికి రైతు ఆర్థిక వ్యవస్థలో, రైతుల ఆలోచనలలో ఎంత అవకాశం ఉన్నదో నాకు క్షేత్రపరిశోధన ద్వారానే అర్థమైంది.

క్షేత్రపరిశోధనలో నేను పరిశీలించిన విషయాలు మాత్రమే కాదు, ప్రజల నుంచి నేను నేర్చుకున్న విషయాలు కూడా ఉన్నాయి. ప్రజలతో సంభాషిస్తూ ఉన్నప్పుడు రైతాంగ ఆర్థిక వ్యవస్థ ఎంత బలమైనదో, రైతాంగ ఆలోచనా విధానం ఎంత శక్తిమంతమైనదో నేను గుర్తించగలిగాను. కొన్ని ప్రాంతాలలో రైతాంగ ఆలోచనా విధానం పైన విశ్రాంతి వర్గాల ఆలోచనా విధానం ప్రభావం వేసింది. మరికొన్ని ప్రాంతాలలో రైతాంగ ఆలోచనా విధానమే స్వతంత్రంగా, బలంగా నిలిచి ఉంది. ఇది చూసిన తరువాత నేను ఆలోచనా విధానం అనేదాన్ని కొత్త వెలుగులో చూడగలిగాను. ఆలోచనా విధానమనేది కేవలం భౌతిక వాస్తవికతకు నిష్క్రియాపూర్వకమైన ప్రతిఫలనం కాదు. దానికదే ఒక క్రియాశీలకమైన సామాజిక శక్తి. అది మనిషి చొరవను విశాలమైనా చేస్తుంది, సంకుచితమైనా చేస్తుంది. ఈ కొత్త అవగాహనతో అంతవరకు నాకు ఉన్న పాక్షిక దృక్పథం పటాపంచలైపోయింది. అప్పటివరకు ఆర్థిక శక్తుల పాత్ర గురించి నాకు ఉండిన అవగాహన మారిపోయింది.

క్షేత్రపరిశోధకుడికీ క్షేత్రానికీ మధ్య ఏర్పడే సంబంధం రెండు విభిన్న సంస్కృతుల మధ్య ఏర్పడే సంబంధం. ఈ రెండు సంస్కృతుల అవగాహన చట్రాలు ఒకేరకమైనవి కావు. ఈ రెండు సంస్కృతులకు ఉమ్మడి విలువల చట్రం గాని, ఒకే ప్రాపంచిక దృక్పథం గాని లేవు. పరిశోధకుడు గ్రామీణ జీవితంలోని విభిన్న రంగాల కార్యాచరణలను, క్రమాలను పరిశీలిస్తాడు. వాటిలో ప్రతి ఒక్కదానికి తన విలువల ప్రకారం అర్థాలు ఆపాదిస్తాడు. కాని గ్రామీణ ప్రజానీకంలోని విభిన్న బృందాలు ఆ కార్యాచరణలకు, క్రమాలకు తమ విలువల ప్రకారం తమ అర్థాలు చెప్పుకుంటాయి. ఈ రెండు అర్థాలు ఒకటి కావు. ఉదాహరణకు, కౌలు రూపంలో దోపిడీ, బలవంతపు చాకిరీ అనేవాటిని పరిశోధకుడు భూస్వామ్య దోపిడీ సూచికలుగా గ్రహిస్తాడు. కాని, అవే విషయాలను భూస్వాములు, భూస్వామ్య భావజాలపు ప్రభావంలో ఉండే కౌలుదారులు విభిన్నంగా చూడవచ్చు. అలాగే పరిశోధకుడు భూమిని ఒక ఆర్థిక వనరుగానో, లాభార్జన సాధనంగానో చూడవచ్చుగాని, ఆ భూమి సొంతదారులు దాన్ని తమ సామాజిక హోదాకూ, అధికారానికీ వనరుగా చూస్తారు. వృథా ఖర్చుగా క్షేత్రపరిశోధకుడు పరిగణించేది, ఆ ఖర్చు పెట్టే వ్యక్తులకూ, బృందాలకూ తమ హోదాను కొనసాగించడానికి, పెంచుకోవడానికీ అత్యవసరమైనదిగా కనబడవచ్చు.

క్షేత్రపరిశోధకుడు సాధారణంగా బయటినుంచి వెళ్లినవాడై ఉంటాడు. అందువల్ల తన అర్థాల, నిర్వచనాల పద్ధతిని తాత్కాలికంగా పక్కనపెట్టి ప్రజల అర్థాల పద్ధతిని అర్థం చేసుకోవాలని ప్రయత్నించడం మానసికమైన ఒత్తిడికి దారితీస్తుంది. ఒకవేళ ప్రజలలో కూడా విలువల ఘర్షణ గురించిన చైతన్యం పెరుగుతూ, పాత సమాజపు విలువల చట్రాలూ, భావాలూ బద్ధలవుతున్న సమయంలో పరిశోధకుడి ఇబ్బందులు మరింతగా పెరుగుతాయి. ఎందుకంటే అప్పుడు క్షేత్రంలోనే భిన్నమైన విలువల చట్రాలు కనబడతాయి. ఒక వ్యవస్థ లోపల ఉన్నవారి అభిప్రాయాలు వ్యక్తం చేసేటప్పుడు అందులో ఒకవర్గం – ఆధిపత్య వర్గం, అభిప్రాయాల్ని వ్యక్తీకరించ గలిగిన వర్గం ఒకరకమైన విలువలను ప్రకటిస్తుంది. మరొక వర్గం – అణగారిపోయినవర్గం, అభిప్రాయాలు వ్యక్తం చేయలేని వర్గం మరొకరకమైన విలువలను ప్రకటిస్తుంది. సామాజిక శాస్త్రాలు చెప్పే వర్గీకరణల సహాయంతో బయటి నుంచి చూడడానికీ, అదే సమయంలో ఆ వ్యవస్థను లోపలి నుంచి ఆధిపత్య, పాలిత వర్గాలుగా చూడడానికీ మధ్య ఉండే ఘర్షణ క్షేత్రపరిశోధనలో ప్రధానమైన సవాలు. తన అవగాహనలో ఉన్న వర్గీకరణలను సవరించుకునే ప్రక్రియలో క్షేత్రపరిశోధకుడు ఎంత విజయం సాధించగలిగితే మొత్తంగా క్షేత్రపరిశోధనలో అంత విజయం సాధించగలడు. అంతేకాదు, క్షేత్రపరిశోధన ద్వారా తాను తెలుసుకుంటున్న ప్రజల లోపలి భావాలలో కూడా ఎంతగా తప్పుడు చైతన్యం పాత్ర ఉందో కూడా క్షేత్రపరిశోధకుడు అంచనా కట్టగలగాలి.

ఈ వ్యక్తిగత అనుభవాన్ని సాధారణీకరిస్తే క్షేత్రపరిశోధనా క్రమంలో నాలుగు ప్రధాన దశలున్నాయని నేను విభజించగలను. నా జ్ఞానసముపార్జన క్రమంలో నాలుగు మలుపులను అవి సూచిస్తాయి.

మొదటిదశ, మొట్టమొదట తగిన సాహిత్యాన్ని సాధారణంగా అధ్యయనం చేయడం ద్వారా నా క్షేత్రపరిశోధనకు ఒక తాత్విక, సైద్ధాంతిక పునాదిని ఏర్పర్చుకోవడానికి నేను ప్రయత్నించాను. ఈ అధ్యయనం ద్వారా నా పరిశోధనా అంశం ఏమిటో నేను స్థూలంగా నిర్ణయించు కోగలిగాను.

రెండోదశ, ఈ దశలో నా క్షేత్రపరిశోధన ప్రారంభమైంది. వెనక్కి తిరిగి ఆలోచిస్తే ఆ ప్రయత్నం వాస్తవాలను సేకరించడంతో మొదలైందని అనిపిస్తుంది. వాస్తవంగా క్షేత్రంలో ఏమి జరుగుతోంది అని గుర్తించి, అప్పటికే నా సామాజిక సిద్ధాంత అధ్యయనం నుంచి రూపొందిన భావనాత్మకమైన, విశ్లేషణాత్మకమైన పెట్టెలలో ఈ వాస్తవాలను పడేశాను. ఆ దశలో ఎక్కడైనా నాకు అందిన సిద్ధాంతానికి భిన్నమైన, ఇబ్బందికరమైన వాస్తవాలు కనబడితే నేను వాటిని పరిగణనలోకి తీసుకోకుండా పక్కన పెట్టేశాను. నా సిద్ధాంత అవగాహనకు నిర్ధారణలు ఎక్కడ దొరుకుతాయా అని వెతికాను కాని ఆ అవగాహనను తిరస్కరించే ఉదాహరణలను విస్మరించాను.

మూడోదశ, క్షేత్రపరిశోధన ద్వారా నాకు తెలిసివచ్చిన సామాజిక

వాస్తవికత ఎంత సంక్లిష్టమైనదంటే, అది నా మనస్సు మీద ప్రగాఢమైన ప్రభావం వేసింది. అప్పటిదాకా నేను చదువుకున్న సిద్ధాంతాలను గుడ్డిగా నమ్మడం సరైనది కాదని నాకర్థమైంది. అప్పటిదాకా నిశ్చలనిశ్చితాలుగా నేను చెప్పుకున్నవి సందిగ్ధంలో పడ్డాయి. నా మొత్తం పరిశోధనా కృషిలో ఈ దశ అత్యంత బాధాకరమైన దశ. సామాజిక వాస్తవికతకు అపారమైన, దిగ్భ్రాంతికరమైన సంక్లిష్టత ఉన్నదని తెలుసుకోవడం, ఈ సంక్లిష్టతను పరిగణనలోకి తీసుకోవడంలో నాకు అందిన సైద్ధాంతిక వర్గీకరణలు సరిపోవని అర్థం చేసుకోవడం నన్ను నిరాశలోకి నెట్టాయి. అసలు నా సైద్ధాంతిక అవగాహనలు పనికొస్తాయా లేదా అని నాకు అనుమానమూ, నిరుత్సాహమూ మొదలయ్యాయి. నా క్షేత్రపరిశోధనలోని అనుభవాలు నన్ను ఎంతగా ముంచెత్తాయంటే కుప్పల కొద్దీ నిర్దిష్ట సమాచారంలో నేను మునిగిపోయాను. చెట్లను చూస్తూ అడవిని గుర్తించడం మరిచిపోయాను. ఈ దశ నేను అనుభవ వాదానికి, కనబడిన దానికే ప్రాధాన్యం ఇవ్వడానికి లొంగిపోయిన దశ. ఇది సరిగ్గా రెండో దశకు వ్యతిరేకం. రెండో దశలోనేమో పిడివాద సిద్ధాంతపు ప్రభావంలో ఉండిపోయాను. సైద్ధాంతిక భావనలు పవిత్రమైనవని, వాస్తవానికి ప్రత్యామ్నాయాలని భావించాను. సైద్ధాంతిక భావనలు కష్టభరితమైన పరిశోధనకు సహకారంగా ఉండవలసినవేనని గుర్తించకుండా ఉండిపోయాను.

నాలుగో దశ, కుప్పతెప్పల నిర్దిష్ట సమాచారంలో మునిగిపోయి, ఈ వాస్తవాలలో ముఖ్యమైనవేమిటి, ముఖ్యం కానివేమిటి అని వేరు చేయడంలో నాకు సహకరించే పనిముట్లు ఎక్కడ దొరుకుతాయా అని వెతికేటప్పుడు ఈ దశ మొదలైంది. ఈరకంగా నేను నా పరిశోధనలో దొరికిన సమాచారపు వెలుగులో నా సైద్ధాంతిక భావనలను పునస్సూత్రీకరించడం ప్రారంభించాను. వాస్తవ సేకరణ అనేది సైద్ధాంతిక పునర్నిర్మాణానికి చోదక శక్తి అవుతుందనీ, సైద్ధాంతిక పునర్నిర్మాణం మరింత లోతైన వాస్తవ సేకరణకు దారితీస్తుందనీ నాకు అర్థమైంది. ఈ దశలో నా మనస్సులో సైద్ధాంతిక సాధారణీకరణకూ, నిర్దిష్ట వాస్తవికతకూ మధ్య ఉన్న అఖాతం చెరిగిపోయింది. రెండు క్రమాల మధ్య ఐక్యత సాధ్యమైంది. పరిశోధనలో పొందగల మహోన్నత ఆనందమేమిటో నా అవగాహనకు వచ్చింది. మూడో దశలో నేను పొందిన నిరాశా నిరుత్సాహాల నుంచి అది నన్ను బయటికి లాగింది. నా క్షేత్రపరిశోధనను పునర్నిర్మించుకునే క్రమంగా సాగిన ఈ దశ నా సిద్ధాంత వ్యాసం రాయడంతో ముగిసిపోలేదు. క్షేత్ర పరిశోధనా అనుభవాన్ని పునర్నిర్మించడమనేది జీవితాంతం సాగే ప్రక్రియ అని ఇప్పుడు నేను అనుకుంటున్నాను.

గత ఇరవై ఐదు సంవత్సరాలలో నేను అతి తీవ్రంగా సాగించిన క్షేత్రపరిశోధన 1952-53 నాటిదే. ఆ తరువాత కూడా ఢిల్లీ విశ్వవిద్యాలయ వ్యవసాయ అర్థశాస్త్ర పరిశోధనా కేంద్రం జరిపిన క్షేత్రపరిశోధనలతో నాకు సంబంధం ఉన్నప్పటికీ, అక్కడ పూర్తిగా నా భాగస్వామ్యం లేదు. గ్రామంలో ఎక్కువ కాలం నివసించవలసిన అవసరం కూడా ఉండేది కాదు. కాని నా మొదటి తీవ్రమైన క్షేత్రపరిశోధనలోనే నా మనసు మీద ఎన్నో చెరిగిపోని ముద్రలు పడ్డాయి. ఆ అనుభవం పొందినప్పుడు నేను దాని గురించి చైతన్యయుతంగా ఆలోచించినది తక్కువ. కాని, ఆ తరువాత సంవత్సరాలలో నా సైద్ధాంతిక దృక్పథం విశాలమైనకొద్దీ, లోతు పెరిగిన కొద్దీ నా పాత క్షేత్రపరిశోధన అనుభవం వేరువేరు రూపాలలో వేరువేరు సమయాలలో నాకు గుర్తు వస్తూ ఉండేది. కొత్త అంశాలను చూపెడుతూ ఉండేది. కొత్త సైద్ధాంతిక సూత్రీకరణలకూ, సవరణలకూ దారితీస్తుండేది. అంటే ఒక మనిషి జీవితంలో క్షేత్రపరిశోధన అనుభవం ఒకే ఒక్కసారి ఉన్నప్పటికీ అది ఎప్పటికప్పుడు పునర్జీవించే ప్రక్రియ. తన మనస్సులో ఎన్ని రకాల ముద్రలు పడ్డాయో, ఎన్ని రకాల ప్రతిస్పందనలు కలిగాయో, వాటిని విభిన్న సామాజిక ప్రక్రియలను అర్థం చేసుకోవడానికీ, వ్యాఖ్యానించడానికీ ఎంత సృజనాత్మకంగా వాడవచ్చునో, ఆ తరువాత సంవత్సరాలలో గుర్తించి పరిశోధకుడే ఆశ్చర్యపోతాడు.

గ్రామీణ ప్రాంతాలలో క్షేత్రపరిశోధన జరపాలనే నా ఆసక్తి - భూమి సమస్య గురించి నా ఆసక్తి వల్ల రూపొందింది. ఉత్తరప్రదేశ్ గ్రామాలలో క్షేత్రపరిశోధన కోసం నేను ఉవ్విళ్లూరిన ఆ 1950ల తొలిరోజులు నాకెప్పుడూ గుర్తొస్తాయి. అప్పుడు ఏ సంస్థ నుంచీ నాకు ఏ ఆర్థిక సహాయం లేదు. గ్రామీణ ప్రజల మీద సంపూర్ణమైన నమ్మకంతో వారి ఔదార్యం మీదా, ఆతిథ్యం మీదా నమ్మకంతో నేను ఆ పనికి దిగాను. భూమి సమస్య గురించి నా అవగాహన కేవలం పుస్తకాల మీద, రెండో స్థాయి పరోక్ష సమాచారం మీద ఆధారపడి ఉన్నంతకాలమూ అది సంపూర్ణం కాజాలదని నాకనిపించింది. గ్రామీణ ప్రజల మధ్య జీవిస్తూ వారిని అధ్యయనం చేసినప్పుడే లోతైన అవగాహన కలుగుతుందని నాకు అనిపించింది.

వ్యవసాయరంగ అధ్యయనం పట్ల నాకు ఆసక్తి కలగడానికి కారణాలు రాజకీయరంగంలోనూ, విద్యారంగంలోనూ కూడా ఉన్నాయి. యువ విద్యార్థిగా నా మానసిక అవగాహనలను తీర్చిదిద్దినవి రెండు శక్తిమంతమైన ప్రభావాలు. మొదటిది, స్వాతంత్ర్యం తరువాత తొలి సంవత్సరాలలో కమ్యూనిస్టు ఉద్యమంలో నా భాగస్వామ్యం. రెండవది, లక్నో విశ్వవిద్యాలయంలో ఆర్థిక, సామాజిక శాస్త్ర శాఖలో అర్థశాస్త్రంలో నేను పొందిన శిక్షణ. ఆ రోజుల్లో ఆ శాఖ అర్థశాస్త్రాన్నీ, సామాజిక శాస్త్రాన్నీ, నృశాస్త్రాన్నీ (ఆంథ్రొపాలజీ) సమగ్రంగా కలిపింది. ఇంతకు ముందే చెప్పినట్టు అక్కడ ముగ్గురూ ప్రసిద్ధ మేధావుల ప్రభావానికి నేను లోనయ్యాను. ఆ ముగ్గురు కూడా తాము ఎంచుకున్న రంగాలలో అపారమైన జ్ఞానంతో సమగ్రమైన అవగాహనలతో జీవితాంతం కృషి చేసినవారు.

నేను రాజకీయాలలో ప్రవేశించకముందు నా కుటుంబంలో, నేను పుట్టి పెరిగిన పట్టణం అల్మోరాలో ఉండిన సాంస్కృతిక వాతావరణం నాలో నేర్చుకోవాలనే జిజ్ఞాసను పెంచిపోషించింది. అలాగే సమాజంలో బలహీనులపట్ల, అణగారినవర్గాల పట్ల గాఢమైన సానుభూతిని కూడా కలిగించింది. 1950ల తొలిరోజుల్లో కమ్యూనిస్టు రాజకీయాలలో మేధోపరమైన తపన, అణగారిన వర్గాల ప్రయోజనాల కొరకు శ్రమించే దీక్ష కలగలిసి ఉండడం వల్ల నన్ను అవి ఆకర్షించాయి. ఆ రాజకీయాలు నా మేధో అన్వేషణను తీర్చాయి. నైతికంగానూ ఆకర్షించాయి. నేను సాంప్రదాయికంగా నేర్చుకున్న ఉదాత్త జీవితం అనే భావనకు ఆనాటి కమ్యూనిస్టు జీవితం సన్నిహితంగా కనిపించింది. అలాగే జ్ఞాన సముపార్జన అనేది దానికోసం అదిగా కాక, సమాజ సేవా సాధనంగా కమ్యూనిస్టులు చూడడం కూడా నాకు నచ్చింది.

అలాగే సిద్ధాంతాన్నీ, ఆచరణనూ సమన్వయించాలనే కమ్యూనిస్టు ఉద్యమ నిబద్ధత నావంటి ఎంతో మంది బుద్ధిజీవులకు గొప్ప ఆదర్శంగా నిలిచి మా వ్యక్తిగత జీవితాలలో జ్ఞాన తృష్ణను, సామాజిక కార్యాచరణను ఐక్యం చేయడానికి ప్రేరేపించింది.

క్షేత్రపరిశోధన ఆధారంగా వ్యవసాయరంగ అధ్యయనం సాగించాలనే ప్రత్యేక ఆలోచన కూడా నాకు కమ్యూనిస్టు ఉద్యమంతో నా సంబంధం వల్ల అందిన కానుకే. వ్యవసాయ సమస్యను అధ్యయనం చేయడం ఆ సమయంలో నాకు అత్యంత ముఖ్యమైన అవసరం అనిపించింది. మొత్తంగా కమ్యూనిస్టు ఆలోచనల, ఆచరణల సాధారణ ప్రభావం వల్ల మాత్రమే కాదు, ఆ 1950ల తొలిరోజులలో భారత కమ్యూనిస్టు ఉద్యమం అపజయాల వల్ల కూడా నాకు ఈ విషయం అధ్యయనం చేయాలనిపించింది. అప్పుడు ఉద్యమంలో పాల్గొన్న వారందరికీ ఆనాటి అపజయం ఒక విషాదకరమైన అనుభవం. భారత కమ్యూనిజంలో అంతర్గతంగా ఉన్న బలహీనతలు ఏమిటి అనే ఒక బాధాకరమైన అన్వేషణకు అది దారితీసింది. ఆ అన్వేషణలో అనేకమంది గుర్తించిన విషయమేమంటే భారత కమ్యూనిస్టు పార్టీ అప్పటికి రూపొందిన తీరులో ప్రధానంగా అది పట్టణ, మధ్య తరగతి వర్గాల నుంచి రూపొందింది. అత్యధికులైన భారతీయులు నివసించే, కష్టించే గ్రామీణ భారతం నుంచి కమ్యూనిస్టు పార్టీ దూరంగా ఉండిపోయింది. దేశంలోని అతి కొద్ది ప్రాంతాలలో మినహాయిస్తే మొత్తంగా భారత కమ్యూనిస్టు ఉద్యమం ప్రధానంగా పట్టణాలకు పరిమితమైన ఉద్యమంగా ఉండింది. విద్యావంతుల వర్గంలోని కొందరినీ, పారిశ్రామిక కార్మిక వర్గంలోని ఒక భాగాన్నీ మాత్రమే తనలో ఇముడ్చుకుంది. నా స్వరాష్ట్రం ఉత్తరప్రదేశ్‌లాగా ఎన్నో ప్రాంతాలలో గ్రామీణ రైతాంగ ప్రజా బాహుళ్యంతో దానికి సంబంధమే లేదు. ప్రధానంగా గ్రామీణ దేశమైన భారతదేశంలో పట్టణాల మీద ఆధారపడిన విప్లవం అనేది ఒక అమాయకమైన భావన అని నాకర్థమైంది. భారతీయ గ్రామాల సమస్యలను అవగాహన చేసుకోని మేధోపరమైన కార్యాచరణ ఏదైనా అవాస్తవం కాకపోవచ్చు కాని, పాక్షికమైనదే అవుతుంది.

ఈ నేపథ్యంలో భారతీయ సామాజిక స్థితికి కేంద్ర స్థానంలో రైతును, గ్రామాన్ని ఉంచాలనే నా అన్వేషణ కేవలం మేధోపరమైన తెలివిడి మాత్రమే కాదు. అది ఒక లోతైన భావోద్వేగపూరితమైన అనుభవం. అది నేనప్పటికి సభ్యుడిగా ఉండిన పార్టీ ఆలోచనను, ఆచరణను ప్రశ్నించవలసిన స్థితికి నన్ను తీసుకువచ్చింది. అంతమాత్రమే కాదు, నా సొంత బుద్ధిజీవితమూ, నైతిక మనుగడా ఏ సూత్రాల మీద కొనసాగుతున్నాయో ఆ సూత్రాలనూ ప్రశ్నించవలసి వచ్చింది.

ఈ బాధాకరమైన స్వీయపరీక్షకు నన్ను ప్రత్యేకంగా ప్రోత్సహించినవి మావో సే టుంగ్ రచనలు. ఆ రచనలతో నాకు పరిచయం కావడంతో మావో నాయకత్వాన చైనా ప్రజలు సాధించిన విజయాలను, భారత కమ్యూనిస్టుల వైఫల్యాలను పోల్చి చూసినప్పుడు నాటకీయమైన తేడాలు కనబడ్డాయి. మావోను అధ్యయనం చేస్తుంటే భారత కమ్యూనిస్టుల వైఫల్యం ఎక్కడ ఉందో నాకు అర్థమైంది. భారత సమాజపు ప్రత్యేకతలను, ముఖ్యంగా రైతాంగ సమస్య స్వభావాన్ని, సంక్లిష్టతను అర్థం చేసుకోవడంలో భారత కమ్యూనిస్టులు విఫలమయ్యారు. ఆ అనుభవం నుంచి బయటపడాలంటే తప్పనిసరిగా రైతాంగ సమస్యను మన ఆలోచనల కేంద్ర స్థానంలోకి తీసుకురావాలి.

రైతాంగ సమస్య గురించి మార్క్సిస్టు దృక్పథంలోని మౌలిక అంశాలను నేను సాహిత్య అధ్యయనం ద్వారా గ్రహించాను. మార్క్సిస్టు దృక్పథం అంటే చారిత్రక, గతిశీల వైఖరి. మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి విధానం గురించి అర్థం చేసుకోవాలంటే గ్రామీణ ప్రాంతంలో కొనసాగుతున్న ఉత్పత్తి విధానాన్ని ప్రధానంగా గుర్తించడం, ఒక సామాజిక వ్యవస్థలో భిన్న వర్గాల ప్రయోజనాల మధ్య ఐక్యత ఉండదని గుర్తించడం, ఆ భిన్న ప్రయోజనాల మధ్య ఘర్షణ ఏ నిర్దిష్టరూపం దాలుస్తున్నదో అన్వేషించడం, చారిత్రక పరిణామ క్రమంలో ప్రతి దశలోనూ ప్రత్యేకంగా కొనసాగే దోపిడీ పద్ధతిని అర్థం చేసుకోవడం వంటి అనేక అంశాలు మార్క్సిస్టు దృక్పథంలో భాగం. అయితే పశ్చిమ యూరప్ సమాజాల నేపథ్యంలో రూపొందిన ఈ మార్క్సిస్టు సిద్ధాంతంలో అత్యధిక భాగం పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉండే వ్యవసాయ సంబంధాలను విశ్లేషించాయి. కాని, పెట్టుబడిదారీ పూర్వ వ్యవసాయ సమాజాలలో, ఆసియా దేశాలలో వ్యవసాయ సంబంధాల స్వభావాన్ని విశ్లేషించలేదు. అంతేకాదు, పశ్చిమ యూరపియన్ నేపథ్యం గురించి అప్పటికే రెండో స్థాయి సమాచారం, పరోక్ష సమాచారం కుప్పతెప్పలుగా లభ్యమయింది. అందువల్ల మార్క్సిస్టు సంప్రదాయం క్షేత్రపరిశోధన ద్వారా వాస్తవాలు సేకరించాలనే ఆలోచనకు దూరంగా ఉండిపోయింది. భారతదేశంలో మార్క్సిస్టు కార్యకర్తలు, నేరుగా రైతాంగంతో ప్రత్యక్ష సంబంధంలోకి వచ్చినవారు కూడా తమ క్షేత్ర అనుభవాల సంపదను ఎక్కడా నమోదు చేయలేదు. భారత దేశంలోని వ్యవసాయ సమస్యను విశ్లేషించడానికి అవసరమైన సమాచారాన్ని ప్రోది చేసిపెట్టలేదు. మరోవైపు భారతదేశంలో వ్యవసాయ సమస్య గురించి సిద్ధాంతాలు తయారు చేసిన సాంప్రదాయిక మార్క్సిస్టు సిద్ధాంతవేత్తలకు గ్రామీణ జీవితంతో ఎటువంటి ప్రత్యక్ష సంబంధమూ లేదు. ఉన్నచోట్ల కూడా వారు ఆ అనుభవాన్ని తగినంతగా ఉపయోగించు కోలేదు.

ఈ పూర్వరంగంలో నాకు మావో కృషి అద్భుతంగా కనబడింది. మార్గదర్శకంగా కనబడింది. చైనా వంటి వ్యవసాయ సమాజాలలో జ్ఞానానికి మౌలిక వనరు క్షేత్రపరిశోధనే అని ఆయన బలంగా నమ్మాడు. 'పరిశోధన లేకుండా మాట్లాడే హక్కు లేదు' అని ఆయన చేసిన సుప్రసిద్ధ ప్రకటనలో అది వ్యక్తమైంది. రెండవది, మేధావులు పుస్తకాల నుంచి కన్న ఎక్కువగా గ్రామీణ ప్రజల నుంచి నేర్చుకోవాలని ఆయన పదే పదే చెప్పాడు. ఈ వైఖరి మొత్తంగా అధ్యయన దృక్పథాన్నే విప్లవీకరించిందని నాకు అనిపించింది. క్షేత్రపరిశోధనను విస్మరించిన, అప్పటికి ప్రాబల్యంలో ఉండిన పాశ్చాత్య యూరపియన్ మార్క్సిస్టు సంప్రదాయం నుంచి ఇది స్పష్టమైన మార్పు అని నాకు అనిపించింది. ఈ మార్పును మావో చేసిన సూత్రీకరణలోనే చెప్పాలంటే 'జ్ఞానాన్ని సమగ్రంగా గుర్తించినప్పుడు ఎటువంటి అనుభవమైనా ప్రత్యక్ష అనుభవం నుంచి విడదీయదగినది కాదు.'

పశ్చిమ యూరప్ దేశాలకూ, ఆసియన్ దేశాలకూ ఉన్న ప్రధానమైన తేడా గురించి మావో గుర్తు చేశాడు. పాశ్చాత్య యూరప్ దేశాలలో విస్తృతమైన అక్షరాస్యత వల్ల, విద్యవల్ల, సమాచారాన్ని

సేకరించే, పరిరక్షించే, ప్రచారం చేసే సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందడం వల్ల అక్కడ గ్రామీణ ప్రాంతాలతో సహా సమాజంలో మొత్తంగా ఉన్న జీవన పరిస్థితుల గురించిన సమాచారం సంపూర్ణంగా నమోదై దొరికింది. అందువల్ల ఎవరైనా ఒకరు జ్ఞానసముపార్జన చేయాలంటే పరోక్ష అనుభవం ద్వారా కూడా సాధ్యమైంది. సుప్రసిద్ధ ఉదాహరణ చెప్పాలంటే మార్క్స్ రచించిన కాపిటల్ మొత్తంగా ద్వితీయ స్థాయి, పరోక్ష సమాచారం మీద ఆధారపడిందే. మరోవంక ఆసియన్ దేశాలలో విస్తృతమైన నిరక్షరాస్యత వల్ల, సమాచారాన్ని సేకరించే, పరిరక్షించే సాధనాల కొరత వల్ల నేర్చుకోవడమైనా, నేర్పడమైనా, ప్రచారం చెయ్యడమైనా ప్రధానంగా మౌఖిక పద్ధతిలోనే సాగింది. తత్ఫలితంగా ఈ సమాజాలలో ప్రత్యక్ష అనుభవం మీదనే ఎక్కువ శ్రద్ధ పెట్టవలసి వస్తుంది. మొత్తంగానే పారిశ్రామిక సమాజాలలో కన్న ఎక్కువగా వ్యవసాయ సమాజాలలో ప్రత్యక్ష అనుభవం ప్రధానమవుతుంది. ఈ విధంగా మార్క్సిజం లోపల క్షేత్రపరిశోధన ప్రాధాన్యతను ప్రవేశపెట్టడం ద్వారా మావో రైతాంగ సమాజాల అధ్యయనానికి దారిచూపించాడు.

అదే విధంగా గ్రామీణ – పట్టణ ప్రాంతాల మధ్య ఉన్న పెద్ద అంతరంలో ఒకటైన మేధావులకూ, ప్రజలకూ మధ్య ఉండే అంతరం పాత సమాజంలోని పీడక – పీడిత వైరుధ్యానికి ఒక ముఖమని మావో వివరించాడు. పట్టణ ప్రాంతాలలోనూ, గ్రామీణ ప్రాంతాలలోనూ ఉత్పత్తి సాధనాలూ, రాజ్యాధికారం మాత్రమే కాక జ్ఞానసముపార్జనా సాధనాలు కూడా ఆస్తిపరవర్గాలచేతిలోనూ, దోపిడీవర్గాలచేతిలోనూ కేంద్రీకరించబడి ఉండిపోయాయి. తత్ఫలితంగా రైతాంగంలోనుంచి బుద్ధిజీవుల వర్గం అభివృద్ధి చెందే అవకాశం లేకపోయింది. పరాయి వర్గాల నుంచే మేధావులు రైతాంగ సమస్యలను అధ్యయనం చేయడంలో చొరవ చూపి విప్లవ పోరాటాలలో రైతాంగాన్ని సమీకరించారు.

ఈ మేధావులూ, కార్యకర్తలూ పరాయివర్గాల నుంచి వచ్చారు గనుక వారికి ఏదో ఒక స్థాయిలో సాంప్రదాయిక వర్గ అభిజాత్యమూ, దురభిప్రాయాలూ లోలోపల ఉండిపోయాయి. గ్రామీణ పట్టణ విభజన వల్ల, అంతరాల సమాజం వల్ల వాళ్లు రైతులతో సన్నిహిత సంబంధంలోకి రాకుండా ఉండిపోయారు. ఇదంతా కలగలిసి గ్రామీణ ప్రజానీకం అంటే వెనుకబడినవారనీ, సాంప్రదాయికులనీ, మార్పును వ్యతిరేకించేవారనీ అభిప్రాయం ఉన్నత వర్గాలలో కలిగింది. ఈ పునాది నుంచి రూపొందిన మేధావులు రైతాంగానికి సేవ చేయదలచు కున్నట్టయితే వారు తమ అన్యవర్గ ధోరణులను వదులుకొనే ప్రక్రియకు లోనుకావాలని, రైతాంగం మధ్య క్షేత్రస్థాయిలో పనిచేస్తూ తమ భావజాలాన్ని పునర్నిర్మించుకోవాలని మావో నొక్కి చెప్పాడు. అంటే, క్షేత్రస్థాయిలో పని అనేదానికి మావో కొత్త అర్థం, కొత్త ప్రాధాన్యత ఇచ్చాడు. తమ సొంత ప్రజల నుంచి దూరమైపోయిన బుద్ధిజీవి వర్గం తమ భావజాలాన్ని పునర్నిర్మించుకునే సాధనంగా క్షేత్రస్థాయి ఆచరణను మావో చూశాడు. అంతేకాదు, క్షేత్రస్థాయి కార్యాచరణ అనేది దృక్పథాన్ని మార్చే శక్తిమంతమైన సాధనం కనుక దాన్ని ఒక పదునైన మేధో పనిముట్టుగా వాడుకోవాలని కమ్యూనిస్టులు భావించడం మొదలైంది. క్షేత్రస్థాయి ఆచరణను ఆయన చూసిన విశాల దృక్పథమే మావో దృక్కోణంలోని కొట్టవచ్చినట్టు కనిపించే అంశం. ప్రజలతో సంబంధం ద్వారా మేధావులు తమను తాము మార్చుకునే ఒక సంవిధానంగా ఒక పక్క, మేధావులతో సంబంధం ద్వారా ప్రజలు తమను తాము మార్చుకునే సాధనంగా మరొకపక్క క్షేత్రస్థాయి ఆచరణ పనికివచ్చింది. మేధావులకూ, ప్రజలకూ మధ్య ఉండే ఈ విశిష్ట సంబంధాన్ని మావో మాటల్లో చెప్పాలంటే, 'ప్రజల నుంచి మనం గందరగోళంగా స్వీకరించిన దాన్ని స్పష్టం చేసి ప్రజలకు అందించాలి.'

ఇక క్షేత్రస్థాయి ఆచరణకు సంబంధించి మావో దృక్పథంలో క్షేత్రస్థాయి కార్యాచరణ జరిగే పద్ధతికి చాలా ప్రాధాన్యత ఉంది. క్షేత్రస్థాయి ఆచరణ అంటే కొన్నిసార్లు పొద్దుటిపూట గ్రామానికి వెళ్లి అప్పటికే తయారు చేసిన ప్రశ్నలు రైతులకు వేసి వారి జవాబులు సేకరించడం కాదు. నిజమైన క్షేత్రస్థాయి ఆచరణ అంటే గ్రామీణ ప్రజానీకంతో కలిసి జీవించడం. వారి ఆనందాలనూ, విషాదాలనూ పంచుకోవడం. గ్రామీణ సమాజంలో తగినంత దీర్ఘకాలం పాటు లోపలి వ్యక్తిగా జీవించడం. గ్రామీణ ప్రజలు సాగిస్తున్న పోరాటాలలో, వారి జీవితంలోని అసంఖ్యాక సమస్యలలో వారిని అతి సన్నిహితంగా పరిశీలించడం. ప్రజల పట్ల మౌలికంగా సానుభూతి కలిగి ఉంటూ వారిని ప్రశ్నించే దృక్పథం అలవర్చుకోవడం. అన్ని సందర్భాల లోనూ సాధారణ ప్రజానీకాన్ని గౌరవించడం. ప్రజలంటే మన పరిశోధనకు నిష్క్రియాపూర్వకంగా లక్ష్యాలుగా ఉండేవాళ్లు కాదు అని మావో నొక్కి చెప్పాడు. వారిపట్ల ఆత్మీయమైన ప్రేమ కనబరుస్తూనే నిర్మమకారమైన పరిశీలనా దృష్టితో చూసినప్పుడే వారిని అర్థం చేసుకోవడం సాధ్యమవుతుందని మావో అన్నాడు. ప్రజలు ఆచరణాత్మకంగా పాల్గొనకుండా గ్రామీణ సమాజాన్ని లోతుగా అర్థం చేసుకోవడం అసాధ్యం.

క్షేత్రస్థాయి ఆచరణను మావో ఇంత నిగూఢంగా ఎందుకు పరిగణించాడా అని నాకెప్పుడూ ఒక ప్రశ్నగా ఉండేది. దాన్ని కేవలం ఒక పరిశోధనా సాధనంగా మాత్రమే ఎందుకు చూడలేదు, మావో ఆలోచనలోనూ, ఆచరణలోనూ దాన్ని ఎందుకు ఒక తాత్విక, నైతిక ప్రశ్నగా చూశాడు అని చాలా ఆలోచించాను. సుదీర్ఘకాలం ఆలోచించిన మీదట నాకు అర్థమైనదేమంటే మన సమాజంలో శతాబ్దాలుగా కొనసాగిన అలవాట్లూ, సంప్రదాయాలూ పట్టణ ప్రజానీకానికీ, గ్రామీణ ప్రజానీకానికీ మధ్య; దోపిడీ దారుకూ, దోపిడీకి గురయ్యే వారికి మధ్య; విద్యావంతులకూ, విద్యలేని ప్రజానీకానికీ మధ్య పూడ్చడానికి వీలులేని అఖాతాన్ని సృష్టించాయి. అందువల్ల రైతాంగం మధ్య అధ్యయనం చేయడానికైనా, ఆచరణలో పాల్గొనడానికైనా గుణాత్మకంగానే కొత్తతరహాకు చెందిన బుద్ధిజీవులు అవసరమవుతారు. చుట్టూరా వ్యాపించి ఉన్న పాత ఆలోచనా పద్ధతుల నుంచీ, చైతన్యం నుంచీ విడివడడం ఎంత అవసరమవుతుందంటే, రైతాంగం మధ్య పనిచేసే ఇబ్బందులు ఎంత అసాధ్యమైనవంటే, ఒక కొత్త తాత్విక నైతిక దృక్పథంతో ప్రేరణ పొందని మేధావులు ఇటువంటి క్షేత్రస్థాయి ఆచరణను జీవితాంతం సాగే ఆచరణగా ఎంచుకోజాలరు. అందువల్లనే క్షేత్రస్థాయి ఆచరణను కేవలం ఆచరణాత్మక అవసరంగా కాక ఒక నైతిక సవాలుగా స్వీకరించవలసిన అవసరం ఉంది.

*(ఇంకావుంది)*

*ప్రపంచ జనాభాలో అత్యధికభాగం ఒకే కుదురు నుంచి వచ్చిందనీ, రూపురేఖల్లో తేడాలు బాహ్య కారణాల వల్లేననీ, జీవశాస్త్రపరంగా మనుషులంతా ఒకటే జాతనీ వివరిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# పర్యావరణం - జాతుల వైవిధ్యం

**మా**నవజాతి ఆవిర్భావం తరవాత తొలి మానవులు చేసిన ప్రయాణాలు వారిని రకరకాల పరిస్థితులకు గురిచేశాయి. ప్రతి ప్రాంతంలోనూ ఉండిన భౌగోళిక, వాతావరణ స్థితిగతులు వారి జీవితాల మీదా, జీవనశైలిమీదా, నాగరికత వగైరాల మీదా తమ ప్రభావం చూపాయి. వీటితో బాటుగా మనుషుల శరీరఛాయ, ముఖకవళికలూ, దేహనిర్మాణం మొదలైనవన్నీ కూడా మారసాగాయి. కొంతకాలానికి ప్రాంతాలవారీగా మనుషుల రూపురేఖల్లో ఎన్నో తేడాలు ఏర్పడ్డాయి. వివిధ ప్రాంతాల్లో వేలాది సంవత్సరాలుగా జీవిస్తున్న ప్రజలు రకరకాల సంస్కృతులనూ, నాగరికతలనూ పెంపొందించుకుని ఇతరుల గురించి తెలియకుండా జీవించసాగారు. ఆ తరవాత ఎప్పుడో ఇతరులు తమకు ఎదురైనప్పుడు ఇటువంటి తేడాలను గుర్తించి ప్రజలను జాతులుగా వర్గీకరించడం మొదలుపెట్టారు. అసలు తేడాలూ, పోలికలూ అనేవి వెలుగునీడలవంటివి. ఒకతను ఇంకొకడి కన్నా పొట్టి. కానీ ఒక స్త్రీతో పోలిస్తే ఈ పురుషులిద్దరూ ఒకలాటివారే. స్త్రీ పురుషుల్లో తేడాలున్నప్పటికీ ఏ చింపాంజీతోనో పోల్చినప్పుడు మాత్రం మనుషులంతా ఒకటే జాతి. అలాగే ఏ కుక్కతోనో పోల్చినప్పుడు మనమూ, కోతులూ ఒకేలాగ రెండు చేతులూ, 32 పళ్ళూ ఉన్న ప్రాణులం. ఇక కుక్కలూ, కోతులూ, మనుషులూ అన్నీ చేపలవంటి జలచరాలకన్నా భిన్నమైన జీవాలు. తేడాలూ, పోలికల గురించి ఇలా చెప్పుకుంటూ పోవచ్చు.

ఎవరినైనా చూడగానే మనం గమనించేది రూపురేఖలను. అందువల్ల పంతొమ్మిదో శతాబ్దంలో యూరపియన్లు మొదటిసారి ఆఫ్రికావాసులను చూసినప్పుడు వారు మరేదో తక్కువజాతి ప్రాణులని భావించారు. ఆనాడు మొదలైన వర్ణ, జాతి విద్వేషాలు ప్రపంచమంతటా నేటికీ కొనసాగుతున్నాయి. ఈ రోజుల్లో గడ్డాలు పెంచుకున్న ఆసియావాసులందర్నీ అమెరికాలో ముస్లిం టెర్రరిస్టులుగా భావించడం, తెల్ల దేశాల్లోని కామిక్ స్ట్రిప్‌లలో కూడా విదేశీ ముఖాలవాళ్లని విలన్లుగా చిత్రీకరించడం మొదలైనవన్నీ ఇటువంటి ధోరణినే సూచిస్తాయి. నిజానికి నల్లని నీగ్రోలకూ, తెల్లని స్వీడన్ ప్రజలకూ, పసుపుపచ్చని చైనావారికీ గల తేడాలెటువంటివి? 1972లో జరిపిన జన్యుపరీక్షల్లో తేలినదిది. ఒకే రకంగా కనిపిస్తూ, ఒకే జాతికి చెందిన ఇద్దరు వ్యక్తుల జన్యువుల మధ్య కనబడే సగటు తేడాలు వివిధ జాతులమధ్య కనబడే సగటు తేడాల కన్నా ఎక్కువ. బాహ్యలక్షణాలు ఎంత విభిన్నమైనవిగా కనిపిస్తున్నప్పటికీ మనుషులందరూ జన్యుపరంగా ఒకలాంటివారే. జీవశాస్త్రపరంగా మానవులంతా ఒకటే జాతి. ఎందుకంటే సిద్ధాంతరీత్యా ప్రపంచంలోని ఏ స్త్రీ పురుషులకైనా పిల్లలు పుడతారు. కాలక్రమేణా వారికి స్వయంగా సంతానోత్పత్తి చెయ్యగలిగిన సామర్థ్యం కలుగుతుంది. ఒకే జాతికి చెందిన ప్రాణుల్లో ఇది సాధ్యమవుతుంది. గుర్రాలకీ, గాడిదలకూ పుట్టిన సంతతి పెద్దయాక సంతానోత్పత్తి చెయ్యలేవు.

మనుషుల వంశవక్షం గురించి తెలుసుకోవటానికి ఒక పద్ధతి ఉంది. సూక్ష్మమైన మన జీవకణాల్లో ఇంకా సూక్ష్మమనిపించే న్యూక్లియస్ ఉంటుందనీ, ఆ కేంద్రకంలో డీఎన్ఏ పోగులుంటాయనీ, అవన్నీ జన్యువులతో కూడుకున్నవనీ మనకు తెలుసు. కణజాలంలో న్యూక్లియస్‌కు వెలపల మైటోకాండ్రియా అనే నిర్మాణాలు తేలుతూ ఉంటాయి. వీటిలో కూడా మరొకరకం డీఎన్ఏ ఉంటుంది. తల్లినుంచి సంక్రమించే మైటోకాండ్రియల్ డీఎన్ఏలో మార్పులపై జరిపిన పరిశోధనల వల్ల ఈ మార్పులు ఆఫ్రికా జాతుల్లో ఎక్కువగా ఉన్నాయని తేలింది. దీనర్థం ఏమిటంటే ఆఫ్రికా నుంచి ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు వలసవెళ్ళిన వారందరూ ఒక ఆఫ్రికన్ "ఆదిమాత" తాలూకు సంతానమే. అందుకే ఆఫ్రికావారితో పోలిస్తే తక్కిన ప్రజల మైటోకాండ్రియల్ డీఎన్ఏలో వైవిధ్యం తక్కువ. ప్రపంచ జనాభాలో అధికభాగం ఒకే కుదుటినుంచి వచ్చినదే. అందుచేత ఈనాడు మనుషుల రూపురేఖల్లో కనబడుతున్న తేడాలన్నీ బాహ్యకారణాల మూలంగా తలెత్తినవేనని తెలుస్తోంది.

కొత్త తరం పుట్టుకొచ్చినప్పుడల్లా జన్యువుల్లో సహజంగా కొన్ని యాదచ్ఛిక వ్యత్యాసాలు ఏర్పడతాయి. వీటివల్ల కలిగే శారీరక లక్షణాల్లో బాహ్యపరిస్థితులకు అనువైనవి మాత్రమే దక్కి, బలపడతాయి. నివసిస్తున్న ప్రదేశపు వాతావరణం, ఉష్ణోగ్రత వగైరాలకు తట్టుకోగలిగిన మార్పులు శరీరపు అంతర్భాగాలకన్నా చర్మంలోనూ, బాహ్య లక్షణాలుగానూ ఎక్కువగా కనిపిస్తాయి. మానవశరీరాల ఉష్ణోగ్రత దాదాపుగా 37 డిగ్రీలు (సెల్సియస్) ఉంటుంది. అది గనక 42 దాటితే మెదడుకూ, ప్రాణానికీ అపాయం. అందుకే ధ్రువప్రాంతాలవారి శరీరాలు కురచగా, లావుగా తయారయి, శరీరపు వేడిమిని కోల్పోకుండా ఉంటాయి. ఉష్ణదేశాలవారు పొడుగ్గా, సన్నగా శరీరం మరీ వేడెక్కకుండా ఉంటారు. తూర్పు ఆఫ్రికా మైదానాల్లో తిరిగేవారికీ, ఎస్కిమోలకూ ఇలాంటి తేడాలు స్పష్టంగా కనిపిస్తాయి (పటం 1). అలాగే చర్మంలోని మెలనిన్ సూర్యరశ్మిలోని అల్ట్రా వయొలెట్ కిరణాలను హరిస్తుంది. ఎందుకంటే అల్ట్రావయొలెట్ కిరణాల తాకిడి ఎక్కువైతే చర్మం కందిపోవడం, దానికి కేన్సర్ రావడం జరుగుతుంది. అందుకనే ఎండ ఎక్కువగా ఉన్నచోట చర్మాన్ని కాపాడే


పటం - 1

మెలనిన్ ఎక్కువ కావటంతో ప్రజలు నల్లగా ఉంటారు. అయితే అల్ట్రావయొలెట్ కిరణాలవల్ల మనకొక ఉపయోగముంది. అవి కొన్ని చర్మకణాలను పోషణనిచ్చే విటమిన్ డి గా మారుస్తాయి. ఎండ తక్కువైన ప్రాంతాల్లోనివారు తెల్లగా ఉండడానికి కారణం అదే. మెలనిన్ ఎక్కువైతే వారికి రికెట్స్ వ్యాధి రావచ్చు కనక ఆ రకమైన జన్యుమార్పిడి బలపడింది. అలాగే ఉష్ణప్రాంతాల్లో అడవుల్లో చెట్ల నీడన తిరిగేవారు నల్లగా ఉండరు. అక్కడ గాలిలో తేమ ఎక్కువ కావడంతో అల్ట్రావయొలెట్ కిరణాల ప్రభావం తగ్గుతుంది కూడా.

అదే విధంగా చలి ప్రాంతాల్లో చలిగాలులు ఎక్కువగా సోకకుండా అక్కడివారి కళ్ళ రక్షణకై చుట్టూతా కొవ్వు పేరుకుని ఉంటుంది. ముక్కులూ, ముక్కుపుటాలూ కూడా చిన్నవిగా రూపొందుతాయి. ఎత్తైన కొండ ప్రాంతాల్లో గాలి ఒత్తిడి తక్కువ కనక అక్కడివారి ఊపిరితిత్తులు పెద్దవిగానూ, రక్తంలో ఎర్రకణాల సంఖ్య ఎక్కువగానూ ఉండడం సహజం. ఇలాగే స్థలాన్నీ, భౌతిక, భౌగోళిక పరిస్థితులను బట్టీ ఒక్కొక్క శరీర లక్షణానికీ సంబంధించిన జన్యుపరమైన తేడాలు ఏర్పడుతూ వచ్చాయి. బైటికి కనబడే తేడాలనుబట్టి జాతులుగా వర్గీకరించడం మానవ సంప్రదాయంలో ఒక భాగమైపోయింది. ఆధునిక మానవజాతి మొదలై గట్టిగా 3 వేల తరాలు కూడా కాలేదు. అయినప్పటికీ మానవులు ప్రపంచంలోని ప్రతిమూలకూ వెళ్లి స్థిరపడడం, అక్కడి విభిన్న పరిస్థితులకు అలవాటుపడి జీవించడం వల్ల వారి రూపురేఖల్లో ఇంతటి వైవిధ్యం సాధ్యమైంది. మొత్తం మీద ఈ తేడాలన్నీ బాహ్యామైనవే. ఎటొచ్చీ ఈ వైవిధ్యంలో కొంత వ్యక్తిగత స్థాయిలో ఉండగా, తక్కినది జాతి, లేక ప్రాంతానికి సంబంధించినదిగానూ కనిపిస్తుంది. తొలి మానవుల నివాసస్థలం తాము ఆవిర్భవించిన తూర్పు ఆఫ్రికా ప్రాంతాలకే పరిమితమై ఉంటే వారిలో ఇంతటి వైవిధ్యం కలిగేదే కాదు. అందరూ దాదాపుగా ఒకే పోలికలతో కనబడేవారు. మరొకటేమిటంటే కొన్ని మ్యుటేషన్లు ముఖకవళికల్లో నిరపాయకరమైన తేడాలు కలిగించవచ్చు. మందమైన పెదవులో, పెద్ద ముక్కు వంటిదో రూపొందాక అది తరవాతి తరాల్లో కూడా కొనసాగుతుంది. అటువంటి లక్షణం ప్రాణాంతకం కానంతవరకూ అది అంతరించిపోవలసిన అవసరమేమీ కలగదు. అందుకనే రకరకాల ముఖాలవారు నేటికీ కనబడతారు (పటం2).

మనుషుల్లో 20-25 వేల జన్యువులూ, వాటిలో ఒక్కొక్క దాంట్లోనూ కొన్ని వేల డిఎన్ఎ బేస్ జంటలూ ఉంటాయి. అంటే మొత్తం సుమారుగా 300 కోట్ల డీఎన్ఏ జంటలుంటాయి.


పటం - 2

పై వరస ఎడమ నుంచి వరసగా జపాన్, టిబెట్, బోర్నియో, హాలండ్;
రెండో వరస ఐర్లండ్, చైనా, రువాండా, కొరియా;
మూడో వరస న్యూజీలండ్, బాలీ, ఒకినావా, ఇజ్రాయెల్;
నాలుగో వరస అమెరికా, ఆస్ట్రేలియా, ఇండియా, ఈజిప్ట్;
కింది వరస మలక్కా ద్వీపాలు, కెనడా, గ్రీస్, గ్వాటెమాలా దేశస్థులు

మనుషుల్లోని వివిధ జాతుల్లో 0.1 శాతం (అంటే సుమారు 30 లక్షల జంటలు) జన్యుపరమైన తేడాలుంటాయి. చర్మం రంగును నిర్ణయించేవి అయిదు జన్యువులు. చర్మపు ఇతర లక్షణాలను నిర్ణయించేవి వంద జన్యువులు. ఇంత స్వల్పమైన వ్యత్యాసాలు మనుషుల బాహ్య రూపాల్లో వైవిధ్యం కలిగించి విద్వేషాలకు దారితీయడం వల్ల మనుషులంతా ఒకటే అని ఎలుగెత్తి చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది. ♦

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - సెప్టెంబర్ 2009 : మహిళా ఉద్యోగుల సమస్యలు**
- **ఫోకస్ - అక్టోబర్ 2009 : అరవై ఏళ్ల చైనా విముక్తి - పాఠాలూ, గుణపాఠాలూ**
- **పేదరిక నిర్మూలన, ప్రపంచబ్యాంక్ అవగాహన - ఒక సమీక్ష - ముదునూరి భారతి**

**తుమ్మల శేషగిరిరావు సంస్మరణలో వచ్చిన ఆయన రచనల, ఆయనపై వచ్చిన సన్నిహితుల రచనల పుస్తకాన్ని పరిచయం చేస్తున్నారు కాకరాల**

# నిజాయితీ నిండిన కీర్తి




ఇది జీవిత చరిత్ర కాదు. ఆత్మకథా కాదు. జీవితాన్ని విమర్శించి విశ్లేషించే సృజనాత్మక సాహిత్య రచన కానే కాదు. అయితే చదివిన వారికి అవన్నీ చదివిన అనుభూతిని అందించే ఓ బతుకు పుస్తకం ఈ 'కీర్తి శేషగిరి'.

జీవితకాలమంతా బాధ్యతగల పౌరుడుగా, ఉపాధ్యాయుడుగా జీవించిన వ్యక్తి తుమ్మల శేషగిరి రావు. ఆయన క్రమశిక్షణకి, విలక్షణ వ్యక్తిత్వానికి ప్రభావితులైన వారి సంస్మరణ వ్యాసాల సంకలనమిది. ఇందులో వారి భార్య, పుత్రుడు, బంధుమిత్రులు, ఉద్యమాల్లో – ప్రజాసంఘాల్లో – కలిసిన నేస్తాలు, ప్రియశిష్యులు రాసిన వ్యాసాలున్నాయి. ఇవిగాక మాస్టారి గేయాలు, వ్యాసాలు, కరపత్రాలు మొదలైనవీ ఉన్నాయి.

సమన్వయించుకుని చూడగలిగిన వారికిది 'ప్రకృతి పరిశీలనా ప్రయత్నం'గానూ కనిపిస్తుంది.

ఈ భూమి మీద మానవ జీవితం హఠాత్తుగా ఆవిర్భవించలేదు. అది జీవపరిణామ క్రమానికి దోహదం చేస్తూ వస్తున్న వాతావరణం నుంచి ఉత్పత్తి చెందింది. ఇది శాస్త్ర విజ్ఞానం నిరూపించిన చారిత్రక సత్యం. దీన్నిబట్టి వ్యక్తి పాత్ర – వ్యక్తిత్వం – రూపొందడానికి సామాజిక వాతావరణం శిశు దశ నుంచీ నిర్వహించే పాత్రని ఊహించుకోవచ్చును.

తోట్ల వల్లూరులో తుమ్మల శేషగిరిరావు 1 జనవరి 1940లో జన్మించారు. ఆయన తల్లి చిట్టెమ్మ అనే మాణిక్యమ్మ. తండ్రి సత్యం అను సత్యనారాయణ. గో.రా. – గోపరాజు రామచంద్రరావు – శేషగిరి విద్యార్థిగా ఉన్నప్పుడు 'ముదునూరు'లో నాస్తిక కేంద్రాన్ని స్థాపించారు. ఆ హేతువాద భావజాలానికి అతను బలంగా ప్రభావితమయ్యాడు. ఆ రోజుల్లోనే చండ్ర రాజేశ్వరరావు – అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి – బంధుత్వరీత్యా శేషగిరికి దగ్గరయ్యారు. అతనిలోని పట్టుదలకి, వాదోపవాదాల్లోని తార్కికతకు ఆనందించేవారు. ఆ వయసుకే అతనిలోని సాత్వికతకి, ధర్మాగ్రహానికి, నిర్భీతికి, నైతికతకి, ఆశ్చర్యపోయేవారు. అతని పెద్దలతో 'మన శేషగిరి అసాధ్యుడండి' అని ముచ్చటపడుతూ, శేషగిరిని 'సమాజంలో అనేక ఒడిదుడుకులు ఎదుర్కోవాలి జాగ్రత్త' అని హెచ్చరించేవారు.

**కీర్తి శేషగిరి** – సంకనం: సమతా కోటేశ్వరరావు
315 పేజీలు, వెల **రు. 60**
**ప్రతులకు :** మైత్రీ బుక్‌హౌస్, జలీల్ వీధి, అరండల్‌పేట్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 520 002

మనిషి తత్వ వ్యక్తిత్వాలను పట్టిచ్చేది, ముఖ్యంగా అతని నిరంతర ఆచరణ. మాస్టారి మీద ఆరాధనతో రాసిన వ్యాసాలు – ముఖ్యంగా వారి సహచరి, కుమారుడు రాసినవి – వారి నిరంతరాచరణని కళ్లకి కట్టిస్తాయి. కుటుంబ సంబంధాల విషయంలోనూ, సామాజిక సంబంధాల విషయంలోనూ, మాస్టారు ఎంత బాధ్యతతో స్పందించి ప్రవర్తించేవారో తెలుస్తున్న కొద్దీ విస్మయం కలుగుతుంది. అదే సమయంలో అక్కడక్కడ ఆయన ఆలోచనలు, భావాలు, భావనలు పళ్లకింద పడిన రాళ్లలా బాధిస్తూ, ఆందోళన కలిగిస్తూ ఉంటాయి.

అలాంటి వాటికి ఒకటి రెండు ఉదాహరణల్ని చూస్తే చాలు. మాస్టారు కొడుకు పుట్టిన సంతోషంలో వారి సహచరితో 'ఐదు సంవత్సరాలు వచ్చే వరకు చక్రవర్తిలా చూడాలి. ఆరు నుండి ఇరవై సంవత్సరాల వరకు బానిసలాగ చూడాలి. ఇరవై సంవత్సరాల తరువాత స్నేహితుడి లాగ చూడాలి' అనేవారట. మరోసారి ఆమెతోనే మాట్లాడుతూ జీవన సహచరుల మధ్య సంబంధం 'యజమాని – సేవకుడు, కలెక్టర్ – పి.ఏ., ఆఫీసర్ – గుమస్తా, ఇలా వారి మధ్యలో ఎటువంటి అవగాహన, అణకువ ఉంటుందో అలా ఉండాలి' అని 'ఇద్దరిలో ఎవరోవొకరు అలా ఉండాలి. ఒకరు లీడరైతే మరొకరు ఫాలోయర్ అవ్వాలి' అని వివరించారట. జగదాంబగారికీ సలహా బాధనిపించి వాదించేవారట. పరస్పర విరుద్ధ – భూస్వామ్య, హేతువాద, సామ్యవాద – భావజాలాల సమ్మేళనం, మాస్టారి వ్యక్తిత్వంలో ఎలా చోటు చేసుకుందన్నదే చర్చనీయాంశం.

ఆధునిక భారత సమాజంలో ఈ పరస్పర విరుద్ధ భావజాలాల సమ్మేళనం అనివార్యమేగాని అసాధారణం కాదు. అయితే అది వ్యక్తుల్లో ఏది ఎంత శాతం అన్న స్థాయి భేదాలుండవచ్చును. అసలులేక పోవడం మాత్రం చాలా అరుదు. పుట్టి పెరుగుతున్నప్పుడు బలంగా ప్రభావితం చేయగల, భూస్వామ్య భావజాలం అవశేషాలుగానైనా, కుటుంబాల వాతావరణంలో పుష్కలంగా ఉంది. ఇక సమాజంలో బూర్జువా వర్గ – ప్రజాస్వామ్య, హేతువాద భావజాలం, కార్మికవర్గ– సామ్యవాద

*పాలకపార్టీల అవకాశవాద రాజకీయాలను, ప్రజలకు పట్టని తంతుగా మారిన ఎన్నికల ప్రహసనాన్ని వివరిస్తున్నారు* **కడియాల సుబ్బనాచారి**

# 2009 సాధారణ ఎన్నికలు

ఈసారి ఎన్నికల ఫలితాల నుండి సాధారణ జనం చైతన్యం పెరిగిందనేది మరింత తేటతెల్లమయింది. రాజకీయ పార్టీలే వెనుకబడి ఉన్నాయి. రాజకీయ పార్టీల నాయకులు చెప్పే మాటలకు జనం చప్పట్లు కొడుతున్నారు గాని, వాటిని చెవికెక్కించుకోవడం లేదు. చప్పట్లతోనే సరిపెడుతున్నారు. ఏ పార్టీ వెంటా తోక పట్టుకొని పోవడం లేదు. రాజకీయ పార్టీలే విచక్షణా రహితంగా పొత్తులకు సిద్ధపడుతున్నాయనేది ఈ ఎన్నికలలో ప్రధానాంశం. అన్ని పార్టీల బండారం బయటపడి, జనం దృష్టిలో అభాసుపాలై, మౌనంతో సరిపెట్టి, ఏ పార్టీకి అంతు చిక్కకుండా, వారి మనోభావాన్ని వ్యక్తం చేయడంతో రాజకీయ పార్టీలకు తల పిచ్చెక్కేటట్లు చేశారు. రాజకీయ పార్టీలు ఒక అంచనాకు రాలేకపోయాయి. దీంతో అన్ని పార్టీలు డబ్బును రంగం మీదకు తీసుకొచ్చి, వెదజల్లాయి. చిల్లర మల్లర అభివృద్ధి పథకాలే గాకుండా, డబ్బు పరిస్తే గాని, ఓట్లు రాలవు. ఒట్టి మాటలతో రావు అనే నిర్ధారణకు వచ్చారు. ఏ పార్టీని జనం నమ్మడం లేదనేది అందరికీ తెలిసివచ్చింది. చివరగా ధనాశ కలిగించడమే ప్రధానమైంది. అన్ని అడ్డదారులు తొక్కారు. జనాభీష్టంతోనే కాంగ్రెస్ గెలిచిందనుకుంటే పొరపాటే. ఇంతకన్నా గత్యంతరం లేకనే, ఇంకొక ప్రత్యామ్నాయ మార్గం లేదు గనుకనే, ఏవో కొన్ని తాత్కాలిక పథకాలతో కొంతవరకైనా కాంగ్రెస్ పార్టీ తీర్చింది గనుకనే ఇటువైపు మొగ్గారు.

అదే ప్రజల పక్షాన నిలబడే కార్మికవర్గ పార్టీ నాయకత్వాన ప్రత్యామ్నాయ మార్గం చూపే పార్టీ ఉండి, నాయకత్వం వహించి నట్లయితే, తప్పనిసరిగా ఇటువైపు వచ్చి ఉండేవారు. ఈ పార్టీలన్నీగూడ మట్టికరచి ఉండేవి. అయితే ఆ పరిస్థితులు ఉన్నాయనుకున్నప్పుడు, రాజ్యయంత్రాంగం చూస్తూ ఊరుకోదు. అయితే బూర్జువా ప్రజా

---

భావజాలం సమాంతరంగా రూపొందుతూ ఉన్నాయి. ఈ విరుద్ధ భావజాలాల సుడుల సంఘర్షణని అధిగమించకుండా వ్యక్తుల వ్యక్తిత్వాల నిర్మాణం కాగలవా?

సూర్యదేవర వెంకటనారాయణ తొలి పరిశీలనాత్మక వ్యాసం, మన సందేహానికి సమాధానాన్ని సూచనాత్మకంగా చెప్పింది. శేషగిరి చిన్నతనంలోనే అపర గాంధీని చూడగలిగినవారు, విరుద్ధాంశాల సమ్మేళనాన్నీ 'మిక్చర్ ఆఫ్ ఆపోజిట్స్' నీ గుర్తించగలిగారు. అతనిలో ఏ కోణం నుంచి చూసినా తాను నమ్మిన వాటిని విడనాడిన దాఖలాలు ఏ రూపంలోనూ లేవని స్పష్టీకరించారు.

సంకలన కర్త సమతా కోటేశ్వరరావు రెండు వ్యాసాలూ, మాస్టారి సామాజిక ఆచరణని క్రోడీకరించడమే కాదు, ఈ సంకలనంలోని అన్ని వ్యాసాలకీ భిన్నంగా, వారి మనో ప్రకృతిలోని మరో పార్శ్వాన్ని, విమర్శనాత్మకంగా విశ్లేషించారు. మహాత్మాగాంధీలా మాస్టార్లో ఉన్న 'సత్యశోధనా' ఆకాంక్షనీ వ్యక్తీకరించాయి. మాస్టార్లో వారికే తెలియకుండా ఫ్యూడల్ పురుషాధిక్య భావజాలం, ఎన్ని రూపాల్లో దాగి ఉందో విమర్శనాత్మకంగా వివరించాయి. ముఖ్యంగా స్త్రీల అందం విషయంలోనూ, స్త్రీ-పురుష, భార్యా-భర్తల సంబంధాల విషయంలోనూ పిల్లల పెంపకం విషయంలోనూ, వారి సమర్థనలు వారికున్నా, వారితో ప్రజాస్వామిక చైతన్యం ఎంత మాత్రం ఏకీభవించదు.

ఓసారి మాస్టారితో వాదించి విసిగిపోయిన కోటేశ్వరరావు, వారి మిత్రుడు నరహరి 'మీది వితండవాదం. మీరికమారరు' అని లేచి వచ్చేశారట. ఆ తరువాత వారిద్దరూ అలా అన్నందుకు బాధపడ్డారంట. ఆ మర్నాడు ఉదయమే మాస్టారు కోటేశ్వరరావు ఇంటికొచ్చి 'తన వాదనలో లోపాలేమిటో చెబితే సరిచేసుకుంటా' అన్నారట. మాస్టారికి విమర్శను స్వీకరించే సహృదయం ఉందని చెప్పిన ఈ వ్యాసంలోనే, ఆయన అభిరుచులు అధ్యయనం, వివిధ విషయాల మీద అభిప్రాయాలు, ఆయన నిజాయితీకి, చిత్తశుద్ధికి, చాదస్తానికి, మొండితనానికి నిదర్శనంగా నిలిచిన సంఘటనలూ ఉన్నాయి.

వ్యక్తిత్వ నిర్మాణంలో విశిష్ట పాత్రగల పట్టుదలే ఏ కారణంగా మితిమీరినా, ఎదుటివారికది 'మూర్ఖత్వం'గా కనిపిస్తుంది. అపార్థానికి అదే కారణమవుతుంది. ఆత్మీయులను దూరం చేస్తుంది. మానవీయ విలువలతో ఎదగాలనుకునే మనిషిని కూడా పెడసరం మనిషిగా మిగులుస్తుంది. ఈ అసంగత ప్రయాణం నుంచి వ్యక్తిని విముక్తం చేసే పరసువేది ప్రజాస్వామిక చైతన్యం మాత్రమే.

అది క్రియాశీల ప్రజాస్వామ్యవాదైన మాస్టారిని ఎందుకు విముక్తం చేయలేకపోయింది? ఈ ప్రశ్నకి సమాధానం డా. జతిన్‌కుమార్ వ్యాసం చివరకనిపిస్తుంది. సంక్లిష్టమైన సమాజంలో వ్యక్తి పాత్ర - వ్యక్తిత్వ నిర్మాణం ఎంత కష్టసాధ్యమో దీన్ని బట్టి తెలుసుకోవచ్చును.

నమ్మిన విలువలకు కట్టుబడిన ఆచరణశీలి శేషగిరి జీవితాన్నీ రచనల్నీ అందించే ఈ పుస్తకాన్ని అందరూ చదవాల్సిందే. వీ

స్వామ్యంలో గూడా మనకు కొంత వెసులుబాటు రావడానికి వీలున్నది. దోపిడీ వర్గాల అనైక్యతే ఆ వెసులుబాటు. వారిలో వారికున్న వైషమ్యాలు పరాకాష్టకు చేరినట్లయితే, మనం కొంతలో కొంతవరకు ఏదో ఒక గ్రూపుతో రాజీ చేసుకోవచ్చు. అయితే ప్రత్యామ్నాయానికి నాయకత్వం మన చేతుల్లో ఉన్నప్పుడు మాత్రమే ఇది జరుగుతోంది. మరో ప్రత్యామ్నాయం కోసం జనం ఎదురుచూస్తున్నారా, లేదా, అనేది ఎట్లా తెలుస్తుందంటే విప్లవ పార్టీల సమైక్యత, వారి కార్యాచరణ, ప్రజల విశ్వాసాన్ని ఏ మేరకు చూరగొంటున్నాయనేదనేదాని మీద ఆధారపడి ఉంది. రాబోయే రోజుల్లో విప్లవ పార్టీలన్నీ ఒక తాటిమీదకు వచ్చే పరిస్థితులు కూడా త్వరితం అవుతాయి. ఏదో ఒకటి తేల్చుకోవాల్సిన పరిస్థితి నాయకత్వాల మీదకొస్తుంది. విప్లవకారుల మధ్య కొట్లాటలతోనే సరిపెట్టు కోవడమా, లేక ఒక కార్యాచరణతోటి శత్రువుని ఢీ కొట్టడమా, ఏదో ఒకటి తేల్చుకోవాల్సిన పరిస్థితులు రాబోతున్నాయి. సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ నియంతృత్వ శక్తులన్నీ ఒక నమ్మకమైన పార్టీ వైపుకు రావాల్సిన పరిస్థితులు కూడా తరుముకొస్తున్నాయి. ప్రపంచ ఆర్థిక సంక్షోభం పరిస్థితులలో జనాన్ని మభ్యపెట్టి, అనేక మోసపుటెత్తుగడలతో, ఏ పార్టీ అయితే విజయం సాధిస్తుందో, అటువంటి పార్టీ సామ్రాజ్యవాదానికి అవసరం.

ప్రతిదేశం ఆంతరంగిక వ్యవహారాల్లో, అమెరికన్ సామ్రాజ్య వాదులు జోక్యం లేకుండా లేదు. ఈ ఎన్నికలు జరిగాయో, లేదో, అమెరికా ప్రభుత్వవర్గాలు, మన దేశ ఆంతరంగిక వ్యవహారాల్లో తలదూర్చి, ఇక్కడ ఉన్న తమకు నమ్మకమున్న పార్టీలకు, నాయకులకు సలహాలివ్వడమనేది ఎంత వాస్తవమో తెలుస్తుంది గదా! కనుక జిత్తుల మారితనంతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్‌కు వెనకాల సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ శక్తులన్నీ సమీకృతమై కాంగ్రెస్ అధికారాన్ని నిలబెట్టి, కాపాడుకుంటాయనేది నిజం. ప్రస్తుత దశలో మత పార్టీలు, ప్రాంతీయ పార్టీలు వెనుకబడిపోయాయి. ఈ సందర్భంలో దేశంలో రెండే రెండు ప్రత్యామ్నాయాలు ముందుకు రాబోతున్నాయి. ఒకటి, కాంగ్రెస్ నాయకత్వాన అమెరికన్ సామ్రాజ్యవాద బంటుగా ఇక్కడి దళారీ బూర్జువా వర్గాలు; రెండు, ప్రజల పక్షాన విప్లవ పార్టీల ప్రజా ప్రత్యామ్నాయం.

ఒకటి, దోపిడీ వర్గాలు అన్నింటికీ ప్రతినిధి. రెండవది, ప్రజలకూ, ప్రజాతంత్ర శక్తులకూ ప్రతినిధి, ఈ రెండింటి మధ్యనే ప్రధాన పోరాటంగా ఉంటుంది. ఈ ఎన్నికలలో నేర్చుకోవాల్సిన అతి ముఖ్యవిషయం ఒకటుంది. కాంగ్రెస్‌కు, ఇతర బూర్జువా పార్టీలకు ఉన్న తేడాను ప్రజల ఎట్లా అర్థం చేసుకొన్నారనేది. ఇదివరకటి తెలుగుదేశం పార్టీ కన్నా, బిజెపి కన్నా కాంగ్రెస్ కొంతమేలు అనే నిర్ణయానికి వచ్చారు ప్రజలు. ప్రధానంగా దోపిడీ వర్గాల పార్టీ అయినప్పటికీ ప్రజలకు ఉపయోగపడే తాత్కాలిక ఉపశమనాలు కలుగజేశారు. అవి ప్రజల్ని బాగా ఆకట్టుకొన్నాయి. ఈ నిజాన్ని కూడా విప్లవకారులు తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ఏవో కొన్ని పథకాలు ప్రజల దగ్గరకు చేరి, అభిమానం సంపాదించి, పెట్టినవనేది యథార్థం గాదా. ఒక్క డబ్బుతోనే గెలిచినారని, కేవలం మాయ మాటలతోనే గెలిచారని ఎట్లా అనగలం. తతిమ్మా పార్టీల కంటే కాంగ్రెస్ మేలని ప్రజలు భావించారు. 'ఎందుకంటే అంతకంటే గత్యంతరం లేదు.' ఎన్నికల బహిష్కరణ అనేది కూడా జనం విశ్వాసాన్ని చూరగొనలేదు. ఆ దశకు చేరుకోలేదు గనుక అది కూడా పని చేయలేదు. కాబట్టి భవిష్యత్ వ్యూహరచన చేసేటపుడు ఈ ఎన్నికల గుణపాఠం కూడా తీసుకొవాలి. విప్లవ పార్టీలు ఈ నలభై సంవత్సరాల పోరాట అనుభవాన్ని తీసుకొని, తగిన వ్యూహాలు రూపొందించుకోవాలి.

ఈసారీ అన్ని పార్టీలు విపరీతంగా డబ్బు కుమ్మరించాయి. డబ్బులు లెక్కపెట్టకుండా ఖర్చు పెట్టాయి తప్ప, ఇంకొక విధంగా గెలవలేవని చెప్పవచ్చు. ఎన్నికల ఫలితాలు వెలువడిన తర్వాత ఈ విషయాలన్నీ బహిర్గతమయ్యాయి. వాడెందుకు ఓడిపోయారంటే, వాడు డబ్బులు బాగా ఖర్చు పెట్టలేదు. అవతలి వాడితో సమానంగా ఖర్చు పెట్టలేదు కాబట్టే ఓడిపోయినాడు, ఇంకా ఒకటో, రెండో కోట్లు ఖర్చు పెట్టి ఉంటే గెలిచేవాడు అనే వారు. వీడు ఎందుకు గెలిచినాడయ్యా, అంటే డబ్బు ఎంతంటే అంత ఖర్చు పెట్టేశాడు. ఎక్కడి వాళ్లను అక్కడ కట్టి పడేశాడు. కాబట్టి గెలిచాడు. ఇలా డబ్బు పాత్ర ప్రధానమైంది. అధికార పార్టీ వాళ్లు, వాళ్ల అభివృద్ధి పథకాల వలన గెలిచినామని అనుకోవచ్చు గానీ, అదే నిజమైతే ఇంత డబ్బు ఎందుకు కుమ్మరించినట్లు.

చివరగా వామపక్ష పార్టీలుగా చలామణీలో ఉండే సిపిఐ, సిపిఐ (ఎం)ల గురించి కొంత తెలుసుకుంటే గాని, ఈ ఎన్నికల విశ్లేషణ పూర్తికాదు. వీరి అవకాశవాదం తెలుసుకుంటే గాని, సమగ్రంగా విశ్లేషించినట్లుకాదు. ఈ రెండు పార్టీలు ఎప్పటికంటే కూడా ఈ ఎన్నికలలో ఘోర పరాజయం పాలు గావడమే కాకుండా, వారి కుటిల నీతి కూడా బహిర్గమయింది. ఎప్పుడో మార్క్సిస్టు మహోపాధ్యాయులు, రివిజనిస్టుల గురించి చెప్పడం విన్నాం, పుస్తకాలలో చదివాం, ఈనాడు ప్రత్యక్షంగా చూస్తున్నాం. వారు ఆనాడు ప్రవచించిన రివిజనిస్టుల గురించిన లక్షణాలు. ఈనాటి రివిజనిస్టులకు అన్వయించుకుంటే, అవి చాలా వెనకబడి పోయాయా అని అనిపిస్తుంది. ఈనాటి రివిజనిస్టులు వారి పూర్వీకుల కంటే ఎంతో ముందుకు, రివిజనిస్టు అవకాశవాదాన్ని తీసుకొని వచ్చారు. వారు వాడే పదాలకు అర్థాలు ఎంత మాయలు ఉన్నాయో నిన్నటి ఎన్నికలలో వామపక్షాలు వ్యవహరించిన తీరు చూస్తే అర్థమవుతుంది. ఒకచోట మద్దతు ఇస్తున్నామంటారు, ఇంకొక చోట స్నేహపూర్వక పోటీ అంటారు. ఇదెక్కడి రాజకీయమో ఎవరికీ అంతు బట్టడం లేదు. స్నేహపూర్వక పోటీ అనే పదం వారి పూర్వీకులు కూడా ఉచ్చరించినట్లు లేదు. ఈ కొత్తపదాన్ని వాళ్లు అదనంగా చేర్చుకొన్నారు. వారి అవకాశవాద రాజకీయానికి ఇది మేలి ముసుగు. కాస్తంత ఇంగిత జ్ఞానం కలిగిన ఓటర్లెవరికీ కూడా ఆ మాటలు అర్థం కావడంలేదు.

ఈ రెండు పార్టీలూ ఒకే లక్ష్యం, సిద్ధాంత సారుప్యం కలిగి, ఒకే ఆచరణగలిగినటువంటి పార్టీలు. వీరే సీట్లు సర్దుబాటు చేసుకోలేక, శత్రుపూరిత వైఖరి కలిగిన ఇతర పక్షాలతో సర్దుబాట్లకు, పొత్తులకు వెంపర్లాడుతున్నాయి. ఇదెక్కడి సిద్ధాంతమో, ఇవెక్కడి రాజకీయాలో అని సామాన్య ప్రజలు కూడా చాలా తేలికగా అర్థం చేసుకోగలిగారు. అందుకే తగిన గుణపాఠం నేర్పారు. కాని వారు నేర్చుకోరు. ఏ

## వివరణ కోరిన సుప్రీంకోర్టు

ఆస్ట్రేలియా, కెనడా దేశాల్లో భారతీయ విద్యార్థులపై జరుగుతున్న జాత్యాహంకార దాడుల నుంచి వారికి రక్షణ కల్పించేందుకు తీసుకుంటున్న చర్యలపై జూన్ 26 నాటికి వివరణ ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని సుప్రీంకోర్టు ఆదేశించింది. ఇటువంటి ఘటనలు చోటు చేసుకోకుండా తీసుకుంటున్న చర్యలను తెలియజేయాలని కోరింది. భారతీయ విద్యార్థులపై జాత్యాహంకార దాడులను నిలువరించేందుకు కేంద్రం ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదని ఆరోపిస్తూ అడ్వకేట్ డి.కె. గార్గ్ వేసిన ప్రజా ప్రయోజనాల వ్యాజ్యాన్ని పరిశీలించిన ధర్మాసనం కేంద్రానికి ఈ ఆదేశాలు జారీ చేసింది.

## కాశ్మీర్‌లో ఘర్షణలు

కాశ్మీర్ ఉత్తర ప్రాంతంలోని బారాముల్లాలో మహిళపట్ల పోలీసులు అసభ్యంగా ప్రవర్తించిన కారణంగా ఘర్షణలు చెలరేగాయి. ఈ సందర్భంగా పోలీసులు జరిపిన కాల్పుల్లో ఇద్దరు మరణించగా, పలువురు గాయపడ్డారు. మరొక సంఘటనలో జూన్ 28న బారాముల్లా పోలీసు స్టేషన్‌కు వెళ్లి వచ్చిన ఒక మహిళ పోలీస్ స్టేషన్‌లో పోలీసులు తన పట్ల అనుచితంగా ప్రవర్తించారని ఆరోపించింది. దాంతో ఆగ్రహించిన ప్రజలు పెద్ద సంఖ్యలో పోలీస్ స్టేషన్‌పై దాడికి దిగారు. మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించిన పోలీసులపై చర్య తీసుకోవాలని డిమాండ్ చేశారు. ఈ ఘర్షణను నివారించడానికి పోలీసులు జరిపిన కాల్పుల్లో మహ్మద్ సలీం, తారీఖ్ అహ్మద్, మాలిక్ అనే ముగ్గురు యువకులు చనిపోగా, ముగ్గురు తీవ్రంగా గాయపడ్డారు.

## నిషేధం మావోయిస్టులకూ వర్తిస్తుంది

మావోయిస్టు పార్టీని కేంద్ర ప్రభుత్వం జూన్ 22న చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం కింద ఉగ్రవాద సంస్థగా పేర్కొంటూ నిషేధం విధించింది. లాల్‌ఘడ్ ఉద్యమం, ఇటీవలి వివిధ పరిణామాల నేపథ్యంలో కేంద్రం ఈ నిర్ణయం తీసుకుంది. ఈ నిషేధం రాష్ట్ర ప్రభుత్వాలతో సంబంధం లేకుండానే అమలులోకి వచ్చింది. ఇప్పటికే ఆ చట్ట పరిధిలో 33 సంస్థలు ఉన్నాయి. మావోయిస్టు పార్టీగా ఏర్పడక ముందు ఉన్న పీపుల్స్ వార్, మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్‌ల పై నిషేధం ఇదివరకే అమలులో ఉంది.

## బాబ్రీపై లిబర్హాన్ నివేదిక

పదిహేడేళ్ల సుదీర్ఘకాలం, 48 వాయిదాలు, 399 విచారణలు, వందమంది సాక్షుల విచారణ తరువాత బాబ్రీ మసీదు విధ్వంసంపై విచారణ జరుపుతున్న లిబర్హాన్ నేతృత్వంలోని విచారణ కమిషన్ తన నివేదికను జూన్ 31న ప్రధాని మన్‌మోహన్ సింగ్‌కు సమర్పించింది. ఈ నివేదికను బడ్జెట్ సమావేశాల్లో పార్లమెంట్‌లో ప్రవేశపెట్టే అవకాశముంది. జస్టిస్ లిబర్హాన్ కమిషన్ నివేదికపై తగిన చర్యలు తీసుకునేందుకు ప్రభుత్వం దాన్ని హోం మంత్రిత్వ శాఖకు పంపుతుందని భావిస్తున్నట్లు హోం మంత్రి చెప్పారు.

## డెహ్రాడూన్ ఎన్‌కౌంటర్

ఉత్తరాఖండ్‌లో జూలై 3న ఎంబిఏ విద్యార్థి రణబీర్ సింగ్ ఎన్‌కౌంటర్‌లో మరణించడంపై పలు అనుమానాలు వ్యక్తమయ్యాయి. ఈ సంఘటనపై ఫిర్యాదు చేయవద్దని తనను పోలీసులు బెదిరించినట్లు రణబీర్ తండ్రి రవిందర్ సింగ్ విలేకరులకు తెలిపారు. రణబీర్ సింగ్‌ను చంపినపుడు తాను చూసినట్టు సునీల్ వర్మ అనే వ్యక్తి తెలిపాడు. ఈ పరిణామాల నేపథ్యంలో డెహ్రాడూన్ 'ఎన్‌కౌంటర్'పై జాతీయ మానవ హక్కుల కమిషన్ సిబిఐ దర్యాప్తుకు ఆదేశమిచ్చింది.

## మనుషుల అక్రమ రవాణా

ఛత్తీస్‌ఘడ్‌లో సాగుతున్న మనుషుల అక్రమ రవాణా ఫలితంగా ఇప్పటికే మూడు వేలమంది యువతులు అదృశ్యమైనట్లు తెలుస్తోంది. ఆ రాష్ట్రంలోని ఐదువేల మిస్సింగ్ కేసుల్లో మూడువేల మంది యువతులేనని స్వయంగా పోలీసులే పేర్కొంటున్నారు. ఢిల్లీ, ముంబయి కేంద్రాలుగా పనిచేస్తున్న కన్సల్టెన్సీలే యువతులను ఉద్యోగాల పేరుతో ఆకర్షిస్తున్నాయని గ్రామీణ వికాస కేంద్రం అనే స్వచ్ఛంద సంస్థ తెలిపింది.

## ఐదు రాష్ట్రాలకు కొత్త గవర్నర్‌లు

ఐదు రాష్ట్రాలకు కొత్త గవర్నర్లను నియమిస్తున్నట్లు రాష్ట్రపతి భవన్ నుంచి జూలై 18న ఉత్తర్వులు జారీ అయ్యాయి. కర్నాటకకు చెందిన మార్గరేట్ ఆల్వాకు ఉత్తరాఖండ్ గవర్నర్ పదవి లభించింది. ఉత్తరాఖండ్ గవర్నర్‌గా ఉన్న బిఎల్ జోషిని ఉత్తరప్రదేశ్‌కు, జార్ఖంఢ్ గవర్నర్‌గా ఉన్న సయ్యద్ సిబ్తేని అసోంకు, నాగాలాండ్ గవర్నర్‌గా ఉన్న కె. శంకర్ నారాయణన్‌ను జార్ఖండ్‌కు మార్చారు. కాంగ్రెస్ నేత దేవేంద్రనాథ్ ద్వివేదీ గుజరాత్ గవర్నర్‌గా నియమితులయ్యారు.

## ఇవిఎం లతో అవకతవకలు

ఎలక్ట్రానిక్ ఓటింగ్ మెషిన్ (ఇవిఎం) లతో ఓట్ల అవకతవకలు చేయవచ్చని జన చైతన్య వేదిక తెలిపింది. జూలై 10న ఢిల్లీలో విలేకరుల సమావేశంలో ఇ.వి.ఎం.లలోని లొసుగులను బట్టబయలు చేసింది. ప్రోగ్రామింగ్‌ను మార్చి ఫలితాలను తారుమారు చేయవచ్చని రుజువు చేసింది. నెట్ ఇండియా రూపొందించిన ఒక ఇవిఎంను మాక్ పోలింగ్ ద్వారా పరీక్షించారు. ఓటర్లు ఏ మీట్ నొక్కినా, ఎవరికి ఓటు వేసినా, తాము అనుకున్న అభ్యర్థికి ఎంత శాతంతో గెలిపించాలో, లేదా ఓడించాలో ప్రోగ్రామింగ్ ద్వారా నిర్ణయించవచ్చని జన చైతన్య వేదిక ప్రతినిధులు నిరూపించారు. ఇవిఎం లు అవకతవకలకు అతీతం కాదని రుజువయ్యే దాకా వాటిని ఉపయోగించరాదనీ, దీనిపై సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజనాల పిటిషన్ దాఖలు చేశామని తెలిపారు.

## వర్గీకరణ బిల్లు పెట్టాలి

ఎస్.సి.ల వర్గీకరణపై పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టాలని ఢిల్లీలోని వాల్మీకి భవన్‌లో జరిగిన ఏడు రాష్ట్రాల దళిత నాయకుల సమావేశం కేంద్రాన్ని డిమాండ్ చేసింది. జూలై 31న దేశవ్యాప్తంగా దళిత మహాసమ్మేళనం నిర్వహించాలని వారు నిర్ణయించారు. వీ

## పత్రికా సంఘాల విలీనం

ప్రపంచంలోని 18 వేలకు పైగా ప్రచురణలు, 15 వేలకు పైగా న్యూస్ వెబ్‌సైట్‌లు, మూడు వేలకు పైగా కంపెనీలకు ప్రాతినిధ్యం వహిస్తున్న రెండు ప్రపంచవ్యాప్త అసోసియేషన్‌లు జూలై 1న విలీనం కానున్నట్లు వాటి ప్రతినిధులు జూన్ 26న ఒక సంయుక్త ప్రకటనలో తెలిపారు. పారిస్ కేంద్రంగా గల వరల్డ్ అసోసియేషన్ ఆఫ్ న్యూస్ పేపర్స్ (డబ్ల్యు.ఎ.ఎన్.) జర్మనీలోని డార్మ్‌స్టడ్ కేంద్రంగా ఉన్న ఐ.ఎఫ్.ఆర్.ఎ. లు కలిసి వాన్-ఇఫ్రా గా ఏర్పడనున్నాయి. ప్రస్తుత వాన్ అధ్యక్షుడు గేవిన్-ఓ-రీలి కొత్తగా ఏర్పడుతున్న సంస్థకు కూడా అధ్యక్షుడుగా ఉంటారు.

## ఆకలి బాధితులు వంద కోట్లు

ప్రపంచంలో పెరుగుతున్న ఆర్థిక మాంద్యం, పడిపోతున్న ఆదాయాలు, పెరుగుతున్న ధరల కారణంగా రోజురోజుకూ ఆకలి బాధితుల సంఖ్య పెరిగిపోతోంది. ప్రపంచ వ్యాప్తంగా ఆకలి బాధితుల సంఖ్య ఇప్పుడు వంద కోట్లకు చేరుకుందనీ, ఇది ప్రపంచ జనాభాలో ఆరో వంతనీ ఐక్యరాజ్య సమితి అనుబంధ ఆహార, వ్యవసాయ సంస్థ (ఎఫ్ఎఒ) తెలిపింది. ఈ పరిణామం అంతర్జాతీయంగా శాంతి భద్రలకు విఘాతం కలిగించే ప్రమాదం ఉందని ఎఫ్ఎఒ ఆందోళన వ్యక్తం చేసింది. ఆకలి బాధితుల్లో ఎక్కువ మంది ఆసియా - పసిఫిక్ దేశాల్లోనే ఉన్నారని తెలిపింది.

## నేపాల్‌లో మరో ప్రజా ఉద్యమపోరు

నేపాల్ మాజీ ప్రధాని, మావోయిస్టు పార్టీ అగ్రనేత ప్రచండ దేశంలో మరో ప్రజా ఉద్యమాన్ని ప్రారంభిస్తామని తెలిపారు. జూన్ 21న పశ్చిమ ఖాట్మాండులో పొలాంగ్ గ్రామంలో కార్మికులను ఉద్దేశిస్తూ, ప్రజాస్వామిక శక్తులతో కలిసి త్వరలో తాము దేశంలో మూడో ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించనున్నామని చెప్పారు. మావోయిస్టులను తిరిగి అడవి బాటకు నెట్టాలని కొన్ని శక్తులు ప్రయత్నిస్తున్నాయనీ, కాని తమ పార్టీ సిపిఎన్ (మావోయిస్ట్) తిరిగి సాయుధ పోరు మార్గాన్ని చేపట్టే అవకాశం లేదనీ చెప్పారు. ఈ ఉద్యమంలో దేశంలోని ప్రగతి నిరోధకులు, అవకాశవాదులూ, విద్రోహులంతా తుడిచిపెట్టుకు పోతారని ఆయన అన్నారు.

## ఎన్నికల రభస

జూలై 12న ఇరాన్‌లో జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో ఎలాంటి మోసంగాని, అవకతవకలు గాని జరగలేదని 'పెద్దల మండలి' తెలిపింది. ఈ ఎన్నికలను రద్దు చేయాల్సిన అవసరం లేదని తేల్చి చెప్పింది. మరోవైపు ఆందోళనకారులు ప్రభుత్వం జారీచేసిన హెచ్చరికలను ఖాతరు చేయకుండా రాజధాని టెహ్రాన్ వీధుల్లోకి గుంపులు గుంపులుగా వచ్చి ఆందోళన చేపట్టారు. ప్రభుత్వం వీరి మీద రెవల్యూషనరీ గార్డులను ప్రయోగిస్తామంటూ హెచ్చరికలు జారీచేసింది. 'పార్లమెంట్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లు' జూలై 26 నుంచి ఆగస్ట్ 19లోగా అధ్యక్షుడు, నూతన కేబినెట్ ప్రమాణ స్వీకారం చేయాలంటూ ప్రకటించింది.

## డ్యాంలకు బీటలు

నిధుల దుర్వినియోగం, నాణ్యత లోపించడం వల్ల చైనాలోని నలభై శాతం డ్యాంలు ప్రమాదస్థితికి చేరువలో ఉన్నాయని చైనా డైలీ అనే పత్రిక ఆరోపించింది. ఎల్లో నదిపై ఏడాది, రెండేళ్ల క్రితమే నిర్మించిన డ్యాంలకు పగుళ్లు ఏర్పాడ్డాయనీ, భారీ ముంపుకు గురయ్యే ప్రమాదంలో ఉన్నాయనీ పత్రిక ఆందోళన ప్రకటించింది. గన్సూ రాష్ట్ర పరిధిలో ఈ నదిపై నిర్మించిన డ్యాంలన్నీ ప్రమాదకర స్థాయికి చేరుకున్నాయని తెలిపింది.

## ఎల్.టి.టి.ఇ. కి కొత్త నేత

కుమరన్ పద్మనాథన్ (కెపి) ఎలియాస్ పద్మనాభన్ ఎల్.టి.టి.ఇ.కి అధినేత బాధ్యతలు చేపట్టారు. పద్మనాభన్ జాఫ్నాకు సమీపంలోని కనికెసెందురాయ్ పట్టణంలో 6 ఏప్రిల్ 1955న జన్మించారు. ఆయన తమిళం, ఇంగ్లిష్, ఫ్రెంచ్, సింహళ భాషల్లో అనర్గళంగా మాట్లాడగలడు. ఎల్.టి.టి.ఇ.కి ప్రపంచవ్యాప్త నెట్‌వర్క్ ఏర్పాటు చేయడంలో, నిర్వహించడంలో కీలకపాత్ర వహించాడు. అత్యంత అధునాతన ఆయుధాలు, సైనిక సామగ్రిని సమకూర్చాడు. వివిధ దేశాల్లోని తమిళులతో, పలు దేశాల అత్యున్నత స్థాయి ప్రతినిధులతో, అంతర్జాతీయ సంస్థల ప్రతినిధులతో పద్మనాభన్‌కు సంబంధాలు ఉన్నాయి.

## ఫ్రాన్స్ కార్మికుల హెచ్చరిక

ఫ్రాన్స్‌లోని ఫ్యాక్టరీ కార్మికులు తమ డిమాండ్లను వెంటనే పరిష్కరించకపోతే ఫ్యాక్టరీలను పేల్చేస్తామని హెచ్చరించారు. కార్మికులు ఛాటెల్లెరౌల్ట్ అనే పారిశ్రామిక పట్టణంలో న్యూ ఫాబ్రిస్ అనే ఆటో సప్లయి ఫ్యాక్టరీనీ పేల్చడానికి గ్యాస్ సిలిండర్‌లను ఎలక్ట్రికల్ తీగలతో కనెక్ట్ చేసి ఉంచారు. జూలై 31 లోగా తమకు ముప్పైవేల యూరోలు నష్టపరిహారం చెల్లించక పోతే ఫ్యాక్టరీని పేల్చేస్తామని న్యూ ఫాబ్రిస్‌కి ముఖ్యమైన ఇద్దరు ఖాతాదార్లు రెనౌల్ట్ - పిఎస్ఎ ప్యుజ్యోట్-సిట్రొయిన్‌లకు హెచ్చరిక జారీచేశారు. ఈ ఫ్యాక్టరీ మూతపడిస్తే మొత్తం 366 కార్మికుల ఉద్యోగాలు కోల్పోతారు. ఫ్రాన్స్‌లో ఆటోమొబైల్ రంగ పరిస్థితి మాంద్యం ప్రభావం కన్న చాలా సంవత్సరాల ముందు నుంచే దిగజారడం ఆరంభమయింది. ఈ సంవత్సరం ఉత్పత్తిలో నలభై శాతం తగ్గుదల నమోదయింది.

## పెరుగుతున్న నిరుద్యోగులు

ప్రపంచవ్యాప్తంగా రోజురోజుకూ నిరుద్యోగుల సంఖ్య పెరుగుతోంది. ఒక్క జూన్ నెలలోనే 4,67,000 మంది ఉద్యోగాలు కోల్పోయారు. ఉద్యోగాలు కోల్పోవడంలో పురుషులు అధిక సంఖ్యలో ఉన్నారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఈ పరిస్థితి మళ్లీ ఇప్పుడు వచ్చింది. నిర్మాణ, ఉత్పత్తి రంగాలలో భారీగా కార్మికులు ఉద్యోగాలు కోల్పోతున్నారు. ఒక్క ఆరోగ్య సంక్షేమ రంగంలో మాత్రమే ఉద్యోగాలు పెరుగుతున్నాయి. దీనికి తోడు ఉన్న ఉద్యోగుల జీతాలు భారీగా కుదించబడుతున్నాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జూన్ 2009 నుండి 20 జూలై 2009 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2081)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) |
| ఆదిలాబాద్ | 2 | – | 28 | – | – | – | 8 | 5 | – | 1 | 20 | 28 | 27 | – | – | – | 5 | 3 |
| హైదరాబాద్ | – | – | 22 | – | – | – | 15 | 11 | – | – | 38 | 31 | 2 | – | – | – | 15 | – |
| కరీంనగర్ | 7 | 6 | 89 | – | – | – | 7 | 15 | 2 | 5 | 22 | 40 | 31 | – | – | – | 4 | 4 |
| ఖమ్మం | 1 | – | 29 | – | – | – | 18 | 7 | – | 9 | 23 | 9 | 42 | – | – | – | – | 5 |
| మహబూబ్‌నగర్ | | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | 6 | 1 | 35 | – | – | – | 7 | 5 | – | 3 | 44 | 21 | 11 | – | – | – | – | – |
| నలగొండ | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | – | – | 38 | – | – | – | 3 | 7 | – | 4 | 25 | 19 | 4 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 8 | – | 22 | – | – | – | 5 | 10 | – | – | 45 | 20 | 26 | – | – | – | 6 | – |
| వరంగల్ | – | – | 42 | – | – | – | 9 | 19 | – | – | 29 | 36 | 24 | 4 | – | – | – | 5 |
| అనంతపురం | 3 | – | 29 | – | – | – | – | 3 | – | 7 | 26 | 14 | – | – | – | – | – | – |
| చిత్తూరు | 2 | – | 8 | – | – | – | 6 | – | – | 3 | 15 | – | 8 | – | – | – | – | 2 |
| కడప | 1 | – | 10 | – | – | – | 7 | 3 | – | 1 | 34 | 5 | 5 | – | – | – | – | – |
| కర్నూలు | 8 | – | 54 | – | – | – | 9 | 11 | – | 4 | 38 | 48 | 13 | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | – | – | 36 | – | – | – | 4 | – | – | 2 | 40 | 48 | 9 | – | – | – | 2 | 1 |
| గుంటూరు | – | – | 5 | – | – | – | 20 | 2 | – | 2 | 22 | 8 | – | – | – | – | 2 | – |
| కృష్ణా | 2 | – | 16 | – | – | – | 16 | 3 | – | 5 | 27 | 18 | 4 | – | – | – | – | 6 |
| ప్రకాశం | 1 | – | 8 | – | – | – | 9 | 1 | – | 8 | 35 | 6 | – | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | 10 | – | – | – | 7 | – | 1 | – | 15 | 18 | 18 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | 10 | – | – | – | – | 3 | – | 3 | 12 | 7 | 2 | – | – | – | 1 | 4 |
| విజయనగరం | 2 | – | 5 | – | – | – | 2 | 2 | – | 4 | 16 | 8 | 3 | – | – | – | – | 2 |
| **మొత్తం** | **43** | **7** | **496** | **–** | **–** | **–** | **152** | **107** | **3** | **61** | **526** | **384** | **229** | **4** | **–** | **–** | **35** | **34** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నలగొండ – డి. మహేష్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – శంకరయ్య, వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – ఎం. ఆదిశేషయ్య; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – శ్యాంసుందర్ రావు; ప్రకాశం – కె. మల్లికార్జున్; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. రమణ; విజయనగరం – డి. సుధాకర్;

*గత సంచికలో వ్యవసాయ రంగ ఆత్మహత్యలు 42 బదులుగా పొరపాటున 442గా అచ్చయింది. గమనించగలరు

వీక్షణంకు రాష్ట్రంలోనేకాదు, దేశమంతటా, విదేశాలలోనూ విస్తృతంగా పాఠకులున్నారు

మా పాఠకులలో మేధావులు, విద్యార్థులు, పరిశోధకులు, ఉపాధ్యాయులు, పత్రికా రచయితలు, ఉద్యమాల కార్యకర్తలు, సామాజిక, రాజకీయ కార్యకర్తలు, ప్రజా నాయకులు, విధానకర్తలు... ఒకరేమిటి తెలుగు సమాజంలో ప్రభావశీల వ్యక్తులందరికీ కరదీపిక వీక్షణం

## ప్రపంచానికి మీ మాట అందాలంటే
## వీక్షణంలో ప్రకటించక తప్పదు

### వీక్షణంలో మీ ప్రకటనలకై చెల్లించాల్సిన రుసుం

| | | | |
|---|---|---|---|
| చివరి కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 20,000 |
| రెండవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 15,000 |
| మూడవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 15,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 12,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో హాఫ్ పేజీ) | : | రు. | 7,500 |

వివరాలకు సంప్రదించవలసిన చిరునామా


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 29/7/2009 • Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao